# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక పత్రిక

డిసెంబర్ 2007 | 77 | రు. 10

- ఫోకస్ : తెలుగుసీమలో సామాజిక ఉద్యమాలు
  మూడు వ్యాసాలు
- సబ్సిడీలు పాలకుల అవసరం
- కృష్ణా గోదావరి బేసిన్ సహజవాయువు ప్రజల సొత్తు
- కోర్టు ధిక్కారం సమంజసమేనా?
- ప్రాథమికవిద్యకు పాడెకడుతున్న సర్కార్
- పాలకుల పరస్పర నిందారోపణలు
- వరి మద్దతు ధర

# వీక్షణం 79

రాజకీయార్థిక, సామాజిక మాస పత్రిక

ఫిబ్రవరి 2008
సంపుటి : 6
సంచిక : 2

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ





**వీక్షణం చందా వివరాలు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రు. 120 |
| 3 సంవత్సరాల చందా | రు. 350 |
| 5 సంవత్సరాల చందా | రు. 550 |
| 10 సంవత్సరాల చందా | రు. 1000 |

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా**



**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : reachcdrc@yahoo.com



డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజెన్సీస్, హైదరాబాద్.**
ఫోన్ : 98482 49695
98484 28516

ప్రింటర్స్
**చరితా ఇంప్రెషన్స్,**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411


సంపాదకీయం

## సోషలిజం సహజం, అవసరం

'సోషలిజం స్వప్న సీమ కానెకాదు, నిజం సుమా, ఆకలంత సహజమది, అన్నమంత అవసరమది' అని కవి చెరబండరాజు మామూలు మాటలలో సోషలిజం గురించి చేసిన అద్భుతమైన విశ్లేషణను తమను తాము మార్క్సిస్టులమని పిలుచుకుంటున్న తలలుపండిన మహామేధావులకు మరొకసారి గుర్తుచేయవలసి వస్తున్నది. జీవితమంతా సోషలిజం కోసమే ధారపోశామని చెప్పుకునే ఆ మహామహులు సోషలిజం ఎప్పుడో సుదూరాన సాధ్యమయ్యేది మాత్రమేనంటున్నారు. ఇవాళ్టి పరిస్థితుల్లో సహజమైనదీ, అవసరమైనదీ, సాధ్యమైనదీ సోషలిజం కాదనీ, పెట్టుబడిదారీ విధానమేననీ అంటున్నారు. తమ మాటలను పత్రికలు వక్రీకరించాయనీ, తమ ఉద్దేశ్యం అది కాదనీ ఆ తరువాత ఎన్ని సవరింపులు ప్రకటించినా, వారి ఆచరణ వారు అనలేదంటున్న మాటకే దగ్గరిగా ఉంది గనుక ఆ మాటల మీద పూర్తి హక్కులు వారికి ఇవ్వవలసిందే. ప్రస్తుత వ్యవస్థ పెట్టుబడిదారీ వ్యవస్థ అని, ఇందులో సోషలిజం సాధించడం సాధ్యం కాదనీ, అందులోనూ ఒక సమాఖ్య రాజ్యంలో రాష్ట్ర ప్రభుత్వం తలచుకున్నా కూడ సోషలిజం సాధించజాలదనీ, కనుక ప్రజల జీవన ప్రమాణాలను అభివృద్ధి చేసే పారిశ్రామికీకరణ సాగించడం, ఎక్కువలో ఎక్కువ ప్రజాసంక్షేమ చర్యలు చేపట్టడం కన్న ఇతర పనులు చేయజాలమనీ వారు అంటున్నారు. భారత సమాజంలో చారిత్రకంగా ఆర్థిక అసమానలతలతో పాటు కుల, మత, స్త్రీ-పురుష, భాషా, ప్రాంతీయ అసమానతలు పాతుకుపోయి ఉన్నాయి గనుక బహుశా మరే సమాజానికన్న ఎక్కువగా భారత సమాజానికే సోషలిజం అత్యవసరం. అయినా ఇవాళ్టికివాళ సోషలిజం సాధ్యమవుతుందని అనుకునే అమాయకులెవరూ ఉండరు. అది సుదూర లక్ష్యమన్నమాట నిజమే. కాని అప్పటికయినా సోషలిజం స్థాపించదలచుకున్నవారి ప్రయాణం ఆ దిశగా ఉన్నదా లేదా అనేది అసలు ప్రశ్న. కొనసాగుతున్న రాజ్యాంగం కింద ఒక రాష్ట్ర ప్రభుత్వం దానికదిగా సోషలిజాన్ని ప్రవేశపెట్టజాలదనీ, రాజకీయార్థిక అభివృద్ధి నమూనాను మార్చజాలదనీ అనే మాట కూడ కొంత నిజమే. కాని రాష్ట్ర ప్రభుత్వం చేయగల పనుల్లో, రాష్ట్ర ప్రభుత్వ పరిధిలోపలే చేయదగిన ప్రజోపయోగ, ప్రజానుకూల పనుల్లో గత ఆరు దశాబ్దాల అనుభవంలో వామపక్ష ప్రభుత్వాలు ఏమన్నా చేశాయా అనేది ప్రశ్న. రాజ్యాంగంలోని కేంద్ర, ఉమ్మడి జాబితాల్లో ఉన్న పనులలో ప్రజానుకూలంగా ఎందుకు వ్యవహరించడం లేదని ఒక రాష్ట్ర ప్రభుత్వాన్ని అడగడం అసమంజసమే. కాని రాష్ట్ర జాబితాలో ఉన్న పనులనయినా వామపక్ష ప్రభుత్వాలు విభిన్నంగా అమలు చేశాయా అనేది ప్రశ్న. తెలంగాణ సాయుధ పోరాట విరమణ తర్వాత, 1952 మొదటి సార్వత్రిక ఎన్నికలలో పాల్గొని పార్లమెంటరీ రాజకీయాలలో ప్రవేశించిన తర్వాత, సోషలిజం స్థాపనకొరకు ఈ దేశంలో సాయుధ పోరాటం అవసరం లేదనీ, శాంతియుత పరివర్తన ద్వారా, పార్లమెంటరీ పద్ధతి ద్వారా సోషలిజం స్థాపించవచ్చుననీ వామపక్షాలు భావిస్తున్నాయి. కాని ఆ దారిలో ఆరు దశాబ్దాల తర్వాత సాధించినది ఏమిటనీ, ప్రజా ప్రత్యామ్నాయంగా ఉండకపోయినా, పార్లమెంటరీ ప్రత్యామ్నాయంగా ఉండలేకపోవడానికి కారణమేమిటనీ అడగకతప్పదు. భూస్వామ్య, పెట్టుబడిదారీ పాలకవర్గ ముఠాలలో ఏ ముఠా ప్రగతిశీలమైనదో వెతుకుతూ, తాము అప్పటికి ప్రగతిశీలమైనదని నిర్ధారించిన వారితో ఎన్నికల పొత్తులు ఏర్పరచుకుంటూ వామపక్షాలు పార్లమెంటరీ పరిధిలోనైనా ప్రత్యామ్నాయంగా ఉండగల శక్తిని కోల్పోయాయి. తాము అంటకాగిన తానులలో ముక్కలయి పోయాయి. ఆ ఆరు దశాబ్దాల సావాస ఫలితంగానే ఇవాళ ఒకవైపు ప్రపంచీకరణను వ్యతిరేకిస్తున్నట్టు కనబడుతూ కాగితాలూ పుస్తకాలూ అమ్ముకుంటూ మరొకవైపు ఆ ప్రపంచీకరణను దొడ్డిదారిన సమర్థించే దివాళాకోరు విధానాలకు చేరాయి. ఆ విధానాల తార్కిక ఫలితమే ఇవాళ సోషలిజం అవసరంలేదనీ, పెట్టుబడిదారీ పారిశ్రామికీకరణ తప్ప గత్యంతరం లేదనీ చేస్తున్న ప్రకటనలు. ఈ దేశంలో నెహ్రూ నుంచి ఇందిర దాకా సోషలిజాన్ని శుష్క నినాదంగా మార్చివేస్తే, వారిలో ప్రగతిశీలాన్ని వెతుకుతూ దారితప్పిన కమ్యూనిస్టు నామధారులు దానికి ఆశావహ నినాద స్థాయిని కూడ నిరాకరిస్తున్నట్టున్నారు. ◆

## చిన్నకారు సంధించే ప్రశ్నలు

దేశ పారిశ్రామిక రంగంలో వంద సంవత్సరాలకుపైగా పనిచేస్తున్న టాటా మోటర్స్ సంస్థ ఎక్కువమందికి అందుబాటులోకి తేవడం కొరకు నానో పేరుతో లక్ష రూపాయల విలువగల చిన్న కారును ప్రవేశపెడుతున్నానని ప్రకటించింది. మధ్యతరగతికో, దిగువమధ్య తరగతికో అందుబాటులో ఉండేలా చిన్న కారును ప్రవేశపెట్టాలనే ఆలోచన పైకి సదుద్దేశ్యపూరితమైనదిగానే కనబడవచ్చుగాని ఈ చిన్నకారు వ్యవహారంలో ఆలోచించవలసిన అంశాలు అనేకం ఉన్నాయి. ఇప్పటివరకూ సొంతవాహనాల ఖరీదువల్ల ఆ వాహనాల కొనుగోలు దారుల మార్కెట్ మొత్తం జనాభాలో ఏ ఐదు శాతం లోపుగానో ఉన్నదనుకుంటే, ఇప్పుడు ఈ చౌకకారు వల్ల హఠాత్తుగా ఆ మార్కెట్ రెండురెట్లో మూడు రెట్లో పెరిగిపోతుంది. ఆ కార్లకు అవసరమైన ఇంధన వినియోగం అదే స్థాయిలో పెరిగి ఆ మార్కెట్ కూడ పెరిగిపోతుంది. రహదారులు, స్పేర్ పార్టులు, సర్వీస్ స్టేషన్లు, అనుబంధ వస్తువులు, హోటళ్లు, మోటెళ్లు, పార్కింగ్ లాట్లు, మెకానిక్ షెడ్లు, రుణ సౌకర్యాలు మొదలయిన మార్కెట్లన్నీ పెరిగిపోతాయి. అంటే ఈ చిన్నకారు ప్రవేశం వల్ల వినియోగదారులకు ఒనగూడే ప్రయోజనం కన్న ఎక్కువగా పెట్టుబడిదారులకు, మదుపుదారులకు ప్రయోజనాలుంటాయన్నమాట. అలా వచ్చిన కొత్త కార్లవల్ల పెరిగిపోయే కాలుష్యం, రవాణా రద్దీ సమస్యలు సరేసరి. సులభమైన, సురక్షితమైన, సామాజికంగా అవసరమైన ప్రజా రవాణా వ్యవస్థను అభివృద్ధి చేసి మెరుగుపరిచే బదులు, వ్యక్తులను, కుటుంబాలను స్వార్థం వైపు, సంకుచిత్వం వైపు నెట్టదలచుకున్న పాలకవర్గ విలువలకు అనుగుణంగానే ఈ చిన్నకార్ల ఉత్పత్తి జరుగుతున్నది. ఇటీవలి అభివృద్ధి పథకాలన్నిటిలోనూ ఉన్నట్టుగానే చిన్న కార్ల అభివృద్ధిలో కూడ ప్రధాన ఫలితం పెట్టుబడిదార్లకు, పాలకులకు, ఆశ్రితులకు దక్కగా, ఉపఫలితం మాత్రం వినియోగదారులకు దక్కుతుంది. ప్రజారవాణా సౌకర్యాలు మెరుగుపడాలని ప్రభుత్వం మీద ఒత్తిడి తేగలిగిన, మాట్లాడగలిగిన, రాయగలిగిన, ప్రజాభిప్రాయాన్ని మార్చగలిగిన మధ్యతరగతికి ఈ చిన్నకార్ల తాయిలం ఇవ్వజూపడం ద్వారా ప్రజా రవాణారంగం గురించిన ఆలోచనలను తగ్గించాలని పాలకులు ప్రయత్నిస్తున్నారు. కుటుంబాలు తమ బాగు, తమ సౌకర్యం తాము చూసుకుని పొరుగువారి బాగు గురించీ సౌకర్యం గురించీ ఆలోచించకుండా చేయడానికి ఒక మార్గాన్ని ఈ చిన్న కార్ల ద్వారా వేయదలచుకున్నారు.

పోతన వంటి మహాకవులు ఎక్కడ పుడితేనేమి, దాన్ని వివాదం చేయడం ఎందుకు అంటూనే కొందరు విజ్ఞులు ఆయన కడప జిల్లా ఒంటిమిట్టలో పుట్టాడనే వివాదాన్ని పైకి తెస్తున్నారు. 'అన్నమైతేనేమిరా, సున్నమైతేనేమిరా' అంటూనే, 'ఈ పాడుపొట్టకు అన్నమే వేతామురా' అని తత్వాలు పాడినట్టుందిది. మహాభాగవత కర్త బమ్మెర పోతనామాత్యుడు ఎక్కడివాడనే వివాదం 1840ల నుంచి 1910ల వరకూ తెలుగు సాహిత్యం రంగంలో ఉండింది. పురాణం హయగ్రీవశాస్త్రి 1846లో పరిష్కరించి ప్రకటించిన భాగవతంతో ఈ వివాదం మొదలయింది. ఏకశిలానగరం అంటే ఓరుగల్లేనని, బమ్మెర జనగామ సమీపంలోని బమ్మెరేనని అప్పటికి ఉన్న నమ్మకానికి విరుద్ధంగా హయగ్రీవశాస్త్రి ఏకశిలానగరం అంటే ఒంటిమిట్ట అని తప్పుడు వ్యాఖ్యానం చేశారు. ఆ తర్వాత దాదాపు ఆరు దశాబ్దాలపాటు పోతన జన్మస్థల వివాదం నడిచింది. రెండుపక్షాలూ తమతమ సాక్ష్యాధారాలను చూపుతూ వాదనలు చేశాయి. జయంతి రామయ్య పంతులు 1914లో ఇరుపక్షాల వాదనలనూ తులనాత్మక పరిశీలన చేసి పోతన జన్మస్థలం వరంగలేనని నిర్ధారించారు. ఈ నిర్ధారణ ఎంత బలమైన, సమంజసమైన ఆధారాలతో సాగిందంటే, అప్పటివరకూ పోతన జన్మస్థలం ఒంటిమిట్టేనని నమ్ముతూ, తన కవుల చరిత్రము మొదటి కూర్పులో ఆమాటే రాసిన కందుకూరి వీరేశలింగం, జయంతి రామయ్యతో దాదాపు శత్రుత్వం లాంటిది ఉండికూడ, రెండవ కూర్పులో తన అభిప్రాయాన్ని సవరించుకున్నాడు. నిజానికి దానితో ఆ వివాదం సమసిపోయినట్టే లెక్క. కాని ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు తర్వాత తెలంగాణ వనరులను సొంతంగా కొల్లగొట్టడంలోనూ, దేశదేశాల సంపన్నులకు హక్కుభుక్తం చేయడంలోనూ సిద్ధహస్తులైన కోస్తాంధ్ర, రాయలసీమ పాలకులు గతంలో సమసిపోయిన వివాదాలను కూడ ఇప్పుడు తవ్వితీసి తెలంగాణ సాంస్కృతిక వారసత్వాన్ని కూడ కొల్లగొట్టదలచుకున్నట్టున్నారు. కనుక పోతన జన్మస్థల వివాదం ఏ పూర్వరంగంలో మళ్లీ రగుల్కొంటున్నదో గుర్తించి, సరైన వైఖరి తీసుకోవలసి ఉంది. ఇటువంటి నేపథ్యంలో రెండో రాష్ట్రాల పునర్విభజన కమిషన్ ఏర్పాటు వంటి అర్థంలేని ప్రకటనలు కూడా భగ్గున మండడం సహజమే.

## బేనజీర్ భుట్టో హత్య

పాకిస్తానీ సమాజంలో ప్రజాస్వామిక రాజకీయాలకు, భిన్నాభిప్రాయ ప్రకటనలకు, సంస్కారపూరితమైన, బాధ్యతాయుతమైన ప్రవర్తనకు అవకాశం లేదని పాలకవర్గాలు పదే పదే చూపుతున్నాయి. సింధు నాగరికతా కాలం నుంచి లాహోర్‌లో ఉజ్వల ప్రజారాజకీయాలు నడిచిన ఇరవయోశతాబ్ది తొలిరోజుల దాకా గొప్ప సంస్కృతిని ప్రదర్శించిన ఆ నేల ఇవాళ నెత్తురోడుతున్నది. ఉపఖండంలో రష్యా బంటుగా ఉండిన భారత పాలకవర్గాలకు ప్రతిగా తమ కీలుబొమ్మలు రాజ్యంచేసే రంగస్థలంగా పాకిస్తాన్‌ను తీర్చిదిద్దాలని బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులు చేసిన కుట్రలు ఆ దేశంలో రాజకీయ సరళినే వక్రమార్గం పట్టించాయి. రాజకీయ నాయకత్వాలను, సైనిక నాయకత్వాలను ఒకరిమీదికి ఒకరిని ఉసిగొల్పి, అందరినీ తమ గుప్పెట్లో పెట్టుకుని, ఆయుధపోటీలోకి ఈడ్చి, పెద్ద ఆయుధ కొనుగోలుదారుగా మార్చి అమెరికన్ పాలకవర్గాలు నడిపిస్తున్న దుర్మార్గ నాటకంలో ఒకానొక ఘట్టమే ప్రతిపక్ష నాయకురాలు బేనజీర్ భుట్టో హత్య. జనరల్ ముషారఫ్ సైనికపాలన పట్ల వ్యతిరేకత, జుల్ఫికర్ అలీ భుట్టో కుటుంబానికి జరిగిన అన్యాయాల పట్ల సానుభూతి పెద్ద ఎత్తున ప్రజా చైతన్యానికి దారితీస్తాయని, పాకిస్తాన్ ప్రజలు తమ భవిష్యత్తును తామే నిర్ణయించుకోగలమనే విశ్వాసంతో ఒక నిర్ణయం తీసుకోబోతున్నారని అర్థమైన సామ్రాజ్యవాదులు, పాకిస్తానీ మత ఛాందసశక్తులు, సైనిక పాలకులు కలిసిగాని, వేరువేరుగా గాని పన్నిన కుట్రతో బేనజీర్ బలి అయిపోయింది. ఉప ఖండంలో ప్రతి ఒక్క దేశంలోను – భారతదేశం, శ్రీలంక, బంగ్లాదేశ్, పాకిస్తాన్, నేపాల్ – సమాజాలలో అంతర్గతంగా విపరీతమైన హింస పెరుగుతుండడం, అన్ని దేశాలలోను పాలకులు, ప్రధాన నిర్ణయాధికారం వహించినవాళ్లు డజను మందికి పైగా హత్యకు గురి కావడం మన సామాజిక నిర్మాణాల గురించి, పాలనల గురించి, ప్రజాస్వామిక స్వభావాలు అంతర్గతంగా ఎదగడం కాకుండా బయటినుంచి అంటుకట్టడం వల్ల జరిగిన పరిణామాల గురించి మరొక్కసారి తీవ్రంగా ఆలోచించవలసిన సమయం వచ్చింది. ◆

## లోపలి పేజీల్లో...

### మతోన్మాదం

*నూతన ఆర్థిక విధానాల శకంలో మతప్రతీకలతో పాటుగానో, అంతకన్న ఎక్కువగానో ఆర్థిక రాజకీయ ప్రతీకల అవసరం పెరిగింది. సంఘపరివారం వైపు ఎక్కువగా ఆకర్షితులవుతున్న మధ్యతరగతి, నడమంత్రపు సంపన్నులకు ఇవాళ మతంతో పాటుగా అభివృద్ధి భావజాలం కూడ ఉంది. అందువల్ల ఇవాళ్టి హిందుత్వ కేవలం మతతత్వ, భూస్వామ్య, అగ్రవర్ణ, పితృస్వామిక అర్థంలో మాత్రమే లేదు. ఆ పాత లక్షణాలన్నీ అలాగే ఉంచుకుంటూనే సామ్రాజ్యవాద, నవసంపన్న, పతన సంస్కృతికి కూడ గొడుగుపడుతున్నది.*

**ఫోకస్ : మతోన్మాదం**





### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028



- **సాహిత్య వ్యాసాలు** – చలసాని ప్రసాద్ – విరసం ప్రచురణ, 196 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : సహచర బుక్ మార్క్, దిశ పుస్తక కేంద్రం, నవోదయ బుక్ హౌస్, కుశల పుస్తక నిలయం, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **గంగానమ్మ** – విజయ – స్వేచ్ఛా సాహితి ప్రచురణ, 61 పేజీలు, 1/8 డెమీ, రు. 15, ప్రతులకు: స్వేచ్ఛా సాహితి, జి1, మైత్రీ రెసిడెన్సీ, 3–6–394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ – 500 029. అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **మెట్ల మీద** – మిడ్కో కథలు – విరసం ప్రచురణ, 240 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : చలసాని ప్రసాద్, ఎల్ఐజి – 15, హౌసింగ్ బోర్డ్ కాలనీ, విశాఖపట్నం, అన్ని పుస్తకాల షాపుల్లో
- **పచ్చని బతుకులపై నిప్పుయి కురుస్తున్న రాజ్యం** – సల్వాజుడూం తీరుతెన్నులపై ఒక పరిశీలన – బి.డి. దమయంతి – విరసం ప్రచురణ, 56 పేజీలు, 1/8 డెమీ, రు. 15, ప్రతులకు : అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **కార్యదర్శి నివేదికలు** – కె.వి.ఆర్. – విరసం ప్రచురణ, 67 పేజీలు, 1/8 డెమీ, రు. 15, ప్రతులకు : సహచర బుక్ మార్క్, దిశ పుస్తక కేంద్రం, నవోదయ బుక్ హౌస్, కుశల పుస్తక నిలయం, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **కల్లముందరి చరిత్ర** – నాలుగు దశాబ్దాల విప్లవోద్యమం – సమకాలిక వ్యాఖ్యలు – ఎన్. వేణుగోపాల్ – స్వేచ్ఛా సాహితి ప్రచురణ, 309 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు : ఎన్. వేణుగోపాల్, జి1, మైత్రీ రెసిడెన్సీ, 3–6–394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ – 500 029. అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **చితాభస్మం లోంచి...** – కవిత్వం 1982–2004 – అమర్ – విరసం ప్రచురణ, 165 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు : సహచర బుక్ మార్క్, దిశ పుస్తక కేంద్రం, నవోదయ బుక్ హౌస్, కుశల పుస్తక నిలయం, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **ఆశల దారి** – సజ్జా వెంకటేశ్వర్లు – చేనేత ప్రచురణలు, 79 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు : సజ్జా వెంకటేశ్వర్లు, జయలక్ష్మీ టాకీసు దగ్గర, వేటపాలెం పోస్ట్, ప్రకాశం జిల్లా – 523 187. సెల్ : 9951169967
- **రాజూగైడ్** – ఆశారాజు – ఝరీ పొయిట్రి సర్కిల్ ప్రచురణ – 52 పేజీలు, 1/8 డెమీ, రు. 40
- **బహుమానం** – ఆశారాజు – ఝరీ పొయిట్రి సర్కిల్ ప్రచురణ – 131 పేజీలు, 1/8 డెమీ, రు. 50

పై రెండు పుస్తకాల ప్రతులకు : విశాలాంధ్ర బుక్ హౌస్, నవోదయ బుక్ హౌస్, దిశ పుస్తక కేంద్రం, ప్రజాశక్తి బుక్ హౌస్



## పాఠకుల వీక్షణం

'వీక్షణం' సంపాదకీయం, సంపాదకీయ వ్యాఖ్యలు బాగుంటున్నాయి. మా సినిమా పరిభాషలో ఓపెనింగ్ షాట్‌లో లోపల ఏముందో తెలియాలంటారు. అలా ఉంటున్నాయి.

**– కాకరాల**
హైదరాబాద్

'వీక్షణం'లో వ్యాసాలు చాలా బాగుంటున్నాయి. కొత్త పుస్తకాలు చదవాలనిపిస్తోంది. ఎన్ని పుస్తకాలని చదవగలం! 'వీక్షణం' 78 సంచికలు వెలువడిందంటే చాలా గొప్పే. ఆరు, ఏడు సంవత్సరాల నుండి ఇంత సక్రమంగా రాజకీయ సామాజిక విషయాలపై లోతుగా చర్చ చేయడం అభినందించదగినదే. ఇందులో ప్రతి వ్యాసం కొత్త కొత్త కోణాలతో అధికారయుతంగా వెలువడుతున్నాయి. వీటన్నింటినీ తిరగవేయడానికి పాత సంచికలు అందుబాటులో ఉండటం లేదు. ఎవరో ఒకరు చదవడానికి తీసికెళ్లి, తిరిగి ఇవ్వక పోవడం జరుగుతోంది. దయచేసి, సంవత్సరాల వారిగా పన్నెండు సంచికల చొప్పున 'బౌండ్' చేయించేసి, అమ్మకానికి అందుబాటులో ఉంచితే పరిశోధకులకు ఉపయోగ పడ్తాయి. విషయం అంతా ఒక చోట ఉంటుంది. ఈ విషయం తెలంగాణ వ్యాసాలు, వరవరరావు గారివి చదివిన తర్వాత స్ఫురణకు వచ్చింది. చాలా వ్యాసాలు వీక్షణంలో రిఫర్ చేసి ఉన్నాయి. కనుక నా సూచనను గమనించి పాత కాపీలు బౌండ్ చేసి అందుబాటులో ఉంచితే సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్‌కి కూడా తోడ్పడతాయి.

***– హజరత్ అలీ***
వేమూరు

తెలుగుజాతి ఎంత పరిణతి సాధించిందో వీక్షణంలో రచనలు చూపుతున్నాయి. ఇది ఎంతో కాలంగా సాగుతున్న ఉద్యమాలు సామూహికంగా సాధించిన విజయం. కొందరు రచయితల వ్యక్తీకరణలో కనబడుతోంది. జనవరి సంచికలో గ్రామీణాభివృద్ధి గురించి వ్యాసాలు లోతయిన ఆలోచనలను ప్రేరేపించాయి.

**– ఎ. రాజేంద్రబాబు**
హైదరాబాద్

ఇప్పటికి మూడుసార్లు ఖైదీల విడుదల చివరి నిమిషంలో ఆగిపోవడం వలన వృద్ధ ఖైదీల, అనారోగ్య ఖైదీల బాధలు భరించలేనిదిగా ఉంది. విడుదల కొరకు ఎంతో ఆశగా ఎదురుచూసిన ఖైదీలు, వారి కుటుంబ సభ్యుల ఆశలు చివరి నిమిషంలో అడియాశలయ్యాయి. ఆ బాధనుంచి ఇప్పటికీ తేరుకోలేనిదిగా, తీవ్ర అన్యాయం ఖైదీలమైన మా విడుదల విషయంలో జరుగుతోంది. ఇంతకంటే దారుణం మరొకటి ఉండదని రాష్ట్ర వ్యాప్తంగా ఖైదీలు, కుటుంబ సభ్యులు, అన్ని ప్రజాసంఘాలు, అన్ని ప్రతిపక్ష పార్టీలు, మేధావులు, రచయితలు, పాత్రికేయులు, సమాజ సంక్షేమ దయార్ద్ర హృదయులందరూ తమ నిరసనను వివిధ రూపాలలో తెలుపడమే కాకుండా చివరికి నిరాహార దీక్షల ద్వారా కూడా ఖైదీల బాధలను ప్రభుత్వానికి ఇప్పటికే అనేకసార్లు తెలియజేసారు. ఖైదీలు, వారి కుటుంబ సభ్యుల ఆందోళనకు రాష్ట్రవ్యాప్తంగా మద్దతు లభించిన విషయం కూడా జగమెరిగిన సత్యం. గత రెండు మూడు సంవత్సరాల నుంచి ఇప్పటికి మూడుసార్లు ఖైదీల జాబితాను జైళ్ల అధికారుల నుంచి తెప్పించుకుని పరిశీలించి విడుదల చేసే చివరి నిముషంలో రాజకీయ దురుద్దేశ్యంతో ఒకరిద్దరు కలిగించిన కొన్ని ఆటంకాల వల్ల ఖైదీల విడుదల ఆగిపోయి ఇటు ఖైదీలు, అటు వారి కుటుంబ సభ్యులు అనుభవిస్తున్న బాధలు వర్ణనాతీతంగా ఉంది. ఇప్పటికైనా ఖైదీల విడుదలకై ప్రభుత్వం ప్రత్యేక చర్యలు చేపడుతుందని ఆశిస్తున్నాం.

***– జీవిత ఖైదీలు***
కేంద్ర కారాగారం
కడప

వీక్షణం పత్రికలో వివిధ అంశాలపై, వివిధ సామాజిక రంగాలకు సంబంధించిన సమస్యలపై లోతైన విశ్లేషణలతో ఫోకస్‌గా ప్రతిసారీ చేస్తున్న కృషి చాలా అభినందనీయం. కాని ఫోకస్‌గా వస్తున్న వ్యాసాలు కొన్ని అసమగ్రంగా ఉంటున్నాయి. మరింత పరిశోధనతోను, మరింత సమగ్రంగాను తేగలిగితే తెలుగు సమాజాన్ని అర్థం చేసుకోవడంలో ఈ ఫోకస్ ఎంతో ఉపయోగపడుతుందనడం అతిశయోక్తి కాదు.

***– రాజశేఖర్***
హైదరాబాద్

### అసహజ మరణాలు నమోదు చేద్దాం!

ఆగస్ట్ 2006 నుంచి వీక్షణంలో అసహజ మరణాల సూచి ప్రారంభించాం. మన చుట్టూ అసహజంగా చనిపోతున్న రైతులు, చేనేత కార్మికులు, వరకట్న మరణాలు, రకరకాల ప్రమాదాలలో చనిపోతున్నవారు, వైద్యం అందక, ప్రకృతి వైపరీత్యాలతో మరణిస్తున్నవారు, హత్యలు ఇలా, అనేక సామాజిక రంగాలనుంచి మరణిస్తున్నవారి సంఖ్యనైనా నమోదు చేయడమే ఈ శీర్షిక ఉద్దేశ్యం. ఏయే సామాజిక, రాజకీయార్థిక కారణాలతో చనిపోతున్నారో పరిశోధన చేయాల్సి ఉంది. మేము చేస్తున్న ఈ ప్రయత్నంలో మీరూ పాలుపంచుకోవచ్చు. మీ జిల్లాలో అసహజంగా చనిపోతున్న వారి వివరాలను మాకు పంపండి. దీనికి పారితోషికంగా వీక్షణం ప్రతిని పంపిస్తాం. ఆసక్తి గలవారు వివరాలకై సంప్రదించండి. ఫోన్ నెం. 99891 89250, 99493 91028

**– సంపాదకులు**

### వీక్షణం మీ ముంగిట

'వీక్షణం' పత్రిక ఇప్పుడు మీకు మరింత చేరువలోకి వచ్చింది. రాష్ట్రంలోని అన్ని పట్టణాలలో, టౌన్‌లలోని న్యూస్ స్టాండ్‌లలో అందుబాటులో ఉంది. ఇక ఆలస్యమెందుకు... వెంటనే మీ ప్రతిని తెచ్చుకోండి!

పాకిస్తాన్ పీపుల్స్ పార్టీ నేత, బేనజీర్ భుట్టో రావల్పిండి నగరంలో జరిగిన కాల్పులు, ఆత్మాహుతి దాడిలో మరణించారు. ఎన్నికల ర్యాలీలో ప్రసంగాన్ని ముగించుకుని వెనక్కి వెళ్తున్న బేనజీర్‌పై కాల్పులు జరపడం, బాంబు విసరడం ఒకేసారి జరగడంతో ఆమె అక్కడికక్కడే మరణించారు. బేనజీర్‌తో పాటు కనీసం ఇంకో ఇరవై మందికి పైగా ఈ దాడిలో మరణించారు. ఈ హత్యకి పర్యవసానంగా పాకిస్తాన్‌లోని పలు నగరాలలో హింసాకాండ చెలరేగింది. ముషారఫ్ ప్రభుత్వమే హత్యకి బాధ్యత వహించాలని పాకిస్తాన్‌లోని ప్రతిపక్ష పార్టీలు డిమాండ్ చేశాయి. బేనజీర్ కుమారుడు బిలావల్ పార్టీ అధ్యక్షుడిగా ఎన్నికయ్యారు. పాకిస్తాన్ పీపుల్స్ పార్టీతో కలిసి పనిచేస్తానని నవాజ్ షరీఫ్ చెప్పారు. ప్రతిపక్షాల డిమాండ్ మీద స్పందించిన పాకిస్తాన్ ప్రభుత్వం హత్య గురించి పరిశోధించేందుకు స్కాట్‌ల్యాండ్ యార్డ్ సహాయాన్ని కోరింది. అల్‌ఖాయిదా – తాలిబాన్ల దాడి ఫలితంగానే బేనజీర్ మరణించిందని ప్రభుత్వ వాదన. జనవరిలో జరగవలసిన ఎన్నికలని ఈ హత్య కారణంగా ఫిబ్రవరికి వాయిదా వేశారు. బేనజీర్ హత్యకు అసలు కారకులెవరో దాని పరిణామాలు పాకిస్తాన్ రాజకీయ వ్యవస్థపై ఎలాంటి ప్రభావం చూపుతాయో ముందు ముందు తెలుస్తుంది.

కెన్యాలో జరిగిన ఎన్నికలలో ఎవరికి ఎక్కువ ఓట్లు లభించాయనే విషయంపై తీవ్ర వివాదం చెలరేగడంతో అది దేశవ్యాప్తంగా వివిధ తెగల మధ్య హింసకు దారితీసింది. అధ్యక్షుడు కిబాకీకి, ప్రతిపక్ష నేత ఒడింగాకి మధ్య జరిగిన పోటీలో కిబాకి గెలిచాడని ఎలక్షన్ కమిషన్ ప్రకటించడంతో మొదలైన హింస మొత్తం దేశానికి పాకింది. ఎన్నికలు సవ్యంగా జరగలేదని, ఓట్లు లెక్కించడంలో పొరపాట్లు చేసారని, ఎలక్షన్ కమిషన్ తప్పుడు ఫలితాలు వెల్లడిస్తోందని ప్రతిపక్షాల ఆరోపణ. రెండు పక్షాల మధ్య హింస దాదాపు రువాండా పరిస్థితిని గుర్తు తెచ్చేటట్టుగా ఉంది. ఇరుపక్షాల మధ్య సంధి కుదిర్చేందుకు ఆఫ్రికాకు చెందిన అనేకమంది నాయకులు ప్రయత్నిస్తున్నారు. ఇప్పటి వరకు జరిగిన హింసాకాండలో కొన్ని వందలమంది ప్రజలు మరణించగా, కొన్ని వేల మంది తమ ఊళ్లను, ఇళ్లను వదిలేసి శరణార్థులుగా మారారు.

దాదాపు రెండు నెలల ప్రశాంతత తర్వాత గాజాలో హమాస్, ఫతా మద్దతుదారుల మధ్య జరిగిన కొట్లాటలలో ఎనిమిది మందికి పైగా మరణించారు. అరవై మందికి పైగా గాయపడ్డారు. ఫతా 43వ యానివర్సరీ సందర్భంగా జరిగిన సంబరాలలో రెండు పక్షాల వారి మధ్య వివాదాలు చెలరేగడంతో హింస ప్రారంభమైంది. వెంటనే హమాస్ ప్రభుత్వం సంబరాలని, పబ్లిక్ మీటింగులని అన్నింటిని నిషేధించింది.

జార్జియాలో జరిగిన ఎన్నికలలో అమెరికా మద్దతుదారైన అధ్యక్షుడు మైఖేల్ సాకాష్‌విలి గెలిచారని అక్కడి ఎన్నికల అధికారులు తెలిపారు. అయితే, ఎన్నికల ఫలితాలు తప్పని, చాలా పెద్ద ఎత్తున రిగ్గింగ్ జరిగిందని ప్రతిపక్షాల వాదన. ఈ వాదనని సాకాష్‌విలి మద్దతుదారులు, ఎన్నికల కమిషన్ కూడా కొట్టిపారేసారు. గత సంవత్సరం నవంబరులో ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిగిన ర్యాలీలు, ఇతర నిరసన కార్యక్రమాల పర్యవసానంగా సాకాష్‌విలి అధ్యక్ష పదవికి రాజీనామా చేసి తిరిగి ఎలక్షన్లలో పాల్గొన్నారు.

అమెరికా అధ్యక్ష పదవికి ప్రజల ఓట్ల కన్నా ముందుగా డెమోక్రాట్, రిపబ్లికన్ పార్టీలు తమ అభ్యర్థులను ఎన్నుకునే సంప్రదాయం ఉంది. అమెరికాలోని వివిధ రాష్ట్రాలలో రెండు పార్టీలలోని అభ్యర్థుల మద్దతు కూడగట్టుకునే ప్రయత్నాలు చేసిన తర్వాత ఎవరికి ఎక్కువ ఓట్లువస్తే వారు అధ్యక్ష పదవికి పోటీలో నిలబడతారు. అమెరికా చరిత్రలోనే మొదటిసారిగా డెమోక్రాట్ల తరపున, మహిళా అభ్యర్థిగా హిల్లరీ క్లింటన్, నల్లజాతివాడైన బారాక్ ఒబామా పోటీ పడుతున్నారు. వీరిద్దరిలో ఎవరు గెలిచి అధ్యక్ష పదివిని చేపట్టినా అది అమెరికా చరిత్రలోనే అతి పెద్ద మైలురాయి. అయితే, విదేశాంగ విధానంలో వీరిద్దరి మధ్య పెద్ద తేడా లేకపోవడం మూలాన, అలాగే రిపబ్లికన్ పార్టీ విదేశాంగ విధానానికి, వీళ్లకి తేడా లేకపోవడం వలన ఎవరు అమెరికా అధ్యక్షులైనా ప్రపంచ ప్రజలకి పెద్దగా ఒరిగేదేమీలేదు. అన్ని దేశాల కన్నా అగ్రగామిగా, సూపర్ పవర్‌గా నిలిచిన అమెరికాలో ఒక స్త్రీ కాని, ఒక నల్లజాతి మనిషికాని అధ్యక్షులవ్వడానికి ఇన్ని వందల ఏళ్లు నిరీక్షించాల్సి వచ్చిందంటే అదెలాంటి అగ్రగామి దేశమో అనే అనుమానం రాక తప్పదు.

ఇజ్రాయిల్, పాలస్తీనాల మధ్య వివాదాన్ని పరిష్కరించడానికి, పశ్చిమాసియా దేశాల మద్దతు సంపాదించడానికి, అమెరికా అధ్యక్షుడు జార్జి బుష్ మూడురోజులు ఇజ్రాయిల్‌లోనూ, వెస్ట్ బ్యాంక్‌లోనూ పర్యటించారు. అయితే, ఈ పర్యటన పర్యవసానంగా ఆయన ఆశించినంత మద్దతేమీ దక్కలేదు. ఇజ్రాయిల్ – పాలస్తీనాల మధ్య వివాదం పరిష్కరించడానికి ఆయన చేసిన సూచనలని హమాస్ తోసిపుచ్చింది. ఇతర అరబ్ దేశాల మీడియా ప్రతినిధులు కూడా వాటిని తీవ్రంగా విమర్శించారు. బుష్ పర్యటనని వ్యతిరేకించిన వారిలో లెబనాన్‌కి చెందిన హిజ్‌బోల్లా గ్రూపు, బాహ్రెయిన్ ప్రతిపక్ష కూటమి మొదలైనవి కూడా ఉన్నాయి. ఇరాన్‌కి వ్యతిరేకంగా అరబ్‌దేశాల మద్దతు సంపాదించడానికి బుష్ చేసిన ప్రయత్నం కూడ బెడిసికొట్టింది. అమెరికాకి అత్యంత సన్నిహితంగా మెలిగే సౌదీ అరేబియా కూడా ఇరాన్‌కి వ్యతిరేకంగా ఏ చర్యా తీసుకోవడానికి నిరాకరించింది. మొత్తానికి బుష్ పశ్చిమాసియాలో సాధించదలచుకున్నదేదీ సాధించకుండానే వెళ్లారు. ◆

*మాల మాదిగల నాయకులు చిత్తశుద్ధితో ఐక్యతకు కృషిచేయాలనీ, ఉమ్మడి సమస్యల కోసం, హక్కుల కోసం ప్రగతిశీల ఉద్యమ సంస్థలూ, మేధావులూ పోరాటాలు చేపడితే ఐక్యత సాధించగలమనీ అంటున్నారు* **జె. గౌతమ్**

# మాల మాదిగల మధ్య అపోహలులేని ఐక్యత కావాలి

ఎస్సీ, ఎస్టీలు ఐక్యంగా ఉమ్మడి హక్కుల సాధనకు ఆందోళనలు చేపట్టాలని ఎం.ఆర్.పి.ఎస్. వ్యవస్థాపక అధ్యక్షుడు కృష్ణ మాదిగ, ప్రకాశం జిల్లా సంతనూతలపాడు ఎమ్మెల్యే దారాసాంబయ్యల నేతృత్వంలో జనవరి 23న ఎస్సీ,ఎస్టీల ఐక్యవేదిక ఏర్పడటం ఆహ్వానించదగ్గ పరిణామం. సామాజికన్యాయం ప్రాతిపదికన హక్కులు, అవకాశాలు జనాభానిష్పత్తి ప్రకారం పంచుకునే సూత్రబద్ధ విధానాన్ని ఉమ్మడిగా ఆమోదించుకుని తాము (ప్రధానంగా మాలమాదిగలు) ఐక్య ఉద్యమానికి సన్నద్ధమవుతున్నామనీ, జస్టిస్ ఉషామెహ్రా కమిషన్‌ముందు ఇరువర్గాల తరపున 'రిజర్వేషన్ల వర్గీకరణను అంగీకరిస్తున్నాం' అని తాము వాంగ్మూలం ఇవ్వనున్నట్లు కూడా వీరు ప్రకటించారు. ఎస్సీ రిజర్వేషన్లు అందుకోవడంలో ఉపకులాలమధ్య సమతుల్యం దెబ్బతిన్నమాట వాస్తవమని రిజర్వేషన్లను జిల్లా, జోన్, రాష్ట్రస్థాయిలో జనాభానిష్పత్తి ప్రకారం ఏకులానికి ఎక్కడ ఎన్ని ఉద్యోగాలు వస్తాయో లెక్కించి ప్రభుత్వంతో సంప్రదింపులు జరిపి నియామకాలు జరిగేట్లు చూస్తామని కూడా వెల్లడించారు.

అలాగే ఎస్టీల్లోకూడా వర్గీకరణ అవసరమని ఈ అంశాన్ని లంబాడాహక్కుల పోరాటసమితి నేతలు ఆమోదించారని వివరించారు. స్థూలంగా వర్గీకరణ అంశంపై మాలమాదిగల మధ్య (కృష్ణమాదిగ, దారాసాంబయ్య) ఏకాభిప్రాయం కుదిరిందనే విషయాన్ని ప్రకటిస్తూ ఎస్సీ,ఎస్టీ ఉపప్రణాళికల అమలు, నోడల్‌ఏజెన్సీకి అధికారాలు, ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్లు లాంటి ప్రధాన అంశాలతో పాటు 63 అంశాల ప్రాతిపదికగా ఐక్యఉద్యమాన్ని చేపట్టనున్నట్లు వేదిక నాయకులు పాత్రికేయుల సమావేశంలో ప్రకటించారు. పైన ఉదహరించిన విషయాలపట్ల ఎస్సీ, ఎస్టీలు మరీముఖ్యంగా మాల మాదిగలు ఐక్యంగా ఉద్యమిస్తున్న పరిణామాన్ని సామాజికన్యాయ ఉద్యమ శక్తులు, ప్రగతిశీల ప్రజాసామ్యశక్తులు మేధావులు తప్పనిసరిగా ఆహ్వానించడమే కాక ఇప్పటికైనా ఈవిధమైన కార్యరంగానికి ఉపక్రమిస్తు న్నందుకు వేదికబాధ్యులను, తెరవెనుక పెద్దలను అభినందించడంలో తటపటాయించాల్సిన పనిలేదు.

అయితే ఈ ఐక్యవేదిక సన్నాహాలు జరుగుతున్న క్రమంలో కొన్ని మాలమాదిగ సంఘాల నుండి వెల్లడవుతున్న నిరసనలను నిశితంగా పరిశీలించడంతో పాటు గతంలో వీరిమధ్య సంయమనం, ఐక్యతదిశగా జరిగిన ప్రయత్నాలనుకూడా నెమరువేసుకుని నేడు జరుగుతున్న పరిణామాలపట్ల ఒక అంచనాకు రావడం ప్రజాస్వామ్య, సామాజిక న్యాయ ఉద్యమశక్తులకు ఎంతో అవసరం. ముఖ్యంగా రిజర్వేషన్ల వర్గీకరణ కేంద్రంగా మాలమాదిగల మధ్య గత పద్నాలుగేళ్లుగా పరస్పరం రెచ్చగొట్టుకునే ధోరణులతో పరిస్థితి అదుపు తప్పుతుందనుకున్న ప్రతిసందర్భంలో సంయమనం కోసం అనేకశక్తులు చేసిన కృషి చాలా మేరకు రాష్ట్రంలోని ఉద్యమ పరిశీలకులకు తెలుసు.

మాలమాదిగ సంఘాల నాయకుల మధ్య పరస్పర దూషణలు ఎద్దేవాలు సామాన్య ప్రజల్లో కూడా అలజడిని కలిగిస్తున్నాయని, రిజర్వేషన్ల వర్గీకరణ అంశం న్యాయమైనదే అయినా మాల మాదిగల మధ్య శతృపూరిత విభేదాలు పొడచూపడం నష్టదాయకమని భావించినవారు ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం (రత్నమాల నాయకత్వంలో) మాలమాదిగ ప్రజలు, నాయకులు సంయమనం పాటించాలని, దళిత బహుజన, ప్రగతిశీల సంస్థల, మేధావుల సంతకాలు సేకరించి బహిరంగంగా విజ్ఞప్తిచేసిన సందర్భాలు ఉన్నాయి. అలాగే మాలమాదిగ నాయకులు ఒకరినొకరు దూషించుకుంటూ ప్రజలను రెచ్చగొట్టే చర్యలకు పూనుకోవద్దని పీపుల్స్‌వార్ లాంటి (నేటిమావోయిస్టు) పార్టీలు బహిరంగ ప్రకటనలూ చేసాయి. మాలకులంలో పుట్టి విప్లవ, దళిత ఉద్యమాల్లో గుర్తింపు పొందిన కె.జి.సత్యమూర్తి, గద్దర్, బొజ్జాతారకం, కత్తిపద్మారావు లాంటి అనేకమంది వర్గీకరణ ఉద్యమాన్ని బలపరుస్తూ, సానుకూలంగా వుంటూ, లేదా వ్యతిరేకించకుండా మౌనంగా వుంటూ పరోక్షంగా ప్రత్యక్షంగా మాలమాదిగల మధ్య ఘర్షణకు తావులేకుండా తమవంతు దోహదం చేశారు. (ఈకృషి చిత్తశుద్ధితో ఆశించినంతలేదనే విమర్శలూ వున్నాయి) అలాగే జనశక్తి పార్టీతోపాటు ఆపార్టీ నుంచి బయటకొచ్చిన అమరుడు మారోజు వీరన్న కూడా దళితులమధ్య ఐక్యతకై కృషి చేశాడు. దళిత బహుజన మహాసభ సంస్థద్వారా ఉ.సాంబశివరావు ఆధ్వర్యంలో అనేక కులసంఘాలు వర్గీకరణ ఉద్యమానికి మద్దతుగా ఉంటూనే 'జెంటిల్‌మెన్

అగ్రిమెంట్' ద్వారా మాలమాదిగలమధ్య ఐక్యతను సాధించాలని 'ఎబిసిడికాదు ఎబిసి చాలు' అనే విధానపత్రాన్నికూడా తయారుచేసి ప్రజల మధ్యకు తీసుకెళ్ళారు. ఒక్కమాటలో మాదిగల ఉద్యమాన్ని ప్రజాస్వామిక ఉద్యమంగా, సామాజికన్యాయ ఉద్యమంగా గుర్తించి ఆ ఉద్యమానికి అనేకవిధాల సహాయసహకారాలు అందించడమే కాకుండా 'సంఘీభావకమిటీ'గా వుంటూ అనేక ఉద్యమశక్తులు, మేధావులూ ప్రతిసందర్భంలోనూ వర్గీకరణసాధనకు, మాలమాదిగల మధ్య సమస్య పరిష్కారానికి, సంయమనానికి, ఐక్యతకు ఉమ్మడి సమస్యలపై ఐక్యఉద్యమానికి ఎంతో తీవ్రంగా ఎన్నోసార్లు తమవంతు ప్రయత్నాలు చేశారు.

ఇదేవిధంగా రాష్ట్రంలో ఎం.ఆర్.పి.ఎస్. స్ఫూర్తితో మొగ్గతొడిగిన అనేక అట్టడుగు కుల సంఘాలు అన్నీ కలిసి 'మహాజన సంఘర్షణ సమితి' సామాజిక ఐక్యసంఘటనగా, 'మహాజనఫ్రంట్' రాజకీయ కూటమిగా 1999 అసెంబ్లీ ఎన్నికల సమయంలో ఏర్పడి 'అణగారిన కులాల ఐక్యదండోరా' గా రాష్ట్రవ్యాపితంగా ప్రచారంచేసి వేలాదిమందిని సమీకరించడం జరిగింది. వర్గీకరణను ఆమోదిస్తూ ఏర్పడిన మహాజన ఫ్రంట్‌లో వర్గీకరణ అంశాన్ని వదులుకుంటే మాలమహానాడు కూడా కలిసివస్తుందని పి.వి.రావు ఆనాడు షరతుపెడితే ఆషరతును నాటి మహాజనఫ్రంట్‌లోని సంఘాలు ఆమోదించకుండా ఎం.ఆర్.పి.ఎస్. వెంట గట్టిగా నిలిచాయి.

దీంతో మాలమహానాడు నాయకుడు పి.వి.రావు ఈ కూటమిలోకి రాకుండా కాంగ్రెస్ టికెట్‌కోసం ప్రయత్నించాడు. దీంతో మాలమాదిగల సమత్వాన్ని సూచించేవిధంగా మహాజనఫ్రంట్ కమిటీలో కృష్ణమాదిగ అధ్యక్షుడిగా వుంటే ప్రధాన కార్యదర్శిగా వర్గీకరణను బలపరిచే మాలకులానికి చెందిన జె.గౌతమ్‌ను పెటాల్సి వచ్చింది. అలాంటి మహాజనఫ్రంట్ నుండి ఎం.ఆర్.పి.ఎస్. ఎన్నికల తర్వాత వైదొలగి తనసొంతదారి చూసుకోవడం వేరేచరిత్ర. కానీ ఇక్కడ గుర్తుచేయాలనుకుంటున్నదేమంటే వర్గీకరణ ఉద్యమానికి సంఘీభావంగా ఉన్న అనేకశక్తులు చేయలేని సాధించలేని 'మాలమాదిగల ఐక్యత' అంటే మాలమహానాడు, ఎం.ఆర్.పి.ఎస్.ల మధ్య కృషిని కొందరు పాలకపార్టీల్లోని ఎస్సీనాయకులు, ఎన్జీవో నాయకులు కలిసి ఆనాటి మాలమహానాడు నాయకుడు పి.వి.రావు, ఎం.ఆర్.పి.ఎస్. నాయకుడు కృష్ణమాదిగల మధ్య ఒప్పందాన్ని కుదిర్చి ఆగస్ట్ 3, 1999న తెల్లవారుఝామున నాలుగు గంటలకు సంతకాలు చేయించారు. (మాలమహానాడు మరోనాయకుడు మల్లెలవెంకట్రావు ఈ ఒప్పంద పత్రాన్ని కరపత్రంగా వేస్తేగానీ ప్రజలదృష్టికి ఈ రహస్యం బయటకు పొక్కలేదు) ఈ ఒప్పందం కుదిరినట్టు మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి సంఘీభావ కమిటీ లోని ఉద్యమ శక్తులకు గానీ, విశాల మాలమాదిగ ప్రజలకుగానీ తెలియనీయకుండా రహస్యంగా వుంచారు. ఒప్పందం రహస్యంగా జరిగింది కనుక ఎందుకు ఒప్పందంచేసుకున్నారో ఎందుకు ఉల్లంఘించారో అడిగే అవకాశమూ ఇతరులకు లేకుండా పోయింది.

ఇదంతా ఒక దశ అనుకుంటే రెండోదశలో మాదిగలతోపాటు ఇతర అణగారిన కులాలను సమీకరించి సామాజిక ఐక్యసంఘటనగా (ఇదే రాజకీయ సంఘటన కూడా) కృష్ణమాదిగ నాయకత్వంలో మహాజన సంఘర్షణ సమితిని రీ ఆర్గనైజ్‌చేసి (తొలుత దీన్ని ప్రారంభించిన సంఘాలు, మేధావులతో సంబంధం లేకుండా) వర్గీకరణ కోసం ఉద్యమిస్తూనే గుజరాత్ హత్యాకాండకు నిరసనగా, గుండెజబ్బు పిల్లలకోసం, ప్రమోషన్‌లలో ఎస్సీఎస్టీలకు రిజర్వేషన్‌ల వర్తింపులాంటి సమస్యలపై ఆందోళనలు చేపట్టడం జరిగింది. ఇదే మహాజనసంఘర్షణ సమితి (వర్గీకరణను బలపరిచే కొందరు మాలల్నికూడా కలుపుకుని) తరఫున 2004 అసెంబ్లీ ఎన్నికల్లో రాష్ట్రంలోని అన్నిస్థానాలకు అభ్యర్థులను పోటీకి నిలుపుతామని, రాష్ట్రమంతా హెలికాప్టర్‌లో తిరిగి రాజకీయ సంచలనం సృష్టిస్తానని కృష్ణమాదిగ ప్రచారంచేశాడు. ఎన్నికలు సమీపించేనాటికి హైదరాబాద్‌లోని నిజాంకాలేజీగ్రౌండ్‌కు వేలాది మందిని సమీకరించాడు. అయితే సభజరిగిన రెండోరోజే ఎం.ఆర్.పి.ఎస్. ముఖ్య నాయకత్వం కృష్ణమాదిగ అగ్రకులాధిపత్య శక్తులకు ఉపయోగపడే విధంగా ప్లానువేసాడని పెద్దఎత్తున విమర్శచేసి కనకరావు నాయకత్వంలో పోటీ ఎం.ఆర్.పి.ఎస్.ను ప్రారంభించారు. ఈ పరిణామంతో కృష్ణమాదిగ రాష్ట్రంలోని అన్నిస్థానాలకు పోటీచేయించే ప్లానును ఆపేసి ఖమ్మంజిల్లా మదిరలో తానొక్కడే పోటీకి దిగాడు. ఒక్కడిగానైనా గెలిచి రాష్ట్రంలో ప్రత్యామ్నాయ రాజకీయానికి నాయకత్వం వహించాలని కాబోలు గెలుపుకోసం అన్నివిధాలా ప్రయత్నించాడు. అయితే ఓట్లు ఎక్కువే వచ్చినా సీటు గెలవలేదు. దీంతో ఎమ్ఎస్ఎస్‌ను పక్కనపెట్టి మళ్ళీ ఎం.ఆర్.పి.ఎస్. వ్యవస్థాపకుడిగానే కొనసాగుతూ రిజర్వేషన్ల వర్గీకరణ ఉద్యమాన్ని తీవ్రతరంచేస్తూ వర్గీకరణకోసం ఎవరినైనా బలపరుస్తాననే సూత్రంతో కరీంనగర్ ఉపఎన్నికలో కాంగ్రెస్‌ను బహిరంగంగా బలపర్చాడు. సామాజికన్యాయ ఉద్యమంగా చెప్పుకుంటున్న ఎం.ఆర్.పి.ఎస్. మరో ప్రాంతీయసామాజికన్యాయ ఉద్యమమయిన తెలంగాణ ఆకాంక్షకు ప్రాతినిధ్యం వహిస్తున్న టిఆర్ఎస్‌కు వ్యతిరేకంగా కాంగ్రెస్‌ను బలపర్చడంతో తెలంగాణ మాదిగ దండోరా నాయకత్వం పెద్దఎత్తున నిరసన వ్యక్తంచేసింది. ఇదివరకు తెలంగాణ దండోరా నాయకుడు సతీష్‌మాదిగపై కృష్ణ మాదిగవర్గం భౌతికదాడి చేసేవరకూ వెళ్ళింది.

మరోవైపు కృష్ణమాదిగ మీద విమర్శచేసి వేరుకుంపటి పెట్టిన కనకారావు నేతృత్వంలోని మరోనాయకుడిగా వున్న ఆర్.డి.విల్సన్ మాదిగ కాంగ్రెస్‌కు బలమైన అనుకూలుడుగామారి ఎస్సీకార్పొరేషన్ చైర్మన్ పదవిని పొందాడు. దీంతో కనకారావు వర్గం కాంగ్రెస్‌కు దగ్గరయిందనే విమర్శ వచ్చింది. నిరంతరం శ్రమించేతత్వం, కొత్తకొత్త ఎత్తుగడలతో మాదిగప్రజలను తనవెంటనిలుపుకునే క్రియేటివిటీ, ఏదోఒకసమస్యమీద కార్యకర్తలకు ఎప్పుడూ పనికల్పించే విధానం లాంటి చర్యలతో కృష్ణమాదిగ మిగతా దండోరా గ్రూపులకంటే బలంగానే తిరిగి నిలదొక్కుకున్నాడు. తాను ఏమిచేసినా, ఎవరిని బలపర్చినా మాదిగల కోసమేనని తన అనుచరులను నమ్మించగలిగాడు.

ఇంకోవైపు మాల నాయకుడు పి.వి.రావు హఠాన్మరణంతో జూపూడి ప్రభాకరరావు నాయకత్వంలోకి వచ్చాడు. కాంగ్రెస్‌కు అనుకూలంగా వుండటంలో పి.వి.రావు వారసత్వాన్నే కొనసాగించిన జూపూడి ముఖ్యమంత్రి రాజశేఖర్‌రెడ్డిని ఏసుక్రీస్తుతో పోల్చి ఆయన కోటరీకి దగ్గరయ్యాడు. ఈక్రమంలో ఎం.ఎల్.సి. ఎన్నికలొచ్చాయి.

దీంతో కాంగ్రెస్ నాయకత్వం ముఖ్యంగా వైఎస్ రాజశేఖర్‌రెడ్డి మాలమాదిగ కులసంఘాలకు ప్రధాన నాయకులుగావున్న కృష్ణమాదిగ, జూపూడిలను దృష్టిలోపెట్టుకుని ఇద్దరికీ ఎం.ఎల్.సి. పదవులు తీసుకోవాల్సిందిగా ఆఫర్ ఇచ్చాడు. ఈ ప్రతిపాదనను మొదట ఇద్దరూ అంగీకరించినట్టుగానే తలలూపి కొన్నిరోజులు గడచిన తర్వాత కృష్ణమాదిగ తనకు కాకుండా తాను ప్రతిపాదించిన వ్యక్తికి ఎం.ఎల్.సి. పదవి ఇప్పించుకోగా జూపూడి నేరుగా తనే ఎమ్మెల్సీపదవి తీసుకున్నాడు. కృష్ణమాదిగ ఎం.ఎల్.సి. తీసుకోకపోతే తనకు కూడా ఎం.ఎల్.సి. ఇవ్వరేమోనని భావించిన జూపూడి స్వయంగా కృష్ణమాదిగను కలిసి తీసుకుంటే ఇరువురం కలిసి తీసుకుందామని అభ్యర్థించాడనీ, అయితే తాను ఉద్యమానికి కట్టుబడి పాలకవర్గాలు ఎరవేసే పదవులు తీసుకోకుండా జూపూడికి ఎం.ఎల్.సి. ఇవ్వమని తానే కాంగ్రెస్ నాయకులకు సూచించినట్టు జైభారత్ అనే సంస్థ హైదరాబాద్‌లో నిర్వహించిన ఒక సభలో కృష్ణమాదిగే స్వయంగా చెప్పాడు. అంటే మాలల్ని అడ్డంపెట్టుకుని జూపూడి ఎం.ఎల్.సి. పదవికి అమ్ముడయి పోయాడని తానుమాత్రం పదవులన్నింటినీ వదులుకుని మాదిగలకోసం పదవులను త్యాగంచేశానని చెప్పకనే చెప్పాడు.

ఇంత సుదీర్ఘ వివరణ ఎందుకు అవసరమయిందంటే సామాన్య ప్రజల్లో ప్రతిరోజూ భిన్నధృవాలుగా ప్రత్యర్థులుగా ఇరుకులాల సామూహికతను రెచ్చగొంటున్నప్పటికీ పాలకుల దగ్గర మాత్రం ఈనేతలు కలిసి కూర్చోగలగుతున్నారని చెప్పడానికే. ఎం.ఎల్.సి.ల ఎంపిక పూర్తయిన కొన్ని నెలలకు మళ్ళీ వర్గీకరణకోసం కృష్ణమాదిగ ఆమరణ నిరాహారదీక్షకు పూనుకోగా దీనికిపోటీగా మాలమహానాడు మరోగ్రూపునాయకుడు కారెంశివాజీ రాజమండ్రిలో ఆమరణదీక్షకు కూర్చున్నాడు. ఇదితట్టుకోలేక జూపూడి హైదరాబాద్‌లో ఆమరణకు దిగాడు. ఇరుకులాలూ ఆమరణకు దిగడంతో గ్రామీణ ప్రాంతాల్లో ఒకే ఊరిలో పక్కపక్కగా వుండే మాలమాదిగ పల్లెల్లో సహజంగానే ఉద్రిక్తత తలెత్తింది. రెండుకులాలమధ్య పరిస్థితి అదుపుతప్పి ఘర్షణలు రాజుకుంటాయేమోననే పరిస్థితి ఎదురయింది. ప్రజాస్వామిక ఉద్యమకారుల్లో, మేధావుల్లో అనేకమంది ప్రజల్లో తీవ్ర ఉద్విగ్నత ఏర్పడింది. ఈ పరిస్థితిని చూస్తూ ఊరకుండలేక మాలమాదిగల మధ్య సంయమనంకోసం ఉద్రిక్తత పరిస్థితిని తగ్గించడం కోసం ఎవరోకరు జోక్యంచేసుకోవాలని ముఖ్యంగా మాలమాదిగపెద్దలు, ఉద్యమకారులు కార్యరంగంలోకి రావాలనే చర్చ ముందుకొచ్చింది.

ఈ నేపథ్యంలో నుంచి కొందరు మాలమాదిగ పెద్దలు, మేధావులు, నాయకులు కలిసి హైదరాబాద్‌లో 'మాలమాదిగ ఐక్యసాధన వేదిక'ను ఏర్పాటు చేయడం జరిగింది. మాల మాదిగలమధ్య సంయమనంతో పాటు వర్గీకరణ సమస్యకుకూడా మాలమాదిగలు ఇరువురూ సూత్రబద్ధ పరిష్కారానికి రావడం మంచిదని భావించి ఎస్సీ రిజర్వేషన్ అవకాశాలు అన్ని ఎస్సీకులాలకూ అందేవిధంగా శాస్త్రీయ ప్రాతిపదికపై నూతన వర్గీకరణ చేసుకోవాలని ఐక్యతా కృషిలోభాగమైన మాలమాదిగల ఆమోదంతో కొన్ని ప్రతిపాదనలను తయారుచేయడం జరిగింది. ఈ కృషిలో మాలమాదిగకులాల్లో పుట్టి అనేక ప్రజాస్వామిక, దళిత బహుజన ప్రత్యామ్నాయ ఉద్యమాల్లో పనిచేస్తున్న సుమారు 50 మంది మాలమాదిగ నాయకులు, మేధావులు (25 మంది మాదిగలు, 25మంది మాలలు) భాగస్వాములయి వేదిక ఏర్పాటుకు పూనుకోవడంతోపాటు కన్నబిరాన్, హరగోపాల్, బాల్‌గోపాల్, ఉ.సాంబశివరావు, వరవరరావులాంటి అనేక మంది మేధావుల, అనేక సంఘాల మద్దతునుకూడా కూడగట్టడం జరిగింది. మాలమాదిగలు ఐక్యంగా వర్గీకరణసమస్యను పరిష్కరించుకుని ఉమ్మడి హక్కుల ఉద్యమానికి సన్నద్ధంకావాలని పిలుపునిస్తూ ఈవేదిక కారంచేడు, చుండూరు మృతవీరుల సంస్మరణ సభలను కూడా హైదరాబాద్ లో జరిపింది. ఇలాంటి కృషినే అనేక రూపాల్లో నిర్వహిస్తున్న దళితబహుజన సంఘర్షణ సమితి, మహాజనపార్టీ, కులనిర్మూలనా పోరాటసమితి, కులవివక్ష వ్యతిరేకపోరాట సంఘం, దళితహక్కులు పోరాటసమితి, తెలంగాణ మాదిగదండోరా లాంటి సంస్థలుకూడా ఈ వేదికలో భాగస్వాములుగానూ మద్దతుగానూవున్నాయి.

మాలమాదిగ ఐక్యసాధన వేదిక ఏర్పడటంతో పాటు ప్రధాన నాయకులు ఆమరణలు విరమించడంతో సామాన్యప్రజలమధ్య కొంతమేరకు సంయమనం ఏర్పడింది. నిరంతర ఉద్యమాలద్వారా తెలుగునేలంతా విస్తరించిన ప్రజాస్వామికచైతన్యంకూడా మాలమాదిగల్ని పద్నాలుగేళ్లుగా సంయమనం కోల్పోనీయకుండా ఉండేట్టుచేసింది. అన్నిటికంటే మాలమాదిగ ప్రజలు ఇరువురూకూడా గొప్పసంయమనం పాటించారనేది కూడా గుర్తించకతప్పదు. ఇదిలావుంటే ఉద్రిక్త పరిస్థితుల్లో సంయమనం కోసం ఐక్యతకోసం ఏర్పడిన 'మాలమాదిగ ఐక్యసాధనవేదిక' సూత్ర బద్ధంగా వర్గీకరణను బలపరుస్తుంది కనుక మాలసంఘం నాయకులు ఈ వేదికను మాదిగదండోరాకు అనుబంధంగా చేస్తున్న కుట్రగా ప్రచారంచేస్తే మాదిగసంఘం నాయకులు వర్గీకరణ ఉద్యమాన్ని తప్పుతోవ పట్టించేందుకు మాలలకుట్రగా ఈ వేదిక ఏర్పడిందని ప్రచారంచేసి సామాజికన్యాయ ముసుగును తొలగించుకుని తమతమ ఉనికికి భంగంకలగకుండా పచ్చికులతత్వాన్ని ప్రచారంచేశారు. అయినా వారి ప్రచారాలను పట్టించుకోకుండా ఈవేదిక ఉషామెహ్రా కమిషన్‌ను కలిసి ప్రతిపాదనలు తెలియజేసింది. కొన్ని జిల్లాల్లో సదస్సులు జరుపుతూ ఐక్యతకు కృషిచేస్తున్నది. అయితే ఈ ఐక్యతాప్రయత్నాల్లో ఎం.ఆర్.పి.ఎస్. గానీ, మాలమహానాడుకానీ కలిసిరాకపోగా వ్యతిరేకత ప్రచారాన్ని చేసి తమఉనికిని నిలుపుకోవడానికే ప్రాధాన్యం ఇచ్చుకున్నారు.

సరిగ్గా ఈ సమయంలోనే యు.పి.లో బిఎస్‌పి అధికారంలోకి రావడంద్వారా రాష్ట్రంలోని దళితుల్లో కొత్త రాజకీయ కదలిక వచ్చింది. యు.పిలో అధికారం సాధించిన విధంగా ఇక్కడకూడా సాధ్యపడుతుందనే నమ్మకంతో కావచ్చు (వర్గీకరణను వ్యతిరేకిస్తుందనే కారణంకూడా కొంత వుండవచ్చు) ముఖ్యంగా ఉద్యోగరంగాలకు చెందిన కొందరు మాలలు బిఎస్‌పికి అనుకూలంగా మారుతుండటం ఒకకోణమయితే, మాయావతి తమకులానికే చెందినదనీ కనుక బిఎస్‌పి తమపార్టీ అనీ భావిస్తున్న కొందరు మాదిగలు బిఎస్‌పివైపు కదలడం మరోకోణం. మొత్తంగా మాలమాదిగలు బిఎస్‌పికి అనుకూలంగా మారుతుండడంతో బిఎస్‌పి బలపడితే తమ ఉనికి ఏమిటనే ప్రశ్న మాలమాదిగ కులసంఘాల నాయకులకు (మాలమహానాడు దానికదిగా ఒక ఉద్యమసంస్థకానప్పటికీ పాలకులుఇచ్చే ప్రాధాన్యతరీత్యా అదీ ఒక కులసంస్థగా ఉనికిలోకి వచ్చేసింది.) మరీ ముఖ్యంగా ఎం.ఆర్.పి.ఎస్. నాయకులకు లోలోపల

బెరుకుపుట్టే పరిస్థితి తలెత్తింది. దీనికితోడు బిఎస్‌పి నాయకుడు నల్లాసూర్యప్రకాష్ (మాదిగ కులానికి చెందిన వాడుకూడా) ఎం.ఆర్.పి.ఎస్. నాయకులమీద పాలకవర్గాల ఏజెంట్లుంటూ నేరుగానే విమర్శలు సంధించడం ప్రారంభించాడు.

దీంతో మాయావతి హైదరాబాద్‌సభకు వచ్చేలోపుగానే యు.పి మోడల్‌ను ఎ.పిలో బహుశా తన నాయకత్వంలో వర్కవుట్ చేయడంకోసం వకీలు రామచంద్రరావుతో పాటు కొందరు బ్రాహ్మణుల్ని, వైశ్యుల్ని, కాపుల్ని కలిపి సర్వజన సమ్మేళనాన్ని కృష్ణమాదిగ ప్రకటించాడు. అయితే ఆ తర్వాత సర్వజన టెంట్‌లోకి బిఎస్‌పి నాయకులు, మాలమహానాడు నాయకుడు కారెంశివాజీ (జూపూడి కాంగ్రెస్ చెంతనవున్నాడుకనుక) చేరడంతో వర్గీకరణను వ్యతిరేకించే వారితో తాను ఉండనని చెప్పి కృష్ణమాదిగ బయటపడ్డాడు. సర్వజన ప్రయత్నం తనచుట్టూ కాకుండా బిఎస్‌పి చుట్టూ చేరుతుందేమోనని భావించి కృష్ణమాదిగ బయటపడ్డాడని అప్పుడే కొందరు వ్యాఖ్యానించారు. బిఎస్‌పి అధినేత మాయావతి హైదరాబాద్ సభలో వర్గీకరణ అంశాన్ని వ్యతిరేకిస్తూ మాట్లాడటం, సినీనటులను బిఎస్‌పి చేర్చుకోదని వ్యాఖ్యలు చేయడం, నల్లాసూర్యప్రకాష్‌ను క్షణాల్లో పదవినుంచి పార్టీనుంచి తొలగించడం లాంటి చర్యలు పొంగుమీద నీళ్ళు చల్లినట్లయింది. వర్గీకరణ పాలకులకుట్ర అనడం, నల్లా సూర్యప్రకాష్‌ను పార్టీనుంచి తొలగించడం వల్ల బిఎస్‌పివైపు చూసిన మాదిగల్ని కొంతగందరగోళంలో పడవేసింది. దీంతో మాయావతికి సామాజిక న్యాయం గురించి అవగాహన లేదని కృష్ణమాదిగ వ్యాఖ్యానించి బిఎస్‌పిపై తన నిరసను మాదిగలపక్షాన వెల్లడించాడు.

మరోవైపు చిరంజీవి రాజకీయప్రవేశాన్ని పత్రికలు ఖరారుచేశాయి. పద్నాలుగేళ్లుగా మాదిగల్లో బలమైన నాయకుడిగా గుర్తింపుపొంది ఆగుర్తింపుతో మాదిగలశక్తితో ప్రతి ఎన్నికల ముందూ అనేక రాజకీయ ప్రయత్నాలుచేసి ఫలితాలు పొందలేకపోయిన కృష్ణమాదిగ వచ్చే ఎన్నికలకయినా తగినవిధంగా కార్యాచరణను రూపొందించు లేకపోతే పరిస్థితి ముఖ్యంగా రాజకీయ నాయకత్వపరంగా తనచేతులు దాటిపోతుందనే అంచనా కలగడంలో ఆశ్చర్యపోవాల్సిందేమీ లేదు. ఈ మొత్తం నేపథ్యంలోనుంచే తక్షణం మళ్లీ ఉమ్మడి సమస్యలపై ఆందోళనలు అందుకు ప్రధానంగా మాలలతో ఐక్యసంఘటన ముందు కొచ్చాయనిపిస్తుంది. దీనికి సమాంతరంగా ఇటీవల హైదరాబాద్‌కు చేరిన ప్రముఖ దళిత ఉద్యమనేత కత్తిపద్మారావు మాలమాదిగలు ఐక్యం కావాలని అందుకు ప్రాథమికంగా కృష్ణమాదిగ, జూపూడి ప్రభాకర్‌రావులు ఒక అంగీకారానికి రావాల్సిన ఆవశ్యకత ఉందని ఇరువురుతో మాట్లాడుతూ ప్రయత్నాలు మొదలుపెట్టాడు.

విడివిడి కులాలుగా వుండటంలోవున్న శక్తికన్నా కలిసివుంటే వుండేశక్తి చాలాపెద్దదనీ, రాజకీయప్రయత్నాలు చేయాలను కుంటే దళితఐక్యత యు.పి. మాదిరిగా సాధించాలనీ అది నాయకులుగా మీకూ, విశాల దళిత ప్రజానీకానికీ ఎంతో భవిష్యత్తును ఇస్తుందనీ, కులంపుట్టుక దగ్గర నుంచి కులనిర్మూలనవరకూ దళితులు చేయాల్సిన కర్తవ్యాలను కత్తి వీరికి బోధించాడని తెలిసింది. ఎం.ఆర్.పి.ఎస్. నుంచీ, మాలమహానాడు నుంచీ చెరొక అయిదుగురు ముఖ్యనాయకులు పదిమందిని కలిపికూడా ఐక్యతా అవసరాన్ని ఒప్పించాడని, దీంతో రెండు గ్రూపులూ ఐక్యతకోసం ఒక అంగీకారానికి వచ్చారని బయటకు పొక్కింది. వారం పదిరోజులు గడిచాక ఏమయిందో తెలియదుకానీ జూపూడిస్థానంలోకి (కత్తికి కూడా తెలియకుండా) దారాసాంబయ్య (మాలకులానికి చెందిన) వచ్చి చేరడం జరిగింది. ఈ ఇరువురి కేంద్రంగా మాలమాదిగల ఐక్యతకు, ఉమ్మడి సమస్యలపై ఆందోళనలకు(వర్గీకరణను ఆమోదిస్తూనే) కార్యక్రమం తయారయింది. కొందరు మాలమాదిగ కులాలకు చెందిన ఐఎఎస్ అధికారుల సమక్షంలో చర్చలు జరిగినట్టు, ఐక్యతకు ఇరువురూ (మాలల తరుపున సాంబయ్య, మాదిగలతరుపున కృష్ణమాదిగ) ఆమోదం తెలుపుకున్నట్లు ప్రెస్‌మీట్ ద్వారా బహిరంగ మయింది. ఈ ఐక్యతకు ప్రధానంగా ప్రభుత్వ మాజీ ప్రధానకార్యదర్శి కాకిమాధవరావు పెద్దమనిషిగా వ్యవహరించినట్టు నాయకులు వెల్లడించడంతో జూపూడి, కారెంలు మాధవరావుపై విరుచుకుపడ్డారు. మాలమహానాడుతో నేరుగా సంబంధంలేని దారాసాంబయ్యతో ఐక్యత ఏమిటనీ, కాకిమాధవరావు లాంటి పెద్దమనిషి సూత్రధారిగావుండి తమతో కనీసం మాట్లాడకుండా వేదిక ఏర్పాటు చేయడమేమిటనీ ఈ ఐక్యతాప్రయత్నాన్ని జూపూడి నిరసించాడు. కారెంశివాజీ అయితే ఈ ఐక్యతను కాంగ్రెస్‌కుట్రగా వ్యాఖ్యానించాడు. దీనికితోడు వర్గీకరణను వదులుకుని ఐక్యతకు వచ్చినందుకు కృష్ణమాదిగను ఆహ్వానిస్తున్నామని (కృష్ణను మాదిగ ప్రజలనుంచి దూరంచేసే ఎత్తుగడతో) కూడా జూపూడి ప్రకటించాడు. దీంతో కృష్ణమాదిగ రిజర్వేషన్ల వర్గీకరణ అంశాన్ని వదిలిపెట్టలేదనీ, వర్గీకరణను బలపరిచేమాలలతోనే ఐక్యత ఏర్పడిందని మర్నాడు మళ్లీ ప్రకటించు కోవాల్సివచ్చింది.

మరోవైపు మాదిగ దండోరాలోని కనకారావు వర్గం మాలల ఉచ్చులో కృష్ణమాదిగ పడ్డాడని మాదిగల్ని అణచివేసిన మాలలతో ఐక్యత ఏమిటనీ ప్రకటించి తాను మాదిగలకోసం చైతన్యయాత్ర చేస్తున్నట్టు వెల్లడించాడు. ఇలా మాల మాదిగ గ్రూపుల్లో ఆరోపణలు ప్రత్యారోపణలు నడుస్తుండగానే కృష్ణమాదిగ, దారా సాంబయ్యల ఐక్యతా ప్రయత్నం 'ఎస్సీ,ఎస్టీ ఐక్యవేదిక'గా రూపుదిద్దుకుని 62 అంశాలతో ఐక్య ఉద్యమాలకు సన్నద్ధమవుతున్నట్లు జనవరి 23వ తేదీన ప్రకటించారు. ఐక్యత అనే అంశాన్ని ఈసారి రహస్యంగా ఉంచకుండా బహిరంగపర్చినందుకు వారు అభినందనీయులేనని చెప్పుకోక తప్పడంలేదు.

పైన పేర్కొన్న మొత్తం పరిణామంలో గమనంలోకి తీసుకోవాల్సిన విషయం ఏమంటే మాలమాదిగలు, ప్రజలు, విద్యావంతులు, ఉద్యోగులు గత పద్నాలుగేళ్లుగా ఎంతో తీవ్రంగా పరస్పరం సంఘర్షించు కుంటున్నప్పటికీ అగ్ర నాయకత్వాలుమాత్రం ప్రతిసందర్భంలో తమతమ ఉనికికీ, నాయకత్వ ఆధిపత్యాలకూ అనుగుణంగా, లేదా పాలకుల రాజకీయ ప్రయోజనాలకు వీలుగా ఐక్యతా ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారనీ, లేదా చేస్తున్నట్టు నటిస్తూనే ఉన్నారనీ గుర్తించడం అవసరం. అదే సందర్భంలో ఈ ఐక్యతలు క్షణాల్లో వదులుకుని మళ్లీ తమతమ దారి చూసు కుంటున్నారని కూడా గమనించడం అవసరం. అది 1999 మహాజనఫ్రంట్ రూపంలో, 2004 మహాజన సంఘర్షణ సమితి రూపంలో, మరొకసారి పి.వి.రావుతో రహస్య ఒప్పందం రూపంలో,

ఇటీవలి ఎం.ఎల్.సి. పదవులదగ్గర ఇలా అనేక సార్లు మాలమాదిగ నాయకులు ఐక్యతా ప్రయత్నాలకు ఒడిగడుతూనే వున్నారు. కాకపోతే ఈ ఐక్యతా చర్చలూ ప్రయత్నాలూ మాదిగ దండోరా ఉద్యమాన్ని తొలి నుంచీ నిజాయితీగా బలపర్చిన మాలలతోకానీ, అలాగే సంఘీభావకమిటీ ఉద్యమసంస్థల, మేధావుల సమక్షంలోకానీ కాకుండా జరగడమే మహోన్నత ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమంలో పెద్ద ట్రాజెడీ. అందుకే ఈ ప్రయత్నాలపట్ల అనేక అపోహలు, అనుమానాలు అప్పుడే ప్రచారంలోకి వచ్చాయి. బిఎస్‌పి ప్రభావంతో అనేక రాష్ట్రాల్లో నష్టపోయిన కాంగ్రెస్ మన రాష్ట్రంలో దళితులను బిఎస్‌పి వైపు మళ్లనీయకుండా సమస్యలు చుట్టూ తిప్పి ఎన్నికలప్పుడు పరోక్షంగా కాంగ్రెస్‌కు ఉపయోగపడే వ్యూహంతో ఈ ఐక్యవేదిక రూపొందిందని దారాసాంబయ్యలాంటి కాంగ్రెస్ ఎమ్మెల్యే ఈ వేదిక గౌరవాధ్యక్షుడిగా ఉండటమే దీనికి సూచిక అనే అనుమానం వేగంగా చెవులుమారుతోంది. అలాగే జూపూడినికూడా ఈ ఐక్యతలో కలుపుకుంటే కృష్ణమాదిగతోపాటు మాలలనుంచి మరో ప్రధాననాయకత్వాన్ని ఆమోదించాల్సి వస్తుందని అదేజరిగితే తన ఏకవ్యక్తి నాయకత్వం, తన ఇష్టానుసారం ఎత్తుగడలుపన్నే అవకాశం వుండకుండా పోతుంది కనుకనే కృష్ణ మాదిగ, సాంబయ్యను ఎంపికచేసుకున్నాడనే అపోహలూ చెలరేగుతున్నాయి. అన్నిటికన్నా బిఎస్‌పి బలపడినా లేక మరో ప్రత్యామ్నాయ రాజకీయశక్తి ముందుకొచ్చినా ఆ తర్వాత రాజకీయ ప్రయత్నం చేసే అవకాశం తనకు (కృష్ణమాదిగ ముఖ్యమంత్రి కావాలని ఎం.ఆర్.పి.ఎస్. కార్యకర్తల ఆకాంక్ష) లభించకపోవచ్చుననీ అందుకే ఎస్సీ,ఎస్టీ, ఐక్యవేదిక, ఎం.బి.సి ఐక్యవేదిక, వికలాంగుల పోరాటసమితి లాంటి సంస్థల సామాజిక ఐక్యసంఘటనగా బయలుదేరి తొందరలోనే రాజకీయపార్టీ ఏర్పాటుకు ఆయన కృషిచేస్తున్నాడని 2009 ఎన్నికలకు సిద్ధపడుతున్నాడనీ పత్రికల్లో కథనాలు వెలువడుతున్నాయి.

అదేవిధంగా దారాసాంబయ్యకు కాంగ్రెస్‌పార్టీ వచ్చేఎన్నికల్లో సీటుఇచ్చే పరిస్థితి లేనందున ఈ ఐక్యవేదికద్వారా బార్గెయినింగ్ పెంచుకోవచ్చనే ఉద్దేశం అతనికున్నదనీ అనుమానాలు వ్యక్తమవుతున్నాయి. ఈ విధమైన అపోహలు, అనుమానాలు, సందేహాలు వ్యక్తంకావడానికి అవకాశం ఇస్తున్నది ప్రధానంగా నాయకుల రహస్య కార్యాచరణలేనని చెప్పక తప్పదు. ఇందుకు వేరెవరినీ బాధ్యులుగా భావించడానికి ఆస్కారంలేదు. మాలమాదిగ ప్రధాననాయకులమధ్య, మేధావులమధ్య పారదర్శకతతో, స్పష్టమైన విధానంతో అన్ని ఎస్సీకులాల, ప్రజల ప్రయోజనాల కనుగుణంగా చర్చలూ, ఐక్యత జరగాల్సి ఉండింది. అలా కాకుండా కొందరు నాయకుల వ్యక్తిగత, రాజకీయ ఉనికికోసమో అదీకాకుంటే పాలకులకోసమో ఐక్యతా ప్రయత్నాలు ఉంటున్నాయని (ఒకవేళ ఇవి వాస్తవం కాకపోయినా) అనిపిస్తుంటే ఈ దుస్థితిపట్ల విచారం కలగక మానదు.

సామాజికన్యాయ ఉద్యమనేతగా ఎంతో ప్రచారం పొందిన కృష్ణమాదిగ మాదిగదండోరా ఉద్యమాన్ని నిరంతరం బలపరచుకుంటూ వచ్చిన మాలకులానికి చెందిన సామాజిక న్యాయ ఉద్యమకారులతో కాకుండా నిన్నటివరకూ వర్గీకరణను వ్యతిరేకించిన (ఇప్పుడు బలపర్చడం ఆహ్వానించదగినదే) సాంబయ్యతో ప్రధానంగా ఐక్యసంఘటన కట్టడంలో సామాజిక న్యాయదృక్పథం ఎంతవుందో విజ్ఞులకు వివరించాల్సినపనిలేదు. అంతేకాదు వీరికృషికంటే ముందే ఐక్యతకు ప్రయత్నించిన 'మాలమాదిగ ఐక్యసాధన వేదిక ' ను కనీసం సంప్రదించలేదంటే వీరి ప్రయత్నంలోని నిజాయితీని అంచనావేయవచ్చు. ఇదిలావుంటే దారాసాంబయ్య, జూపూడిలమధ్య మాలలకు ఎవరు నాయకుడనే వివాదం చిలికిచిలికిగాలివానగా మారింది. ఒంగోలులో దారాసాంబయ్య అనుచరులు జూపూడిపై దాడికి ప్రయత్నించే వరకూ వచ్చింది. జూపూడి వర్గీయులు దారా దిష్టిబొమ్మను దగ్ధంచేసి కాంగ్రెస్ నుంచి దారాను బహిష్కరించాలని డిమాండ్‌చేస్తున్నారు. మాలగ్రూపుల మధ్య వివాదం రగులుకుంటున్న విధంగానే కృష్ణమాదిగ నిర్ణయాలమీద అసంతృప్తితో మాదిగగ్రూపుల్లో కూడా వివాదం రగులుకునే అవకాశాలు కనిపిస్తున్నాయి. ఇలాంటి స్థితిలో మాలమహానాడును మూసుకోమని జూపూడిని హెచ్చరిస్తూ కృష్ణమాదిగ రెచ్చగొట్టే వాఖ్యలు చేస్తుండటం, అదేవిధంగా మాదిగలను మందకృష్ణ నట్టేటముంచాడని జూపూడి వ్యాఖ్యానించడం చూస్తుంటే నేటి ఐక్యతాకృషి మాలమాదిగ ప్రజలను ఎంతో గందరగోళ పరుస్తుందనిపిస్తున్నది.

ఇలాంటి పరిస్థితుల్లో ఐక్యత అనే అంశం కృష్ణమాదిగ, దారాసాంబయ్యలకు మాత్రమే వదిలి వేయకుండా సామాజికన్యాయ, ప్రగతిశీల ఉద్యమసంస్థలు, మేధావులూ ఎక్కడికక్కడ మాల, మాదిగలమధ్య ఐక్యతకు సమాంతరంగా కృషిచేస్తూ ఉమ్మడి సమస్యలకోసం, హక్కులకోసం ఉద్యమించేలా చేయడం అవసర మనిపిస్తుంది. కాకిమాధవరావులాంటి ప్రముఖులు మాలమాదిగ ల్లోని ఇతర గ్రూపులనుకూడా సమన్వయంచేయడానికి మరింత దృష్టిసారిస్తే ఈ ప్రయత్నం సమగ్రంకావడానికి దోహదపడుతుంది. అన్నిటికన్నా మాలమహానాడు సంస్థలు ఇప్పటికైనా జనాభా దామాషా ప్రాతిపదికన ఎస్సీలందరికీ రిజర్వేషన్ అవకాశాలు దక్కాలనే సూత్రాన్ని (వర్గీకరణను) ఆమోదించి ఐక్యతా కృషిలో భాగస్వాములయితే అన్నిటికన్నా ఎక్కువ ఐక్యత సిద్ధిస్తుంది. అంబేద్కర్ ఆలోచనకు అనుగుణంగా దళితుల రాజ్యాధికార ఆకాంక్షకు బలంచేకూరుతుంది. తద్వారా మాలమాదిగల్లో పద్నాలుగేళ్లుగా మనసుల్లో పేరుకుపోయిన అసూయ, ద్వేషాలు, అపోహలు తగ్గి హృదయపూర్వకంగా పరస్పర త్యాగనిరతితో కలిసి ఉద్యమించడానికి మార్గం సుగమమవుతుంది.

ఈ దిశగా ప్రజాస్వామ్య ఉద్యమసంస్థలు సమాంతర కృషి జరపడం ఎంతో అవసరం. లేదంటే ఏకారణంచేతనయినా నేడు రూపుదిద్దుకున్న ఐక్యతలో మాలమాదిగ నాయకులకు తాము ఆశించినవిధంగా ప్రయోజనాలు, ఫలితాలు నెరవేరనప్పుడు మళ్లీ ఒకరికొకరు పరస్పరారోపణలతో సామాన్య మాలమాదిగ ప్రజల్లో అలజడి సృష్టించడానికి ప్రయత్నించినా ఆశ్చర్యంలేదు. అలాంటి ప్రమాదాలకు ఆస్కారాలు లేకపోలేదనే ఉదాహరణల కోసమే ఈవ్యాసంలో అనేక గత అనుభవాలు చరిత్రగా ఏకరవు పెట్టాల్సివచ్చింది. గతచరిత్రను పునరావృతం కానీయకుండా మాలమాదిగ నాయకులు నిజంగా చిత్తశుద్ధితో ఐక్యతకు కృషిచేస్తే వారికి దళిత ప్రజల నుండి సంపూర్ణమద్దతు అందుతుంది. ప్రభుత్వాలు దశాబ్దాలుగా నిర్లక్ష్యంచేస్తున్న ఉపప్రణాళికలు లాంటి హక్కులూ నెరవేరతాయి. అందుకే నేటి మాలమాదిగల (ఎస్సీ, ఎస్టీ ఐక్యవేదిక) ఐక్యతా కృషిని అప్రమత్తతతో ఆహ్వానిస్తూ నేడయినా రేపయినా వీరిమధ్య అనుమానాలూ అపోహలూ లేని ఐక్యతకోసం కృషి కొనసాగించాల్సి ఉంది. ◆

*తెలంగాణ కోసం ప్రజలు ఏ త్యాగాలకైనా సిద్ధమేనని, అంతర్జాతీయ సామ్రాజ్యవాదాన్ని, అంతర్గత వలసవాదాన్ని ఓడించేందుకు అవకాశవాద నాయకుల్ని కాదని ఉద్యమించాల్సిందేనని అంటున్నారు* **నాగోబా**

# తెలంగాణ - ఇటీవలి పరిణామాలు

**భా**రతదేశం స్వాతంత్ర్యం అందినాక దేశంలో జాతుల పోరాటాలు, ఉపజాతుల ఆకాంక్షలు పెల్లుబికాయి. బ్రిటిష్ ఇండియాలో ఏర్పడిన రాష్ట్రాలు, ప్రావిన్సులు, సంస్థానాలు ప్రజల ఆకాంక్షలను గౌరవించి, జాతుల, ఉపజాతుల ఆకాంక్షలకు అనుగుణంగా ఏర్పడినవి కావు. బ్రిటిష్ రాజ్యాధికారానికి, వారి వలస దోపిడీకి అనుకూలమైన రాజ్యవ్యవస్థనే వారు ఏర్పాటు చేసుకున్నారు. స్వాతంత్ర్యానంతరం జాతుల, ఉపజాతుల ఆకాంక్షలు పెల్లుబుకుతున్న నేపథ్యంలో రాష్ట్రాలను, ప్రావిన్సులను, సంస్థానాలను పునర్వ్యవస్థీకరించవలసిన ఒక చారిత్రక అగత్యం భారత ప్రభుత్వానికి ఏర్పడింది. జస్టిస్ ఫజల్ అలీ అధ్యక్షతన కె.ఎం. ఫణిక్కర్, హృదయనాథ్ కుంజ్రూలు సభ్యులుగా రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘాన్ని కేంద్ర ప్రభుత్వం 1953 లో ప్రకటించింది. దీని ప్రధాన ఉద్దేశ్యం దేశ సమైక్యతకు దోహదం చేసే ప్రజాస్వామిక పునర్వ్యవస్థీకరణ సంఘం దేశమంతా తిరిగి లక్షలాది వినతి పత్రాలు స్వీకరించి, వేలాదిమందిని కలిసి 1955 నాటికి అంటే మూడేండ్లలో సిఫారసులతో కూడిన నివేదికను భారత ప్రభుత్వానికి అందజేసింది. సంఘం సిఫారసులకు ప్రాతిపదికలు ప్రధానమైనవి నాలుగు. అవి 1) భారత దేశ సమైక్యతను కాపాడి, బలోపేతం చేయడం, 2) భాషా సాంస్కృతిక సారూప్యత. 3) ఆర్థిక, పాలనాపరమైన సానుకూలత, 4) భారత ప్రభుత్వం ప్రవేశపెట్టిన జాతీయ పంచవర్ష ప్రణాళికల అమలు.

పై నాలుగు ప్రాతిపదికల్లో బలమైన ప్రభావాన్ని వేసింది. భాషా సారూప్యత మాత్రమే. దీనికి కారణం అధికారంలో ఉన్న కాంగ్రెస్ ప్రభుత్వం 1920 నాగ్‌పూర్ కాంగ్రెస్‌లో భాషా ప్రాతిపదికన రాష్ట్రాల ప్రావిన్సుల పునర్వ్యవస్థీకరణ తమ విధానమని ప్రకటించింది. ఇదే అంశం 1928లో నెహ్రూ అధ్యక్షతన ఏర్పాటైన అఖిలపక్ష కమిటీ నివేదికలోను చోటు చేసుకున్నది. ఈ నివేదికనే ఆంధ్రోద్యమానికి దోహదం చేసింది. ఆంధ్రోద్యమం ఫలితంగా, పొట్టిశ్రీరాములు అమరత్వంతో కేంద్రప్రభుత్వం 1953 లో ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటు చేయక తప్పలేదు. ఇది దేశంలో భాషా ప్రాతిపదికన ఏర్పాటైన మొదటి రాష్ట్రం. ఈ ప్రాతిపదికను ఆధారం చేసుకొనే విశాలాంధ్ర నినాదాన్ని లేవనెత్తడం 1956 లో ఆంధ్రప్రదేశ్ ఉర్పాటు కావడం అందరూ ఎరిగిన చరిత్రే. అయితే 1953 లో ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటుకు – 1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుకు మధ్య జరిగిన చరిత్ర చాలా కీలకమైంది. ఇవ్వాళ్టి రెండో ఎస్సార్సి సందర్భాన్ని విశ్లేషంచడానికి ఉపకరిస్తాయి.

1953లో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం ఏర్పడింది. 1955 లో తుది నివేదిక వెలువడింది. 1956 లో రాష్ట్రాల పునర్ వ్యవస్థీకరణ చట్టం అమలులోకి వచ్చింది. అయితే రాష్ట్రాల పునర్ వ్యవస్థీకరణ ఎస్సార్సీ సిఫారసుల మేరకు జరుగలేదు. సంఘం భాషా ప్రాతిపదికను ఒక ప్రధాన అంశంగా పరిగణించినప్పటికీ రాష్ట్రాల పునర్ వ్యవస్థీకరణకు అదొక్కటే ప్రాతిపదిక కాదు. సంఘం దేశాన్ని మొత్తం 16 రాష్ట్రాలుగా పునర్వ్యవస్థీకరించింది. ఇందులో 4 హిందీ భాషా రాష్ట్రాలు, 2 తెలుగు భాషా రాష్ట్రాలు (హైదరాబాదు, ఆంధ్ర) ఒక మిశ్రమ భాషా రాష్ట్రం (బొంబాయి: మరాఠి, గుజరాతి) మిగతా 10 రాష్ట్రాలు ఆనాడు ప్రధాన భాషలుగా గుర్తింపు పొందిన అస్సామీ, బెంగాలీ, కన్నడ, కాశ్మీరీ, మలయాళం, ఒరియా, తమిళం, మరాఠి, పంజాబీ భాషా రాష్ట్రాలు.

సంఘం చేసిన సిఫారసులను కేంద్రం బుట్టదాఖలు చేసింది. హైదరాబాద్ రాష్ట్రాన్ని విడదీసి తెలుగు మాట్లాడే తెలంగాణని ఆంధ్రలో విలీనం చేసింది. మరాఠి ప్రాంతాలైన మరాఠ్వాడ, విదర్భలను బొంబాయి లో కలిపింది. కన్నడ ప్రాంతాలను కర్నాటకలో కలిపింది. ఈ రకంగా ఎస్సార్సీ సిఫారసులకు విరుద్ధంగా రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ జరిగిపోయింది. 14 రాష్ట్రాలలో పునర్వ్యవస్థీకరణ అమలులోకి వచ్చింది. ఆ తర్వాత అంటే 1960 నుండి 2002 వరకు 14 రాష్ట్రాలు ఎటువంటి ఎస్సార్సీ లేకుండానే ఏర్పాటు అయినాయి. 1956 లో జరిగిన పునర్వ్యవస్థీకరణ ఆయా ప్రాంతాలలో అసంతృప్తులను రగిలించింది. ఎస్సార్సీ కూడా భాషా సారుప్యతనే ప్రధానంగా దృష్టిలో పెట్టుకున్నదే తప్ప భాషా సారుప్యతకు వెలుపల ప్రజలను ఒక దగ్గర కట్టిపడవేసే సామాజిక సాంస్కృతిక అస్తిత్వాలను పట్టించుకోనే లేదు. భాష ఒక జాతి సాంస్కృతిక అస్తిత్వంలో ఒకానొక అంశమే తప్ప అదే మొత్తం అస్తిత్వం కాజాలదు. 1969 లో పెద్ద ఎత్తున తెలంగాణ రాష్ట్రం కోసం ప్రజా ఉద్యమం ఎగిసింది. దేశవ్యాప్తంగా రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణకు సంబంధించి చర్చ మొదలైంది. 1973 లో ప్రొఫెసర్ రషీదుద్దీన్ ఖాన్ ఈ అంశంపై చేసిన అధ్యయనం ప్రధానంగా స్మరించుకోవాలి. ఈ అధ్యయనానికి ముందే 1960 లో గుజరాత్, 1966 లో పంజాబ్‌నుండి హిందీ ప్రాంతాలను విడదీసి హర్యానా రాష్ట్రాలు ఏర్పడినాయి. 1966 నాటికి 14 భాషలను రాజ్యాంగంలోని 8వ షెడ్యూల్‌లో పొందుపరిచారు. పునర్వ్యవస్థీకరణ చేసి ఉండవల్సిందని ప్రొఫెసర్ రషీదుద్దీన్‌ఖాన్ అభిప్రాయ పడినాడు. ఆయన అధ్యయనం ప్రకారం దేశంలో 58

స్పష్టమైన సామాజిక సాంస్కృతిక అస్తిత్వం కలిగిన ఉప ప్రాంతాలు ఉన్నాయని తేల్చాడు. భాషా సారుప్యతలు ఉన్నప్పటికీ స్పష్టమైన భాషా వైవిధ్యాలు కూడా ఉన్నాయని ఆయన గుర్తించాడు.

హిందీ భాషకు స్పష్టమైన వైవిధ్యం కలిగిన పంజాబీ, మైథిలీ, రాజస్థానీ, భోజ్‌పురీ, బ్రజ్, అవధీ, ఖరీబోలి భాషా అస్తిత్వాలు ఉన్నాయనీ గుర్తించారు. ఉత్తర బీహార్‌లోని దర్భంగా ప్రాంతంలో మాట్లాడే మైథిలీ, భోజ్‌పూర్ ప్రాంతంలో మాట్లాడే భోజ్‌పురీ కంటె భిన్నమైనది. పశ్చిమ ఉత్తర ప్రదేశ్‌లో మాట్లాడే బ్రజ్‌భాష మధ్య ఉత్తరప్రదేశ్‌లో మాట్లాడే అవధీ కంటె భిన్నమైనది. ఈరకంగా అన్ని రాష్ట్రాలను పరిశీలించి 58 ప్రత్యేక సామాజిక సాంస్కృతిక ప్రత్యేకతలు కలిగిన ఉపప్రాంతాలను గుర్తించి ఒక చిత్రపటాన్ని కూడా రూపొందించారు. ప్రొ. రషీదుద్దీన్‌ఖాన్. మధ్యప్రదేశ్‌లో 5, ఉత్తరప్రదేశ్‌లో 6, రాజస్థాన్‌లో 4, బీహార్‌లో 3, గుజరాత్‌లో 3, మహారాష్ట్రలో 5, ఆంధ్రప్రదేశ్‌లో 3 (తెలంగాణ, ఆంధ్ర రాయలసీమ), కర్నాటకలో 3, కేరళలో 2, తమిళనాడులో 2, ఒరిస్సాలో 2, పశ్చిమ బెంగాల్‌లో 3, పంజాబ్‌లో 2, జమ్ముకాశ్మీర్‌లో3, అస్సాంలో2, సామాజిక-సాంస్కృతిక వైవిధ్యం గల ప్రాంతాలను ఆయన గుర్తించాడు. వీటిలో ఇప్పటికే ఉత్తరప్రదేశ్‌లో ఉత్తరాంచల్, బీహార్ నుండి జార్ఖండ్, మధ్య ప్రదేశ్ నుండి ఛత్తీస్‌గడ్ రాష్ట్రాలు ఏర్పడినాయి. ఆయా ప్రాంతాలలో అసమ అభివృద్ధికి సంబంధించిన అసంతృప్తులు ఉన్నప్పటికీ ప్రత్యేక రాష్ట డిమాండ్‌లు ఉన్న ఉప ప్రాంతాలు కొన్నే. బలమైన డిమాండ్లు దశాబ్దాలుగా వెల్లువెత్తుతున్న ప్రాంతాలు తెలంగాణ విదర్భలు మాత్రమే. ఈ రెండింటిలోనూ తెలంగాణలో స్థిరమైన ప్రజా ఉద్యమాలు నడుస్తూనే ఉన్నాయి. కొన్నిసార్లు విరామం జరిగినా ఆగిపోలేదు.

1952 లో ముల్కీ ఉద్యమం మొదటి దశ కాగా, 1969 ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమం రెండో దశ, 1990 దశకం నుండి నడుస్తున్న వర్తమాన తెలంగాణ ఉద్యమం మూడోదశ ఇంత సుదీర్ఘకాలం ప్రత్యేక రాష్ట్రం కోసం సాగిన ఉద్యమాలు దేశంలో మరెక్కడా కానరావు. స్వాతంత్ర్యానంతరం 1969లో తెలంగాణలో ఉవ్వెత్తున ఎగిసిన ప్రజా ఉద్యమం చేసిన ప్రాణ త్యాగాలు మరెక్కడా లేవు. తెలంగాణ ప్రజలు అన్ని రూపాలలో తమ ఆకాంక్షలను వ్యక్తం చేస్తూనే ఉన్నారు. ఉద్యమాలు చేసారు, లాఠీ దెబ్బలు తిన్నారు, జైళ్లకు వెళ్లారు, ప్రాణత్యాగం చేశారు ఎన్నికల్లో తెలంగాణ అభ్యర్థులను గెలిపించారు. అయినా భారత పాలక వర్గాలు తెలంగాణ ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షలను నిర్లక్ష్యం చేస్తూ వస్తున్నారు. కోస్తా ఆంధ్రా సంపన్న వర్గాల ప్రయోజనాలకే కొమ్ము కాస్తున్నారు.

ఇక ప్రస్తుత పరిస్థితుల దగ్గరికే వస్తే, తెలంగాణ ప్రజల ఆకాంక్షలను సొమ్ముచేసుకొని 2004 లో అటు కేంద్రంలోనూ, ఇటు రాష్ట్రంలోనూ గద్దెనెక్కిన కాంగ్రెస్ ఇపుడు మూడున్నర ఏండ్ల తర్వాత రెండో ఎస్సార్సీ వేసి తెలంగాణ సమస్యను పరిష్కరిస్తానంటున్నది. అధికారంలోకి వచ్చిన తొలి నాళ్లలో ప్రజలకిచ్చిన హామీలు నెరవేరుస్తామన్న భ్రమలు కల్పించింది. యు.పి.ఎ. ఉమ్మడి ప్రణాళికలో తెలంగాణ ఏర్పాటును ప్రస్తావించింది. అందులో రెండో ఎస్సార్సీ ఊసేలేదు. రాష్ట్రపతి ప్రసంగంలోనూ తెలంగాణ రాష్ట్రం ఏర్పాటును ప్రస్తావింపజేశారు. ఏకాభిప్రాయ సేకరణకు ప్రణబ్ ముఖర్జీ కమిటీని ఏర్పాటు చేశారు. ఇదంతా కాంగ్రెస్ వంచనా శిల్పంలో భాగమేనని, కాలయాపనకు ఉద్దేశించిన పథకమేనని సంవత్సరం తిరిగే లోపలే స్పష్టమైంది. ప్రధానమంత్రి హైదరాబాద్ సెస్ స్వర్ణోత్సవ సభలో తెలంగాణ కు పాలనాపరమైన పరిష్కారమా? రాజకీయపరమైన పరిష్కారమా? ఏదికావాలో చర్చించమని మేధావులకు పురమాయించాడు.

2006 మార్చ్‌లో హైదరాబాద్‌లో జరిగిన కాంగ్రెస్ ప్లీనరీలో ఉన్న పళంగా ఇవ్వడానికి తెలంగాణ ఇన్‌స్టంట్‌కాఫీ కాదు. తెలంగాణపై ఏకాభిప్రాయం కుదరలేదని ప్రకటించాడు. నెపం బిజెపి మీదకి నెట్టివేసాడు. ఇక్కడ వై.ఎస్ అభివృద్ధి మంత్రాన్ని జపించడం ఉధృతం చేశాడు. తమ ప్రభుత్వం అమలుచేస్తున్న అభివృద్ధి పథకాలు తెలంగాణ ప్రజలను సమ్మోహితులను చేస్తున్నాయని. వచ్చే ఎన్నికల్లో తామే తిరిగి అధికారంలోకి రాబోతున్నామని కాంగ్రెస్ అధిష్ఠానాన్ని నమ్మిస్తున్నాడు. కోస్తా, రాయలసీమలో మెజారిటీ సీట్లు గెలుస్తామని, తెలంగాణాలో ఎంత సెంటుమెంటున్న జిల్లాకు రెండు అంటే 20-25 సీట్లు గెలుచుకొని ఇతరుల మద్దతుతో ప్రభుత్వాన్ని, ఏర్పాటు చేస్తామని నమ్మబలుకు తున్నాడు. ఒక ప్రాంతం మొత్తం వ్యతిరేకమైనా ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తామనడం ఎంతటి అహంకారం. ఇపుడు గనుక రాష్ట్రాన్ని విభజిస్తే తెలంగాణ ఏర్పడిన ఖ్యాతి టి.ఆర్.ఎస్ తన్నుకుపోతుంది. కోస్తా, రాయలసీమలను చిరంజీవి తన్నుకుపోతాడు. రెంటికి చెడ్డ రేవడి అవుతుందని వై.ఎస్ అధిష్ఠానాన్ని హెచ్చరించాడు. అధిష్ఠానం కూడా ఆయన హెచ్చరికలని పరిగణనలోకి తీసుకున్నట్లే కనబడుతున్నది. రెండో ఎస్సార్సీపై వెనక్కి తగ్గినా తెలంగాణ ఏర్పాటుపై మౌనమే పాటిస్తున్నది. వై.ఎస్ మరింత స్పష్టంగా ఆంధ్రజ్యోతి దినపత్రికకు ఇంటర్వ్యూ ఇస్తూ ఈ టర్మ్‌లో తెలంగాణ సాధ్యం కాదు అన్నారు. సోనియా నిర్ణయమే శిరోధార్యం అని ఇన్నాళ్లు చెప్పుకొచ్చిన వై.ఎస్ ఇపుడు సోనియా ఏమైనా సామ్రాజ్ఞియా, ఆమెకూ పరిమితులుంటాయని సెలవిచ్చారు. అంటే సోనియా ఈ టర్మ్‌లో తెలంగాణ పై నిర్ణయం తీసుకునే అవకాశం లేదని తేలిపోయింది. ఇక సరి అయిన సమయం రానట్లే. సరిఅయిన సమయంలో సరి అయిన నిర్ణయం జరగడం ఇక కల్ల. అయితే ఎటువంటి డిమాండ్ గాని, రాష్ట్రం కోసం ప్రజా ఉద్యమం గాని లేని బుందేల్‌ఖండ్‌కు మాత్రం సరి అయిన సమయం వచ్చేసినట్లుగా కనిపిస్తున్నది. ఇదీ కాంగ్రెస్ వంచనా శిల్పం.

రెండో ఎస్సార్సీ ద్వారానే తెలంగాణ సమస్యను పరిష్కరిస్తామని గతంలోనే ఆంధ్రప్రదేశ్ వ్యవహారాల కాంగ్రెస్ ఇన్‌చార్జ్ దిగ్విజయ్‌సింగ్ ప్రకటించినపుడు పెద్ద చర్చనే జరిగింది. తెలంగాణ కాంగ్రెస్ నాయకులు మండిపడినారు. మధుయాష్కి, పాల్వాయి గోవర్ధన్‌రెడ్డి, ఉప్పునూతల పురుషోత్తంరెడ్డి, ఆమోస్, ఇంద్రకరణ్‌రెడ్డి, సర్వేసత్యనారాయణ, వి.హెచ్. హనుమంతరావులు దిగ్విజయ్‌సింగ్ ప్రకటనపై, ఆపై వీరప్ప మొయిలీ ప్రకటనపై నిరసన వ్యక్తం చేశారు. ఇపుడు మళ్లీ ఢిల్లీ నుంచి రెండో ఎస్సార్సీ వేస్తున్నారన్న వదంతులు, ఆ వార్తలని వీరప్పమొయిలీ ధృవీకరించడంతో రాష్ట్రమంతా అగ్గిరాజుకున్నది. ఈసారి వృద్ధ కాంగ్రెస్ నాయకులు వెంకటస్వామి, ఎమ్మెస్ గళమెత్తారు. రెండో ఎస్సార్సీ వేస్తే తాను లోక్‌సభ సభ్యత్వానికి రాజీనామా చేస్తానని ప్రకటించాడు. ఢిల్లీ నుంచి సంయమనంతో మాట్లాడే జయపాల్‌రెడ్డి రెండో ఎస్సార్సీ వేస్తే తాను ఎన్నికల్లో పోటీ చేయనని ప్రకటించాడు. రెండో ఎస్సార్సీ ఏర్పాటును వ్యతిరేకిస్తూ టి.ఆర్.ఎస్ ఇప్పటికే ఆందోళనా కార్యక్రమాలు చేపట్టింది. రాస్తోరోకోలు, రైల్ రోకోలు, దిష్టిబొమ్మల దగ్ధం, మంత్రుల ఘెరావ్‌లను కొనసాగిస్తున్నది. నల్లగొండలో తెలంగాణాని డిమాండ్ చేస్తూ

***ఉద్యమాలు ఉవ్వెత్తున ఎగసినప్పుడు పాలకులు తాత్కాలికంగా వెనకడుగు వేసినా నిరంతరం ఉద్యమించకుంటే అదును చూసి సెజ్‌ల వంటి విధానాలను మళ్లీ అమలు చేస్తారంటున్నారు*** **ధర్మారపు వేణు, ఎస్. రాజేష్**

# గోవాలో సెజ్‌ల రద్దు తాత్కాలికమేనా?

దేశంలో ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనకు మరోసారి తెరలేచింది. దేశ ప్రజానికాన్ని కట్టుబానిసలుగా మార్చేందుకు రంగం సిద్ధమైంది. కార్మికుల రక్తం జుర్రడానికి సామ్రాజ్యవాద దేగలు కాచుకొని కూర్చున్నాయి. దేశంలో మరోసారి విదేశీ సంస్థానాల ఏర్పాటుకు స్వదేశీ పాలకులు అనుమతులిస్తున్నారు. భూములే కాదు, కోట్ల రూపాయల రాయితీలూ ఇస్తున్నారు. మనదేశ సముద్ర తీర ప్రాంతాలు బహుళజాతి సంస్థల లోగిళ్లుగా మారబోతున్నాయి. 18వ శతాబ్దంలో ఎక్కడైతే బ్రిటిష్ సామ్రాజ్యవాదులు పరిశ్రమలు, వాణిజ్య స్థావరాలను ఏర్పాటు చేశారో సరిగ్గా ఆ ప్రాంతాల్లోనే ప్రత్యేక ఆర్థిక మండళ్ల ఏర్పాటు చేయబూనడం భారత్ పై సామ్రాజ్యవాదుల భల్లూకపు పట్టు పెరుగుతోందనడానికి నిదర్శనం. చరిత్ర పునరావృతం అవుతోంది. ప్రజలు పోరాడుతూనే ఉన్నారు. గత సంవత్సర కాలంగా దేశంలో సెజ్‌లకు వ్యతిరేకంగా సాగుతున్న ఆందోళన నందిగ్రామ్ నుంచి గోవాకు పాకింది. ఈ రాష్ట్ర ప్రజలు ప్రభుత్వ మెడలు వంచి సెజ్‌లను రద్దు చేయించారు.

గోవా ఈ పేరు వినగానే గుర్తుకు వచ్చేది, అహ్లాదమైన సముద్ర తీరం.. సుందరమైన బీచ్‌లు, ఆపక్కనే వాలుగా పెరిగిన కొబ్బరి చెట్లు, దేవలయాలు, ప్రార్థనా స్థలాలు. ఇది పర్యాటకులకు స్వర్గధామం. దేశ, విదేశాల నుంచి వచ్చే లక్షలాది పర్యాటకులకు ఆతిథ్యం ఇచ్చే గోవా ప్రజలు, ప్రస్తుతం ఓ మహోద్యమం చేపట్టారు. పశ్చిమ బెంగాల్, మహరాష్ట్ర, హర్యానాల్లో ఎగిసి పడుతున్న సెజ్ మంటలు గోవాను కూడా అంటుకున్నాయి. సెజ్‌లకు వ్యతిరేకంగా వారు చేస్తున్న పోరాటం అంతర్జాతీయ సమాజం దృష్టిని ఆకర్షించింది.

కోట్లలో విదేశీ పెట్టుబడులు, లక్షల్లో ఉద్యోగాలు అని ప్రజలకు ఆశ చూపి గోవా రాష్ట్ర ప్రభుత్వం 2005 లో ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటుకు శ్రీకారం చుట్టింది. రాష్ట్ర వ్యాప్తంగా 16 సెజ్‌లు ఏర్పాటు చేయాలని నిర్ణయించిన ప్రభుత్వం 15 సెజ్‌ల కోసం ఇప్పటికే కేంద్రానికి

---

5 లక్షల మందితో బహిరంగ సభ నిర్వహిస్తానని ప్రకటించింది. మార్చ్ 6వ తేదీలోగా తెలంగాణ ఏర్పాటును ప్రకటించకపోతే తమ పార్టీ ఎంపీలు, ఎం.ఎల్.ఎ.లు, ఎం.ఎల్.సి.లు రాజీనామాలు సమర్పిస్తారని అల్టిమేటం ఇచ్చింది. ఈ అగ్గి అన్ని రాజకీయ పక్షాలకు అంటుకున్నది. కాంగ్రెస్ వంచనని, దగాని ఖండిస్తూ అన్ని రాజకీయ పక్షాలు ప్రకటనలు జారీ చేస్తున్నాయి.

ఇంత జరుగుతున్నా సోనియాగాంధీ మాత్రం తన మనోభావాలు వెల్లడించడం లేదు. ద్రోహాల చరిత్ర కలిగిన కాంగ్రెస్‌ను ఇకనమ్మే పరిస్థితి కనపడటంలేదు. కాంగ్రెస్ ద్రోహాల చిట్టా చిత్రగుప్తుడి పాపాల చిట్టా కన్నా పెద్దదే, కనుక తన పాపాల పరిహారానికైనా ఇపుడైనా తెలంగాణ రాష్ట్రాన్ని ప్రకటించాలి. అందుకు తగిన రాజ్యాంగపరమైన చర్యల్ని వెంటనే చేపట్టాలి. తెలంగాణ రాష్ట్రం తప్ప మరేది తెలంగాణ ప్రజలను సంతృప్తి పరచలేదు.

ఇక పోతే తెలంగాణ ప్రజలు, ఉద్యమకారులు విశ్లేషించు కోవాల్సిన మరో ప్రధానాంశం – దేశంలో 14 రాష్ట్రాలను ఎటువంటి ఇబ్బందులు లేకుండా ఏర్పాటు చేయగలిగిన కేంద్ర ప్రభుత్వాలు, ఇపుడు బుందేల్‌ఖండ్‌ని సునాయసంగా ఇవ్వజూపుతున్న యు.పి.ఎ ప్రభుత్వం తెలంగాణ దగ్గరికి వచ్చేవరకు ఎందుకు ఈ ఊగిసలాట? ఎందుకీ సంశయంలో డిమాండ్ ఉన్నది. ప్రజల ఆకాంక్షలు పలుమార్లు పలు రూపాలలో వ్యక్తమైనాయి. 1990 దశకం నుండి వర్తమాన తెలంగాణ ఉద్యమం పల్లె పల్లెకు చేరింది. అయినా కేంద్ర ప్రభుత్వాలు తెలంగాణ ఇవ్వడానికి ఇబ్బంది పడుతున్నాయి. అంటె కోస్తా వలసవాదం తెలంగాణపై తన పట్టును ఇంకా సడలించుకోలేదు. అసలు ఇన్నేళ్ల ఉద్యమం తర్వాత వలసవాదం బలహీనపడిందా? పడితే కేంద్ర పాలక వర్గాలను ఇంకా ఎందువల్ల ప్రభావితం చేయగలుగుతున్నారు? కేంద్ర పాలక వర్గాలపై వలసవాదం ప్రభావాలతో పాటు అంతర్జాతీయంగా సామ్రాజ్యవాదుల, ఎం.ఎన్ సిల ఒత్తిళ్లు ఉన్నాయా? తెలంగాణపై నిర్ణయం జరిగేది ఢిల్లీలోనా? వాషింగ్‌టన్‌లోనా? ఇవ్వాళ కోస్తావలస వాదం అంతర్జాతీయ సామ్రాజ్యవాదులకు దళారులుగా మారిన పరిస్థితుల్లో కేంద్ర పాలక వర్గాలపై జమిలిగా ఈ రెండింటి ప్రభావాలు ఉండే అవకాశం లేకపోలేదు. కాబట్టి తెలంగాణ అనుకూల శక్తుల ఏకీకరణ ఎంత బలంగా ఉంటె అంటే బలంగా కోస్తా వలసవాదం పట్టును సడలించగలుగుతాము. కేంద్ర పాలక వర్గాలపై వలసవాదుల ప్రభావాన్ని తగ్గించగలుగుతాం. తెలంగాణ అనుకూల శక్తులను సంఘటితం చేయడం, తెలంగాణ వ్యతిరేకశక్తులను ఏకాకులను చెయ్యడం ఇవ్వాళ అనివార్య సందర్భంగా మనముందు ఉన్నది. ప్రజలు ఏ త్యాగలకైనా సిద్ధంగా ఉన్నారు. నాయకత్వమే దివాళకోరు తనంతో వ్యవహరిస్తున్నది. అంతర్జాతీయ సామ్రాజ్యవాదాన్ని, అంతర్గత వలస వాదాన్ని ఓడించేందుకు తెలంగాణ ప్రజలు, ఉద్యమం సంసిద్ధం కావడం ఇవ్వాళ్టి కర్తవ్యం. ◆

ప్రతిపాదనలు పంపింది. వాటిలో ఏడింటికి అనుమతులు సైతం వచ్చాయి. రెండు సెజ్‌లకు సంబంధించి పనులు కూడా ప్రారంభమయ్యాయి. మరో ఎనిమిది కేంద్రం వద్ద పెండింగ్‌లో ఉన్నాయి. అనుమతులు పొందిన సిపాల్స్ మెడిటాబ్ స్పెషాలిటీస్ ప్రైవేట్ లిమిటెడ్, పెనిసులా ఫార్మా రీసెర్చ్ సెంటర్, కె రహేజా కార్పొరేషన్ సంస్థల కోసం గోవా ప్రభుత్వం ఇప్పటికే 1500 ఎకరాల భూములు సేకరించింది. ఫార్మా పార్కు కోసం మెడిటాబ్ స్పెషాలిటీస్ సంస్థకు పొండా తాలుకా కెరిమ్ గ్రామం వద్ద 12.32 హెక్టార్ల స్థలం సేకరించి ఇచ్చింది. ఫార్మా పార్కు ఏర్పాటు నిమిత్తం ఈ సంస్థ ఇప్పటికే రు.500కోట్ల రూపాయలు ఖర్చు చేసింది. రహేజా కార్పొరేషన్ తనకు కేటాయించిన స్థలంలో ఐటీ పార్కు ఏర్పాటు చేస్తోంది.

## వెలువెత్తిన నిరసన

ప్రభుత్వం అనుమతించిన ఈ సెజ్‌ల పట్ల ఆది నుంచి నిరసన వ్యక్తమవుతోంది. సెజ్‌ల కోసం భారీగా వ్యవసాయ భూములు సేకరించడాన్ని రైతులు, సామాన్య ప్రజానీకం వ్యతిరేకిస్తున్నారు. రాష్ట్రంలో తొమ్మిది లక్షల జనాభా ఉండగా ప్రభుత్వం మాత్రం పది లక్షల ఉద్యోగాలు ఇస్తామని వాగ్దానం చేసింది. సెజ్‌లు ఏర్పాటైతే తమ భూములు కోల్పోవడమే గాక, ఉద్యోగాల కోసం బయటి రాష్ట్రాల నుంచి వచ్చిన వారు ఇక్కడే తిష్ఠ వేస్తారేమోనని రాష్ట్ర ప్రజలు ఆందోళన చెందుతున్నారని స్వయంగా గోవా ముఖ్యమంత్రే ప్రకటించారు. పరిశ్రమల ఏర్పాటు వల్ల పర్యావరణానికి ముప్పు వాటిల్లుతుందంటూ అక్కడి పర్యావరణ వేత్తలు గగ్గోలు పెడుతున్నారు. ప్రధానంగా అన్ని సెజ్‌లను సముద్రతీరం వెంట నెలకొల్పాలని ప్రభుత్వం భావించింది. ఇదే జరిగితే గోవాలోని బీచ్‌లు కనుమరుగవుతాయని పర్యావరణవేత్తలు ఆందోళన వ్యక్తం చేశారు. వీరికి రాజకీయ పక్షాలు, ప్రజా సంఘాలు మద్దతు పలకడంతో ఉద్యమం ఉధృతమయింది. నిరసనలు, ధర్నాలతో గోవా అట్టుడుకిపోయింది. అంతేగాక గత నవంబర్ 22న కెరిమ్ వద్ద ప్రారంభమైన మెడిటాబ్ ఫార్మా పార్కు పనులకు ఆటంకం కలిగించారు. పనులు కొనసాగించవద్దని సిబ్బందికి హెచ్చరికలు జారీ చేశారు. తలేగావ్ వద్ద ప్రారంభమైన రాజీవ్‌గాంధీ ఐటి పార్కు పనులను అడ్డగించారు. సుమారు రెండు వేల మంది ఆందోళనకారులు అక్కడికి చేరుకుని యంత్రాలు, సిబ్బంది వాహనాలను ధ్వంసం చేశారు. పరిస్థితి విషమించడంతో 144 సెక్షన్ విధించారు. రాజీవ్ గాంధీ ఐటి పార్కు కోసం లక్ష ఎకరాలు సేకరించడానికి ప్రయత్నించిన ప్రభుత్వానికి వ్యతిరేకంగా గోవా విశ్వవిద్యాలయం నిరసన గళం విప్పింది.

గోవాలోని పర్యావరణ వేత్తలు, ప్రతిపక్షాలు, మేధావులు, ప్రజాసంఘాలు ఎన్‌సిపి, బిజెపి, శివసేన తదితర రాజకీయ పక్షాలతో పాటు సెజ్ విరోధ్ మంచ్, గోవా బచావో ఆందోళన్ లాంటి సంస్థలు సెజ్ వ్యతిరేక పోరాటానికి చేయి కలిపాయి. ఒక్క మాటలో చెప్పాలంటే గోవా ప్రజానీకమంతా ఏకమయింది. గోవా మూవ్‌మెంట్ ఎగనెస్ట్ సెజ్ ఆధ్వర్యంలో సెజ్‌లు మాకొద్దంటూ ఉద్యమించి ప్రభుత్వానికి ముచ్చెమటలు పట్టించారు. ప్రజా ఉద్యమానికి ప్రభుత్వం దిగిరాక తప్పని పరిస్థితి కల్పించారు.

సెజ్‌లకు వ్యతిరేకంగా ఆందోళనలు వెల్లువెత్తిన రాష్ట్రాల్లో గోవా ఒక్కటే కాంగ్రెస్ పాలిత ప్రాంతం కావడం విశేషం. ఈ ఉద్యమం నేపథ్యంలో ప్రత్యేక ఆర్థిక మండలాలపై సమీక్షించేందుకు టాస్క్‌ఫోర్సు ప్రాంతీయ ప్రణాళిక - 2021 పేరిట మంత్రిత్వ సంఘాన్ని నియమించింది. రాష్ట్రంలో సెజ్‌లు వద్దని, వీటివల్ల రాష్ట్రానికి కలిగే ప్రయోజనమేమి లేదని ఆ సంఘం నివేదించింది. దీంతో పనులు ఆపేయాలంటూ మెడిటాబ్, రహేజా సంస్థలకు ప్రభుత్వం మౌఖిక ఆదేశాలు జారీ చేసింది. ఈ ఆదేశాలను సవాల్ చేస్తూ సదరు పరిశ్రమలు న్యాయపోరాటానికి దిగాయి. అందులో భాగంగా రాష్ట్ర హైకోర్టులో రెండు పిటిషన్లు దాఖలు చేశాయి.

అయితే ఇదిలా ఉండగానే ఆందోళనకారులు డిసెంబర్‌లో మరో హెచ్చరిక జారీ చేశారు. సెజ్‌లపై ప్రభుత్వం తన నిర్ణయాన్ని ఉపసంహరించుకునే దాకా పర్యాటకులను గోవాలో అడుగుపెట్టనివ్వ బోమని ప్రకటించారు. డిసెంబర్ 28 లోగా పర్యాటకులు గోవా వదిలి వెళ్లకుంటే తీవ్రపరిణామాలు ఎదుర్కోవాల్సి వస్తుందంటూ హెచ్చరించారు. వీరి ఆందోళనతో అధికార కాంగ్రెస్ నేతలు సైతం జతకట్టడంతో ముఖ్యమంత్రి దిగంబర్ కామత్ పరిస్థితి కుడితిలో పడ్డ ఎలుకలా మారింది. ప్రజాందోళనకు జడిసి ప్రభుత్వం దిగి వచ్చింది. ఈ నేపథ్యంలో రాష్ట్రంలోని 15 సెజ్‌లు రద్దు చేస్తున్నట్లు డిసెంబర్ 31 న గోవా సిఎం కామత్ ఓ ప్రకటన చేశారు. ఈ మేరకు ఢిల్లీ వెళ్లి వాణిజ్య శాఖ మంత్రి కమల్‌నాథ్‌కు పరిస్థితిని వివరించారు. ఆయన కూడా సానుకూలంగా స్పందించడంతో కామత్ ఊపిరి పీల్చుకున్నారు.

## రద్దు తాత్కాలికమేనా?

సెజ్‌లకు వ్యతిరేకంగా వెల్లువెత్తుతున్న ప్రజా ఉద్యమాలకు ప్రభుత్వాలు ఎట్టకేలకు తలొగ్గుతున్నాయి. నందిగ్రామ్‌లో గత మార్చి 14 న రాజ్యం సాయంతో పోలీసులు జరిపిన కాల్పుల్లో అనేక మంది నెలకొరిగారు. ఈ హత్యాకాండే దేశవ్యాప్తంగా సెజ్‌లపై పెద్ద ఎత్తున చర్చకు దారితీసింది. నందిగ్రామ్‌లో పరిణామాలు వామపక్ష ప్రభుత్వాన్ని డోలయామానంలో పడేశాయి. 'ఇది రాజకీయ, పాలన వైఫల్యం' అని బుద్ధదేవ్ స్వయంగా ఒప్పుకోవాల్సి వచ్చింది. ఐనప్పటికీ భూమి ఉచ్ఛేద్ ప్రతిరోధ్ కమిటి చేస్తోన్న ఆందోళన ఇంకా కొనసాగుతుండడంతో చేసేదేమిలేక నందిగ్రామ్‌లో కెమికల్ హబ్ (ఇండోనేషియా సలీం గ్రూప్‌కు చెందినది) ఏర్పాటును విరమించుకుంటున్నామని, భూసేకరణ జరపబోమని బెంగాల్ సిఎం బుద్ధదేవ్ స్వయంగా ప్రకటించాల్సి వచ్చింది. ఇది నందిగ్రామ్ ప్రజలు వీరోచిత పోరాటం చేసి సాధించిన విజయం.

గోవాలో కూడా పెద్ద ఎత్తున ఆందోళనకారులు విధ్వంసం సృష్టించినప్పటికీ అక్కడి ప్రభుత్వం కాల్పులకు ఆదేశించకపోవడం ఇక్కడ గమనించాల్సిన విషయం. సెజ్‌లన్నింటిని రద్దు చేస్తున్నట్లు ప్రకటించింది. దీనికి అక్కడున్న రాజకీయ అస్థిరత కూడా ఓ కారణం కావచ్చు. అయితే ఈ రెండు రాష్ట్రాల్లో అక్కడి రాష్ట్ర ప్రభుత్వాలు సెజ్ ఏర్పాటు విషయంలో కాస్త వెనకడుగు వేసినట్లు కనిపిస్తోంది. ప్రపంచీకరణ విధానాల అమలు పాలకవర్గాలకు అనివార్యమైన స్థితిలో ఈ రద్దు ప్రకటన తాత్కాలికమేనా? అనే సందేహం కలగక మానదు. ఆందోళనలన్నీ చల్లారకా తిరిగి ఏదో ఒక రూపంలో వీటిని ప్రవేశపెట్టడానికి పాలక వర్గాలు ప్రణాళికలు సిద్ధం చేస్తున్నాయి. అందుకే ఈ సెజ్ వ్యతిరేక పోరాటాన్ని సామ్రాజ్యవాద, ప్రపంచీకరణ ప్రతిఘటన పోరాటంగా ముందుకు తీసుకుపోవాల్సిన అవసరముంది. ◆

*తెలంగాణ చారిత్రాత్మక చిహ్నాలను, భాషా సంస్కృతులను పరిరక్షించే దిశగా ఇప్పటికైనా ప్రభుత్వం నడుము బిగించాలంటున్నారు* **డా. గోపు లింగారెడ్డి**

# తెలంగాణపై సాంస్కృతిక దాడి

కరీంనగర్ జిల్లా, వెల్గటూరు మండలం ద్వారా ప్రవహిస్తున్న గోదావరి నది తీరంలో 'కోటిలింగాల' ఉంది. ఇది శాతవాహన రాజుల తొలి రాజధానిగా ప్రసిద్ధి పొందింది. రామగుండం వద్ద నిర్మిస్తున్న ఎల్లంపల్లి ప్రాజెక్టులో కోటిలింగాల మునిగిపోతుంది. దీంతో కోటిలింగాల శివాలయం, శాతవాహనులు నిర్మించిన కోట మొదలైనవి జలమయ మయ్యే ప్రమాదముంది. ఈ ఘోర విపత్తును మొదట తెలంగాణ విద్యావంతుల వేదిక, తెలంగాణ రచయితల వేదిక వెలుగులోకి తీసుకొచ్చాయి. తర్వాత చాలా మంది మేధావులు, రచయితలు కోటిలింగాలను సందర్శించి, రక్షించమని ప్రభుత్వాన్ని కోరుతున్నారు. అలనాడు నాగార్జునసాగర్ నిర్మాణం జరిగినపుడు అందులో మునిగి పోతున్నాయనుకున్న బౌద్ధ ప్రాచీన సంపదను సమీపంలోని నాగార్జున కొండపైకి తరలించారు. అలాగే కోటిలింగాలలోని ప్రాచీన విగ్రహాల్ని, ఇతర సంపదను దాని సమీపంలోని మునుల గుట్టపైకి తరలించవచ్చు. కోటిలింగాల పరిరక్షణ కమిటీ నొకదాన్ని వేసికుని దాన్ని రక్షించే ఉద్యమం ప్రస్తుతం కరీంనగర్ జిల్లాలో జరుగుతోంది. రాష్ట్ర ప్రభుత్వం వెంటనే స్పందించాల్సిన అవసరముంది.

2005లో గుంటూరు జిల్లా అమరావతిలో జరిగిన కాలచక్ర ప్రపంచ బౌద్ధమత మహాసభల కోసం కరీంనగర్ జిల్లాలోని ధూళికట్టలోని ప్రాచీన బౌద్ధమత అవశేషాల్ని, నల్గొండ జిల్లాలోని పానగల్‌లో ప్రపంచ ప్రసిద్ధిగాంచిన గాంధారి శైలిలో నిర్మించిన మహోన్నతమైన బుద్ధుని శిల్పాన్ని ప్రభుత్వం తరలించింది. ఇంతవరకు వాటిని స్వస్థలాలలకు చేర్చలేదు. ఈ విధంగా తెలంగాణ ప్రాచీన సంస్కృతిని ఆంధ్ర వలసవాదులు తరలించుకుపోతున్నారు.

ఇటీవల కడప జిల్లాలో ప్రారంభించిన విశ్వవిద్యాలయానికి వేమన పేరును, రాజమండ్రిలో ప్రారంభించిన విశ్వవిద్యాలయానికి నన్నయ పేర్లు పెట్టిన ప్రభుత్వం నిజామాబాద్‌లో ప్రారంభించిన యూనివర్శిటీకి తెలంగాణ పేరు పెట్టడం తెలంగాణ ప్రాచీన కవులకు ద్రోహం చేసినట్లే అవుతుంది. అదీగాక నల్గొండలో ప్రారంభించిన విశ్వ విద్యాలయానికి మహాత్మాగాంధీ పేరు పెట్టడం దారుణం. అహమదాబాదులోగాని, న్యూఢిల్లీలోగాని మరే ఇతర ఉత్తర భారతదేశం లోని ప్రధాన నగరాలలో విద్యాసంస్థలకు గాని గాంధీ పేరు పెట్టడం సబబుగా ఉంటుంది గాని నల్గొండ జిల్లాకు గాంధీకి ఏం సంబంధం ఉంది. అందుకనే నల్గొండలో ప్రారంభించిన విశ్వ విద్యాలయానికి మహాకవి పోతన పేరు పెట్టాలనీ నిజామాబాద్ జిల్లాలోని యూనివర్శిటీకి కవి సోమన పేరు పెట్టాలనీ తెలంగాణ కవులు, మేధావులు కోరుతున్నా ప్రభుత్వం పట్టించుకోవడం లేదు. దక్షిణ కాశిగా ప్రసిద్ధి పొందిన వేములవాడ పుణ్యక్షేత్రానికి ఇంత వరకు రాష్ట్ర టూరిజం శాఖ గుర్తింపు లేదు. దీనివల్ల టూరిజం శాఖ నిర్మించే పున్నమి లాంటి హోటల్స్ నిర్మించలేకపోతోంది. టూరిజం శాఖ శైవ క్షేత్రాన్ని అభివృద్ధి చేయడానికి వీల్లేకుండా పోయింది. శ్రీశైలం, మహానందిలాగా వేములవాడ శైవక్షేత్రానికి ప్రచారం జరగడం లేదు. దానికి్కారణం ప్రచారం నిర్వహించే పి.ఆర్.ఓ. పోస్ట్ లేకపోవడం – వెంటనే ఆ పోస్ట్‌ను రాష్ట్ర దేవదాయ శాఖ మంజూరు చేయాలి. రాష్ట్ర దేవదాయశాఖామాత్యులు కరీంనగర్ జిల్లావాడై ఉండి ఆ జిల్లాలోని వేములవాడ పుణ్యక్షేత్ర సమస్యలు పట్టించుకోకపోవడం శోచనీయం. తెలంగాణలోని ప్రసిద్ధ దేవాలయాలు యాదగిరిగుట్ట, వేయి స్తంభాల గుడి, రామప్ప, కొలనుపాక, కాళేశ్వరం, కోటిలింగాలు, ధర్మపురి, వేములవాడల్ని కలుపుతూ, రాష్ట్ర టూరిజం శాఖ హైదరాబాదుకు ఓ బస్ నడపాలి. అలాగే వరంగల్‌లో శిథిలమవుతున్న వేయిస్తంభాల గుడిని తక్షణమే పునర్నిర్మించాలి. డిసెంబర్ 8, 9, 10 తేదీల్లో వరంగల్‌లో పేరిణి శివతాండవ ఉత్సవాల్ని, ఆంధ్ర నృత్యోత్సవాల పేరిట జరుపుకోవడం కాకతీయ కళావైభవానికే తీరని కళంకం. తెలంగాణలోని విభిన్న ప్రాంతాల్లో జాతరలు జరుగుతుంటాయి. రెండు సంవత్సరాల కొకసారి వరంగల్‌లో సమ్మక్క – సారక్క జాతర జరుగుతుంది. వచ్చే ఫిబ్రవరిలో జరిగే ఈ జాతరను జాతీయ పండుగగా గుర్తించి విస్తృతమైన ఏర్పాట్లు చేయాలి. మిగతా ప్రాంతాల్లో జరిగే జాతరలకు కూడా రాష్ట్ర ప్రభుత్వం అన్ని సౌకర్యాలు కల్పించి, భక్తులకు అసౌకర్యం కలుగకుండా చూడాలి.

ఇటీవల తిరుపతిలో జరిగిన తెలుగు సాహిత్యోత్సవంలో తెలంగాణ సాహిత్యం గురించి గాని, తెలంగాణ కవుల గురించి గాని వాటి చిత్రాల ప్రదర్శన గాని చేయకపోవడం పట్ల తెలంగాణ కవులు, మేధావులు నొచ్చుకుంటున్నారు. భవిష్యత్‌లో జరిగే ఈ సాహిత్యోత్సవాలల్లో ఈ లోటు పూడ్చాలని కోరుతున్నారు. నిజామాబాద్ జిల్లాలోని జైలులో తెలంగాణ విమోచనా కాలంలో మహాకవి దాశరథి, ప్రజా రచయిత వట్టికోట ఆళ్వారుస్వామి బంధించబడి రచనలు చేశారు. ఆ జైలు ప్రస్తుతం మరోచోటికి తరలించబడింది. పాత జైలును మహా కవుల స్మృతి చిహ్నంగా చేసి మ్యూజియంగా అభివృద్ధి చేయాలని కోరుతున్నారు. తెలంగాణ పోరాట యోధుడు కొమురం భీం పేరిట ఆదిలాబాద్ జిల్లాలో ఓ గ్రామీణ విశ్వవిద్యాలయాన్ని ప్రారంభించాలి – అలాగే మహబూబ్‌నగర్ జిల్లాలో సురవరం ప్రతాపరెడ్డి పేర, మెదక్‌లో మంజీర నది పేర, ఖమ్మంలో కిన్నెరసాని పేర, కరీంనగర్‌లో శాతవాహనుల పేర విశ్వవిద్యాలయాలు స్థాపించాలి. అలాగే తెలుగు సినిమాల్లో విలన్లకు, కమేడియన్లకు తెలంగాణ భాషను వాడడాన్ని మానుకోవాలి. మొత్తంగా భాషా, సంస్కృతుల పరిరక్షణ ప్రభుత్వం చిత్తశుద్ధితో పూనుకోవాలి. ◆

*చరిత్రలో హక్కులు గానీ, రాజ్యాధికారం గానీ ఏ ఒక్క వర్గానికీ అడిగితే రాలేదనీ, రక్తతర్పణలతో కూడిన త్యాగాలు, పోరాటాల ద్వారానే వచ్చాయనీ అంటున్నారు* **పి. కృష్ణారావు**

# మందు వేయాల్సింది ఏ వైరస్‌కు?

డిసెంబర్ 20న న్యూఢిల్లీలో కేంద్ర హోంమంత్రిత్వ శాఖ దేశ అంతర్గత భద్రతపై రాష్ట్రాల ముఖ్యమంత్రులు, ప్రధాన కార్యదర్శులు, డి.జి.పి.లు తో జరిపిన సదస్సులో భారత ప్రధానమంత్రి మన్మోహన్ సింగ్ మాట్లాడుతూ, 'నక్సలిజం ఒక వైరస్ అని అభివర్ణిస్తూ, ఈ వైరస్‌ను నిర్మూలించే వరకూ మన అధీనంలో ఉన్న అన్ని మార్గాల ద్వారా నక్సల్ దళాలను నిర్మూలించాలని, వామపక్ష తీవ్రవాదం పై యుద్ధం చేసేందుకు రాష్ట్రాల ప్రత్యేక దళాలను ఏర్పాటు చేయాలనీ' పిలుపునిచ్చారు. కేంద్ర హోంమంత్రి శివరాజ్ పాటిల్ 'నక్సలిజం బహుముఖ కోణాలున్న అంశమని, కేవలం శాంతి భద్రతల అంశంగానే కాకుండా సామాజిక, ఆర్థిక, రాజకీయ అంశంగా కూడా దీనిని పరిష్కరించడంలో వై.ఎస్. చక్కగా కృషి చేశారని' ప్రశంసించారు. ఇతర రాష్ట్రాలు ఆంధ్రప్రదేశ్‌ను నమూనాగా తీసుకోవాలని ప్రధాని సూచించారు. 1967లో నక్సల్బరీ ఉద్యమం, 1969లో శ్రీకాకుళ ఉద్యమం, ఇప్పుడు ఉత్తర తెలంగాణ, నల్లమల ప్రాంతాలలోని మావోయిస్టుల ఉద్యమం ఏరివేతల తరువాత, గత నలభై ఏళ్లుగా భారతదేశ పాలకులు అప్పుడప్పుడు చెబుతున్న మాటలైనప్పటికీ, ప్రజలు, ప్రజాస్వామికవాదులు గుర్తించవలసినవి, ప్రశ్నించవలసినవి, చర్చించవలసినవి అనేక అంశాలు ఉన్నాయి.

1917 అక్టోబర్ విప్లవంతో ప్రభావితమైన భారత దేశ కార్మిక, కర్షక వర్గం భారత కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో చేపట్టిన పోరాటాలు సుమారు తొమ్మిది దశాబ్దాలు కావస్తుండడం, 1947లో బ్రిటిష్ సామ్రాజ్యవాదం భారతదేశ భూస్వామ్య, పెట్టుబడిదారీ వర్గానికి అధికార మార్పిడి జరిపి అరవై ఏళ్లు నిండడం, 1967లో నక్సల్బరీ నిప్పురవ్వ రగిలి నాలుగుపదులు దాటడం చారిత్రకంగా యాదృచ్ఛికం కాకపోయినా, దేశంలో అవి లేవనెత్తిన ప్రశ్నలు, దిశానిర్దేశాలు నిరంతరం చర్చ రేపుతూనే ఉన్నాయి. దీనిని భారత పాలకవర్గాలు చెరిపేస్తే చెరిగిపోయేది, దాచేస్తే దాగిపోయేది కాదు. 1947 అధికార మార్పిడికి ముందుగానీ, తరువాత గానీ ఈ దేశ పీడితవర్గాలు భూస్వామ్య వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక, పెట్టుబడిదారీ వ్యతిరేక పోరాటాలను నడిపారు. 1940 నుంచి జరిగిన తెలంగాణ రైతాంగ పోరాటం గానీ, తెభాగా రైతాంగ పోరాటాలు గానీ, ముంబాయి రేవు కార్మికుల పోరాటాలు, కేంద్ర తపాలా ఉద్యోగుల జాతీయ సమ్మె, భారత జాతీయోద్యమం గానీ వీటిలో భాగమే. ఈ పోరాటాలు ఆయా పాలాకుల చేత తీవ్ర నిర్బంధానికి గురై అణచివేయబడి నప్పటికీ, ఆ పోరాటాలలో లేవనెత్తబడిన భూమి సమస్యగానీ, కార్మిక రైతాంగ హక్కులు గానీ, జాతీయోద్యమ స్ఫూర్తితో తయారు కాబడిన భారత రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కులు, ఆదేశ సూత్రాలు, రిజర్వేషన్‌లు మొదలు ఆయా పీడిత వర్గాల ఆర్థిక, రాజకీయ, సామాజిక మార్పుకి దోహదపడ్డాయి. వీటన్నింటినీ భారతదేశ పీడిత వర్గం రక్తతర్పణతో సాధించుకోవడం జరిగింది.

ఈ దిశలోనే మితవాదంలో కూరుకుపోయిన ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీలు (సిపిఐ, సిపిఎం) జెండా మార్చకుండా దిక్కుమార్చి భారత పాలకవర్గాలలో కలిసిపోయినప్పుడు, భూమిని ఎజెండాగా చేసుకొని 1967లో నక్సల్బరీలో రైతాంగం సాయుధ తిరుగుబాటు జరిపి, యావత్తు దేశానికి దిశానిర్దేశాన్నిచ్చింది. అదే 1969లో సిపిఐ (ఎం.ఎల్.) పార్టీ పుట్టుకకు దారి తీసింది. దీన్నే భారత పాలకవర్గాలు 'నక్సలిజం'గా పిలుస్తున్నాయి. ఏ ఉద్యమం వేయనంతటి ప్రభావాన్ని నక్సల్బరీ ఉద్యమమే ఎందుకు వేసింది. వేసిన ప్రభావం నాలుగు దశాబ్దాలుగా విస్తరిస్తూ భారతదేశ పాలకవర్గంలోను, సామ్రాజ్యవాద శక్తులలోను ఎందుకు వణుకు పుట్టిస్తోంది? సమాధానం తెలిసినా జార్జి బుష్ దగ్గర నుంచి మన్మోహన్ సింగ్ వరకు, చివరికి రాజశేఖర రెడ్డి కూడా ప్రజలకు చెప్పరు. చెబితే దోపిడీ వర్గ పునాదులు కదిలిపోతాయి, రాజ్యాధికారం తొంభై శాతంగా ఉన్న పీడిత శ్రామిక వర్గం చేతుల్లోకి వెళ్లిపోతుంది. అలా జరగకుండా ఉండాలంటే కేంద్ర, రాష్ట్ర పోలీసు బలగాలను పెంచి, విప్లవోద్యమాలను అణచివేయాలి. బూటకపు ఎన్‌కౌంటర్లతో నాయకత్వాన్ని నిర్మూలించాలి. 1940 తెలంగాణ సాయుధ రైతాంగ ఉద్యమం నుంచి నేటివరకు అదే జరుగుతోంది. కానీ ప్రజాఉద్యమాలు ఆగడంలేదు. ఎందువలన? జాతీయోద్యమం లేవనెత్తిన జాతుల స్వయం నిర్ణయాధికారం, స్వపరిపాలన, భాష, సంస్కృతుల పరిరక్షణ, భూ సంస్కరణలు, ఆర్థిక సమానత్వం, రాజకీయ సామాజిక రంగాలలో సమాన అవకాశాలు ఈ దేశ పీడిత కులాలకు, వర్గాలకు దక్కడం లేదు. ఆయా ఉద్యమాలు లేవనెత్తిన సమస్యలు ప్రజాస్వామికంగా పరిష్కరింపబడడంలేదు. దేశానికి స్వాతంత్ర్యం వచ్చిందని చెప్పుకోంటున్న పాలకవర్గాలు అరవై సంవత్సరాల తరువాత కూడ దోపిడీని యథేచ్ఛగా ప్రజలపై కొనసాగిస్తున్నారు తప్ప పేదరికం పోలేదు. ఇప్పటికీ జనాభాలో సగం మంది దారిద్ర్యరేఖకి దిగువనే ఉన్నారు. చదువుకున్న వారిలో యాభై శాతం నిరుద్యోగులు గానే బతుకులు వెళ్లబుచ్చుతున్నారు. విద్య, వైద్యం వంటి సేవా రంగాలు కొనుక్కొనే దశకు వచ్చాయి. దళితులపైన, ఆదివాసులపైన అగ్రకులాలు, గిరిజనేతరుల దోపిడీ, అణచివేతలు

*బాక్సైట్ తవ్వకాలతో ప్రజలకూ, పర్యవరణానికీ తీవ్ర నష్టమే కాక రాబోయే కాలంలో సాగునీరు, తాగునీరుకై పెను సంక్షోభం తప్పదంటున్నారు* **జి.రమేష్**

# బాక్సైట్ తవ్వకాలతో నదీజలాలకు ప్రమాదం

ఉత్తర కోస్తా జిల్లాలలో పంటలు పండి పట్టెడన్నం దొరుకుతోందంటే తూర్పు కనుమలనుంచి ప్రవహిసున్న నదులు, వాటిపై నిర్మించిన జలాశయాల వల్లే సాధ్యం. ఏజన్సీలో విస్తరించిన తూర్పు కనుమల్లో బాక్సైట్ గనుల తవ్వకాల వలన 19 నదులు, వాటిపై నిర్మితమైన 27 సాగు, తాగు నీటి ప్రాజెక్టులకు నష్టం కలిగే పరిస్థితి దాపురించింది. తూర్పు కనుమల్లో నిక్షిప్తమై వున్న బాక్సైట్ గనుల తవ్వకాలను ప్రభుత్వం చేపట్టేందుకు సిద్ధమౌతున్నతరుణంలో ఈ కొండ కోనల్లో నుంచి ప్రవహిస్తున్న జీవనదుల మనుగడ ప్రశ్నార్ధకంగా మారింది. ఆ నదులపై ఆధారపడి జీవిస్తున్న ఆదివాసీలు, మైదాన ప్రాంతీయుల పరిస్థితి అగమ్యగోచరంగా తయారయ్యే ప్రమాదం ఉంది. ఈ పరిస్థితుల్లో బాక్సైట్ గనుల తవ్వకాలకు పర్యావరణ అనుమతి ఇంకా లభించలేదు. ఢిల్లీకి చెందిన ది ఎనర్జీస్ రీసోర్స్ ఇనిస్టిట్యూట్ దేశంలో మైనింగ్‌ల ప్రభావంపై అధ్యయనం చేసింది. విశాఖ ఏజన్సీలోని ఒక్క అనంతగిరి ప్రాంతంలోనే బాక్సైట్ మైనింగ్ వల్ల 1500 కోట్ల రూపాయల విలువైన పర్యావరణ సంపదకు నష్టం వాటిల్లుతుందని తన నివేదికలో స్పష్టంచేసింది.

### అడుగంటనున్న జలాశయాలు

పూనేకు చెందిన కల్పవృక్ష పర్యావరణ సంస్థ 2004లో నిర్వహించిన సర్వేలో బాక్సైట్ గనుల తవ్వకాల వలన తూర్పు కనుమల్లో ఉన్న ఏలేరు, తాండవ, శారద నదులకు నష్టం వాటిల్లుతుందని హెచ్చరించింది. ఈ నదులపై ఏర్పాటు చేసిన రిజర్వాయర్లు

---

పెరిగిపోతున్నాయి. వీటన్నింటికి వ్యతిరేకంగా ఆయా వర్గాలు సంఘటితమై విప్లవోద్యమాలను చేస్తుంటే అవి కేంద్ర, రాష్ట్ర పాలకులకు తీవ్రవాద ఉద్యమాలుగా కన్పిస్తున్నాయి. అందుకే నాలుగు దశాబ్దాల విప్లవోద్యమం వామపక్ష తీవ్రవాదంగా కన్పిస్తోంది.

భారత రాజ్యాంగ ప్రవేశికలో రాసుకొన్నట్లుగా 'సమసమాజ స్థాపన' అంటే వేళ్లపై లెక్కగట్టి టాటాలు, బిర్లాలు, అంబానీల అభివృద్ధే అభివృద్ధిగాను, ప్రజాస్వామ్యమంటే, 'దొంగనోట్ల దొంగఓట్ల' ఎన్నికలేననీ, సంస్కరణల పేరుతో ప్రజలకు సబ్సిడీలు, ఇందిరమ్మ ఇళ్లు కట్టించడం వంటివి చేయడం కాదనీ, దేశ సంపద (భూమి, పరిశ్రమలు వంటివి) ప్రజలందరికీ సమానంగా పంచబడి, సమాన పనికి సమాన వేతనం దక్కినప్పుడు, కుల రహిత సమాజం ఏర్పడి మనిషిని మనిషిగా చూడబడినప్పుడు, స్త్రీలపైన పురుషాధిక్యత నశించి స్త్రీని సమానంగా చూసినప్పుడు, అవినీతిని అంతంచేసినప్పుడు, పౌరులందరికీ రాజ్యాంగం కల్పించిన పౌర ప్రజాస్వామిక హక్కులు కల్పించబడినప్పుడు మాత్రమే ఈ దేశంలో నిజమైన ప్రజాస్వామ్యం ఏర్పడిందనీ, అటువంటి ప్రభుత్వాన్ని ప్రజాస్వామిక ప్రభుత్వమనీ చెప్పవచ్చు. కానీ ఈ అరవై సంవత్సరాలుగా అటువంటి ప్రభుత్వం ఏర్పడిందా? లేదు, కనుకనే ప్రజలు ఉద్యమి స్తున్నారు. అటువంటి ఉద్యమాలను పాలకులు శాంతిభద్రతల సమస్యగా చూస్తూ యుద్ధం ప్రకటించితే, అది వర్గ ఉద్యమంగా మారి 'సివిల్‌వార్' అవుదుతుంది. ఇది చరిత్రలో ప్యారిస్ కమ్యూన్ కావచ్చు, రష్యాలో అక్టోబర్ విప్లవం కావచ్చు, చైనాలో లాంగ్ మార్చ్ కావచ్చు. ఏదైనా సరే పీడిత ప్రజలు సంఘటితమై రాజ్యాధికారం కోసం చేస్తున్న పోరాటంగానే చెప్పవచ్చు. అయితే చరిత్రలో మాత్రం అడిగితే హక్కులు గానీ, రాజ్యాధికారం గానీ ఏ ఒక్క వర్గానికి రాలేదన్నది నగ్న సత్యం. అది బలప్రయోగం ద్వారానే వచ్చిందన్నది వాస్తవం. కావున మనదేశం లో కూడా పీడితవర్గం పాలకులపై బలప్రయోగం చేసే రాజ్యాధికారం చేజిక్కించుకోవాలి తప్ప, పాలకవర్గం తనంతట తానుగా రాజ్యాధికారాన్ని వదులుకోదు. అయితే మనదేశంలో విచారించదగ్గ విషయమేమిటంటే, వామపక్ష విప్లవోద్యమాన్ని రాజకీయంగా గుర్తించడానికి భారత పాలకవర్గాలు అంగీకరించకపోవడం, నక్సలైట్ పార్టీలను రాజకీయ పార్టీలుగా గుర్తించక, వారిని సంఘ విద్రోహులుగాను, తీవ్రవాదులుగాను ముద్రవేసి ప్రచారం చేసి మధ్యతరగతి ప్రజలలో వ్యతిరేకత పెంచడానికి పాలకులు ప్రయత్నిస్తున్నారు.

అందులో భాగంగానే డిసెంబర్ 20, న్యూఢిల్లీ సదస్సులో ప్రధానమంత్రి, హోంమంత్రి, మన రాష్ట్ర ముఖ్యమంత్రి మొదలైనవారు. విప్లవోద్యమం పై నిప్పులు చెరిగారు. భారత ప్రధాని వామపక్ష విప్లవోద్యమాన్ని 'వైరస్'తో పోల్చి, దానిని నిర్మూలించాలని పిలుపు నిచ్చారు? కాని ఆరు దశాబ్దాల అధికారమార్పిడిలో పాలకవర్గాలకు పట్టిన 'వైరస్'ను వదలగొట్టాలంటే ఈ దేశ పీడితవర్గాలు, కులాలు సంఘటితమై రాజ్యాధికారదిశగా ఉద్యమాలు నడిపినప్పుడే తగిన 'మందు' దొరుకుతుంది తప్ప, మరేమందు పనిచేయదని ప్రజలు గుర్తిస్తారని ఆశిద్దాం. ◆

నిరుపయోగంగా మారుతాయని తెలియజేసింది. అంతేకాకుండా దీని వల్ల లక్షలాది ఎకరాల సాగుభూములకు నీటికి తీవ్ర ఆటంకం ఏర్పడుతుందని, తాగునీటికి ఇబ్బందులు తప్పవని తెలిపింది. ఫలితంగా సాగు, తాగునీటి కోసం ప్రజల నుంచి తీవ్ర నిరసన వ్యక్తమవుతుందని చెప్పింది. తూర్పు గోదావరి జిల్లాలోని ఏలేరు, సూరంపాలెం, భూపతిపాలెం, మంప, మద్దిగెడ్డ, రిజర్వాయర్లు, సుబ్బారెడ్డి సాగర్‌లు ఉన్నాయి. ఏలేశ్వరం వద్ద ఏలేరు జలాశయం నిర్మించి విశాఖ ఉక్కు కర్మాగారానికి అవసరమైన నీటిని అందిస్తున్నారు. ఈ రిజర్వాయర్‌కు 24.11 టి.ఎం.సి ల సామర్థ్యం ఉంది. 20వేల ఎకరాలకు పైగా ఆయకట్టు ఉంది. గోకవరం మండలం సూరంపాలెం రిజర్వాయర్ ద్వారా 15వేల ఎకరాలకు సాగు నీరందిస్తున్నారు. పవిత్ర పుణ్యక్షేత్రం అన్నవరం వద్ద పంపానదిపై నిర్మించిన పంపా రిజర్వాయర్ 510 టి.ఎం.సి.ల నిల్వ సామర్థ్యంతో 12 వేల ఎకరాలకు సాగు నీరందిస్తోంది. ప్రత్తిపాడు మండలం కుంతిదేవి వాగుపై నిర్మించిన సుబ్బారెడ్డి సాగర్ 10 వేల ఎకరాలకు సాగునీరు అందిస్తున్నది.

ఏలేరు నదిపై అడ్డతీగల వద్ద నిర్మించిన మద్దిగెడ్డ రిజర్వాయర్ 4వేల ఎకరాలకు సాగునీటిని అందిస్తోంది. విశాఖపట్నం జిల్లాలో తాండవ, రైవాడ, కళ్యాణపులోవ, మేగాద్రిగెడ్డ, గంభీరంగెడ్డ, కోనాం, పెద్దేరు, రంగుపోలిగెడ్డ, ఉరకగెడ్డ, ఎన్టీఆర్ జలాశాయలకూ, రంపచోడవరం మండలంలో ఉన్న భూపతిపాలెం రిజర్వాయర్‌కు బాక్సైట్ గనుల తవ్వకాల వల్ల తీవ్ర ముప్పు ఏర్పడనుంది. నాతవరం మండలం గంటావారి కొత్తగూడెం వద్ద బొడ్డేరు నదిపై తాండవ రిజర్వాయరు నిర్మించారు. ఈ రిజర్వాయర్ విశాఖ, తూర్పుగోదావరి జిల్లాలలోని 50 వేల ఎకరాలకు సాగునీరు, 77 గ్రామాలకు తాగునీటి అవసరాలను తీరుస్తున్నది. దేవరాపల్లి మండలం రైవాడ వద్ద శారద నదిపై నిర్మించిన రైవాడ జలాశయం 3.6 టి.ఎం.సి.ల సామర్థ్యంతో 15వేల ఎకరాలకు సాగునీరు, విశాఖ పారిశ్రామిక అవసరాలకు, తాగునీటి అవసరాలకు నీటిని అందిస్తోంది. రావికమతం మండలం కళ్యాణపులోవ వద్ద వరహానదిపై నిర్మించిన రిజర్వాయర్ సుమారు 5 వేల ఎకరాలకు సాగునీటిని అందిస్తోంది. పెందుర్తి మండలం కొమరపాలెం వద్ద మేఘాద్రి గెడ్డపై నిర్మించిన రిజర్వాయర్ విశాఖనగరానికి మంచినీటి అవసరాలను తీర్చే అతిపెద్ద జలాశయం. ఆనందపురం మండలం గంభీరం వద్ద నిర్మించిన రిజర్వాయర్ 1000 ఎకరాలకు సాగునీటిని, విశాఖ ప్రజలకు మంచినీటిని అందిస్తోంది. చీడికాడ మండలం కోనాం వద్ద శారద నదిపై నిర్మించిన రిజర్వాయర్ 12వేల ఎకరాలకు పైగా సాగునీరు అందిస్తోంది. మాడుగుల మండలం వద్ద రావిపాలెం వద్ద శారద నదిపై నిర్మించిన పెద్దేరు జలాశయం 7 వేల ఎకరాలకు నీరు అందిస్తోంది.

తాటిపర్తి వద్ద తాచేరు పై నిర్మించిన ఎన్టీఆర్ జలపాతం 3500 ఎకరాలకు సాగునీరు అందిస్తోంది. కశింకోట మండలం పరవాడపాలెం వద్ద రంగబోలు గెడ్డపై నిర్మించిన జలాశయం 1000 ఎకరాలకు సాగునీరు అందిస్తోంది. మాడుగుల మండలం శంకరం వద్ద ఉరక గెడ్డపై నిర్మించిన జలాశయం 500 ఎకరాలకు సాగునీటిని అందిస్తోంది. విజయనగరంలోని డెంకాడ ఆనకట్ట, ఆంధ్రా, తాటిపూడి, వేగావతి, సీతానగరం, పెద అంకలం, ఒట్టిగెడ్డ, తోటపల్లి, వెంగళరాయ సాగర్, పెద్దగెడ్డ, జంఝావతి రిజర్వాయర్‌లు ఉన్నాయి. శ్రీకాకుళం జిల్లాలో వంశధార, మడ్డువలస, నాగావళిపై కోటపల్లి బ్యారేజ్, పెద అంకలం ఆనకట్టలు ఉన్నాయి. ఈ రిజర్వాయర్‌లు అన్నీ తూర్పు కనుమల నుంచి వచ్చేటి వంటి నీటి ఆధారంగా ఆయా ప్రాంతాల ప్రజల అవసరాలకు తాగు, సాగునీటిని అందిస్తున్నాయి. తూర్పు కనుమల్లోని నిక్షిప్తమై వున్న బాక్సైట్ గనులు నీటిని నిల్వవుంచుకుని విడుదల చేసే గుణాన్ని కలిగి వున్నాయి. బాక్సైట్ తవ్వకాలు జరిగితే తూర్పు కనుమల్లో నీటిని నిల్వచేసే పరిస్థితి ఉండదు. ఫలితంగా ఇక్కడ ఉన్న నదులు జలాశయాలు అడుగంటుతాయి. దీని మూలంగా రాబోయే కాలంలో ఉత్తరాంధ్ర ప్రజలకు నీటి కష్టాలు మొదలు కానున్నాయి. సాగు భూములకు నీరందక భూములు బీడుబారిపోనున్నాయి. పంటలు పండక ఆకలి చావులకు, వలసలకు దారితీసి కరువు కాటకాలకు దారితీయనుంది. మైనింగ్ వల్ల కాసులు కురుస్తున్నాయని మురిసి పోతున్న పాలకులు పర్యావరణానికి ఏర్పడే నష్టాన్ని మాత్రం పట్టించుకోక పోవడం శోచనీయం. పట్టించేకుంటున్నట్టు నటించినా అది ఒట్టి కపటప్రేమే!

## ప్రజావ్యతిరేకత

పర్యావరణానికి, మానవ, జంతు జీవజాలానికి తీవ్ర స్థాయిలో ముప్పు ఏర్పడుతున్నా, బాక్సైట్ తవ్వకాలకే ప్రభుత్వం మొగ్గు చూపడం విశేషం. తాత్కాలిక లాభాలకే ప్రాధాన్యత ఇస్తున్న ప్రభుత్వం దీర్ఘకాలిక లాభాలను దృష్టిలో పెట్టుకోకుండా అడవులను సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థలకు ధారాదత్తం చేస్తున్నది. కేంద్ర జలవనరుల పర్యావరణ శాఖ నుంచి నేటి వరకూ బాక్సైట్ తవ్వకాలకు అనుమతి లభించలేదు. అయినా పాలకవర్గ ప్రభుత్వం తన ప్రయత్నాలు విరమించు కోకపోవడం బట్టిచూస్తే ఎంత అప్రజాస్వామికంగా, నిరంకుశంగా వ్యవహరిస్తుందో అర్థమవుతున్నది. మన్యంలో లభించే సహజవనరులను దోచుకుని అనురాక్, అల్‌ఖైమా, జిందాల్ వంటి కార్పోరేట్ సంస్థలు ఇబ్బడి ముబ్బడిగా తమ వ్యాపార సామ్రాజ్యాన్ని విస్తరించుకోవటాన్ని మన ప్రజల ప్రయోజనాల దృష్ట్యా మనం వ్యతిరేకించాలి. లేని పక్షంలో భవిష్యత్ తరాల ముందు దోషులుగా నిలబడవలసి వస్తుంది.

నిజానికి ఇది ప్రభుత్వ, పాలకవర్గ ప్రతినిధుల బాధ్యత. అయితే ఇప్పటివరకు మన పాలకవర్గ ప్రతినిధులు స్పందించాల్సిన రీతిలో స్పందించకుండా ప్రభుత్వానికే వత్తాసు పలుకుతున్నారు. అడవిపై హక్కు ఆదివాసులది, పీడిత ప్రజలదనీ, బాక్సైట్ తవ్వకాల కోసం కుదుర్చుకున్న ఒప్పందాన్ని ఉపసంహరించుకోవాలనీ, 1/70 చట్టాన్ని యథాతథంగా అమలు చేయాలనీ, మన్యంలో బహుళజాతి సంస్థల గుత్తాధిపత్యానికి వ్యతిరేకంగా పోరాడాల్సి ఉంది. ఫలితంగా ఒక సమష్టి కార్యాచరణతో ప్రజాఉద్యమాన్ని నిర్వహించవలసిన బాధ్యత ప్రజలు, ప్రజాస్వామిక వాదులు, విద్యార్థి మేధావుల మీదే పడింది. అడవిపై హక్కు ఆదివాసులది. పీడిత ప్రజలది! అనే నినాదంతో సుదీర్ఘ ప్రజాఉద్యమం నిర్వహించకపోతే అడవిపై హక్కు మనకు దక్కదు.

◆

**అన్ని రాజకీయ పక్షాలకూ అధికార లాలసే తప్ప విలువల గురించి, సామాజిక పరివర్తన గురించి ఆలోచన లోపించిందంటున్నారు కె.జి. కన్నబిరాన్**

# విలువలు నశించిన రాజకీయాలు

ప్రపంచీకరణ, హిందుత్వ వ్యవస్థీకృతంగా ఒకదాన్ని ఒకటి వ్యతిరేకించుకునే భావజాలాలేమీ కావు. వాటిలో ఒకటి సోషలిస్ట్ వ్యవస్థల శిథిలాల మీద లేచి నిలిచింది. మరొకటి ఉదారవాద ప్రజాస్వామిక సంక్షేమ రాజ్యం భావన శిథిలాల మీద లేచి నిలిచింది. రెండూ కూడ యథాస్థితి వాదాన్ని సమర్థిస్తాయి. అందువల్లనే ప్రపంచీకరణ రాజకీయాలతో హిందుత్వకు బాగా పొసుగుతుంది. అయితే మన సమాజం వంటి నిలువనీరుగా మారిపోయిన బహుళ సమాజాలలో రాజకీయ వ్యవస్థ సంక్షోభమయంగా, హింసాత్మకంగా ఉంటుంది. ప్రపంచీకరణ, హిందుత్వ ఈ సమాజాలాను ఎదగకుండా అడ్డుకుంటాయి. ఈ సమాజాలు ఎదిగినప్పుడు మాత్రమే దేశంలో దొరుకుతున్న వనరుల పంపిణీ, వినియోగాల మధ్య ఉన్న తీవ్రమైన అసమానతలు తగ్గిపోతాయి. ఇటువంటి సమాజాలలో అభివృద్ధి పేరుతో జరిగేది దారుణమైన అసమానాతలతో నిండి ఉంటుంది. విశాల ప్రజాబాహుళ్యానికి దారిద్ర్యాన్ని, నిరుద్యోగాన్ని మాత్రమే మిగులుస్తుంది. అందువల్ల ఆహారం తగ్గిన కొద్ది కళ్లు మిరుమిట్లుగొలిపే ఆకర్షణలు పెరిగిపోతాయి. ఆకలి పెరిగిన కొద్ది రథయాత్రలు పెరిగిపోతాయి. రామసేవకుల గుంపులు అతి తక్కువ ఖరీదుకు కిరాయికి దొరుకుతాయి. దారి పొడుగునా మైనారిటీల ఆస్తులను ఇష్టారాజ్యంగా దోపిడీ చేయవచ్చుననే హామీ వాళ్లకు దొరుకుతుంది. హిందుస్తాన్ మీద దాడి చేసేటప్పుడు గజిని, ఘోరీకి ఎటువంటి పాశవిక శక్తులు దొరికాయో, సరిగ్గా అటువంటి శక్తులనే సమీకరించడం ఇప్పుడు కార్యక్రమం. వాళ్లు చరిత్రను చదివే పద్ధతి అది. అలా గుజరాత్‌లో వాళ్లు చేసిన ప్రయోగం దిక్కులుపిక్కటిల్లే విజయాన్ని సాధించింది. ఇలా విజయాల మీద విజయాలు ఒక వరుస క్రమంలో దక్కుతాయని వాళ్ల ఉత్సాహం ఇనుమడిస్తుంది.

చరిత్రను ఈ రకంగా అధ్యయనం చేయడం వాళ్ల రాజకీయ కృషిని చాలా సులభంగా మార్చేస్తుంది. ప్రజలను సమీకరించడం సులభమైపోతుంది. భారతదేశాన్ని మొఘల్‌లు ఆక్రమించిన తీరును, దేశ విభజన తీరును, విభజన తరువాత జరిగిన మారణకాండను ఒక తప్పుడు పద్ధతిలో చూస్తే చాలు. దానికి యాభై సంవత్సరాలుగా కాశ్మీర్‌లో మానని గాయంలా రగులుతున్న సమస్యను కలిపితే చాలు. ఒక మతోన్మాద పార్టీ రాజకీయాలు తయారవుతాయి. ఆ పార్టీ దేశం మొత్తాన్ని పాలించడానికి ఉగ్రూతలూగుతున్నది. నిజానికి గుజరాత్ ఎన్నికలు ఒక విషయం రుజువు చేసాయి. మైనారిటీల మీద మారణకాండ సాగించినప్పటికీ సోనియా గాంధీ వంటి రాజకీయవేత్త ఉద్వేగపూరిత నినాదాలు, ప్రసంగాలు సాగించినప్పటికీ గుజరాత్ ప్రజల మీద పది సంవత్సరాలుగా నరేంద్ర మోడీకి ఉన్న పట్టు ఏమాత్రం తగ్గలేదు. మోడీని మృత్యు వ్యాపారిగా ప్రకటించి దాడి చేయడంలో ఆయన బీరువాలలో దాగిన అస్థిపంజారలను ప్రదర్శనకు పెట్టడంలో కాంగ్రెస్ పార్టీ సాహసికంగానే ప్రవర్తించింది. ఆమే ప్రచారాన్ని చూసి మోడీ నవ్వుకొని ఉంటాడు. ఎందుకంటే రెండు పార్టీలు శవాల వ్యాపారం చేసినవే. ఆ శవాలు వేరు వేరు మైనారిటీలవి కావచ్చు. కాని, వాళ్లెప్పుడూ పశ్చాత్తాప పడలేదు. ముస్లింల మారణకాండ గురించి మోడీని విమర్శించడం ఎటువంటి విశ్వసనీయతను సాధించలేదు. ఎందుకంటే విమర్శించిన పార్టీ కూడ అదే రకమైన మారణకాండకు పాల్పడింది.

ఎన్నికల తరువాత నరేంద్ర మోడీ భాజపా, ఎన్.డి.ఎ. కూటమిలో నాయకులందరిలో కన్న ఎత్తయిన వాడయిపోయాడు. ఎలక్ట్రానిక్ ప్రసార సాధనాలు నరేంద్రమోడీని చూసి మైమరిచిపోతున్నాయి. ఇవే ప్రచార సాధనాలు రాజీవ్‌గాంధీని చూసి కూడ ఆయన కాంగ్రెస్ నాయకుడిగా ఎన్నికయిన తరువాత ఇదే రకంగా మైమరిచిపోయాయి. 1984లో సిక్కుల హత్యాకాండ జరిగినప్పుడు ఒక్క మర్రి చెట్టు కూలినప్పుడు దాని కింద పడి కొందరు చనిపోక తప్పదు అని రాజీవ్‌గాంధీ నిస్సిగ్గుగా ప్రకటించాడు. రాజ్యాంగాన్ని ఏమీ మార్చకుండానే ప్రజలను నిశ్శబ్దంలో ముంచడం ఎలాగో రాజీవ్‌గాంధీకీ తెలుసు, నేరంద్రమోడీకీ తెలుసు. వాళ్లు కేవలం చట్టబద్ధ పాలనను కాసేపటి కోసం ఉపసంహరించవలసి ఉంటుంది. ఇటు హైకోర్టు న్యాయమూర్తులు గానీ, అటు సుప్రీంకోర్టు న్యాయమూర్తులు గాని జరిగిపోతున్న నేరాలను ఆపరు. కళ్లముందర జరుగుతున్న నేరాలను పరిగణనలోకి తీసుకొని ప్రభుత్వాలకు హెచ్చరికలు పంపే ధైర్యం చెయ్యరు. ఈ మారణకాండల గురించి ఏమైనా చెప్పని హైకోర్టునో, సుప్రీంకోర్టునో అడగడానికి ఒక్క ప్రజానుకూల బృందము, పౌరులు ముందుకు రారు. గతంలో రూపొందించిన లాంటి ఉదాత్తమైన భావనలను తయారు చేయడానికి అత్యున్నత న్యాయస్థానం కూడ ముందుకు రాదు.

ఈ స్థితిలో ఉదారవాద వామపక్ష రాజకీయ శక్తులు కూడ తమ

రాజకీయాలను పొరపాటుగా అర్థం చేసుకుంటున్నాయి. తమ విశ్వసనీయతను పోగొట్టుకున్నాయి. సామాజిక పరిణామాలకు ప్రతిస్పందించే శక్తిని కోల్పోయినాయి. పశ్చిమ బెంగాల్‌లో అధికారంలో ఉన్న వామపక్ష ప్రభుత్వం తన రాజకీయాలను వదిలి పెట్టి 1984 నాటి రాజీవ్‌గాంధీ సాహచర్యంలోకి, ముంబయి బాల్‌థాకరే సాహచర్యంలోకి, గుజరాత్ నరేంద్రమోడీ సాహచర్యంలోకి వెళ్లిపోతోంది. వాళ్లు పెట్టుబడిదారీ విధానం వైపు పురోగించడమే మంచిదని, సోషలిజం సాధ్యం కాదనీ ప్రకటిస్తున్నారు. అయిష్టంగా అయినా ప్రపంచీకరణను కావలించుకుంటున్నారు. 'వికారమైన పెట్టుబడిదారీ విధానాన్ని మనం ఎంత వ్యతిరేకించినప్పటికి, దాన్ని కావలించుకోక తప్పదు' అని ముఖ్యమంత్రి బుద్ధదేవ్ అంటున్నాడు. పెట్టుబడిదారీ విధానంతో అంటకాగడం మొదలైన తరువాత సింగూర్‌లో మార్క్స్ భూమి లక్ష రూపాయల చిన్న కారును తయారు చేస్తోంది. ఇప్పుడిక ఉదారవాద భావాలనో, వామపక్ష విలువలనో ప్రాతినిధ్యం వహించే రాజకీయ పార్టీ ఏదీ లేదు.

మావోయిస్టులు, ఇతర వామపక్ష బృందాలు ఎంతో కాలంగా మార్క్స్‌దో, మావోదో వక్రీకృత చిత్రాలను చూడడంలో తమను తాము మరచిపోయారు. ఆ వక్రరూపాల పద్మవ్యూహంలో వాళ్లు దారితప్పారు. వీళ్లందరూ సోషలిస్ట్ ఆలోచనల చరిత్రను మరొకసారి చూడవలసి ఉంది. లౌకిక సోషలిస్ట్ విలువలను పునరుద్ధరించి మెరుగుపరచవలసి ఉంది. అలా మాత్రమేవారు పేదలకు, అణగారినవర్గాలకు సహాయం చేయగలరు.

ఎన్నికల విధానాన్ని, ఎన్నికలలో పాల్గొంటున్న పార్టీలను ఇవాళ వామపక్ష ఉదారవాద విలువలు నడపడం లేదు. ఆ ఎన్నికలకు మూలమైన రాజ్యాంగంలో ఉదాత్తమైన ఆదర్శాలు ఉన్నప్పటికీ ఈ రాజకీయ పార్టీలన్ని నిజమైన వ్యాపార సంస్థలుగా మారిపోయాయి. ఓట్ల కొనుగోలు కోసం తమ ఉత్పత్తుల గురించివ్యాపార ప్రకటనలు ఇస్తున్నాయి. వాళ్ల వల్ల ఏప్పుడయినా ప్రజలకు ఏదైనా మేలు జరిగిదంటే అది వాళ్లు ఉద్దేశించిందేమీ కాదు. మొత్తం ఎన్నికల ప్రచార సరళే వ్యాపార ప్రకటనల పద్ధతిలో ఉంది. తెలంగాణ సమస్యపై గాని, వెనుకబడిన కులాలు, లేదా బహుజనులు రాజకీయాధికారం సంపాదించుకోవడం విషయం గాని, జరుగుతున్న చర్చలు చూస్తే అధికార రాజకీయాలు ఎలా పనిచేస్తున్నాయో అర్థం అవుతుంది. జరుగుతున్న చర్చ అంతా అధికారం సాధించే రాజకీయాల గురించే కాని, సామాజిక పరివర్తనను సాధించే రాజకీయాల గురించి కాదు. అంటే మార్గమే గమ్యం అయిపోయింది. మొత్తం ప్రయత్నమంతా రాష్ట్రాలలోనో, కేంద్రంలోనో ఒక పర్యాయము, రెండు పర్యాయాలు అధికారం సంపాదించడానికి ఎన్ని స్థానాలు గెలుచుకోగలమనేదే. సమ సమాజాన్ని సాధించడం ఎలానో ఏ ఒక్కరికి తెలియదు. అసలు అటువంటి ఆలోచనైనా ఎవరికైనా ఉందా అనేది నా సందేహం. ఉన్నవారికి లేనివారికి మధ్య ఉన్న సమస్యలు ఒక ప్రత్యేక తెలంగాణ రాష్ట్రంతో పరిష్కారం కావు. కేంద్రంలోనో, దేశంలోని ఒకటి రెండు రాష్ట్రాలలోనో వెనుకబడిన కులాల వ్యక్తులకు అధికారం వచ్చినంత మాత్రాన ఆ సమస్యలు పరిష్కారం కావు. సమస్యల మూలాన్ని పరిష్కరించాలని ఎవరు ఆలోచిస్తున్నట్టు లేరు. కొన్ని రాష్ట్రాలను రెండు రాష్ట్రాలగానో, మూడు రాష్ట్రాలగానో విభజిస్తే వచ్చే అనుకూల ప్రయోజనాల గురించి నాకేమీ సందేహం లేదు. ఉదాహరణకు ఉత్తరప్రదేశ్‌ను రెండో మూడో రాష్ట్రాలుగా విభజించవచ్చు. చిన్నదైన ఏకీకృతమైనదైన ప్రాంతం ఉంటే దాన్ని నిర్వహించడం సులభం. మానవాభివృద్ధి మీద కేంద్రీకరించి పనిచేయడం సాధ్యం. నదితీర రాష్ట్రాలు, వాటి వాటి నీటి వాటాలు దొరుకుతాయి. నీటి నిర్వహణా రాజకీయాలు తగ్గిపోతాయి. ఒకే రాష్ట్రంలో వేరు వేరు ప్రాంతాలు నది తమ ఒక్కరిదే అన్నట్టు ప్రవర్తించడం తగ్గిపోతుంది. అటువంటి నది జల వివాదాలు స్వాతంత్ర్యానంతరం ఎన్నో సందర్భాలలో చూసి ఉన్నాం.

నిజానికి ముఖ్యమంత్రులే స్వయంగా ప్రాంతీయ భాషా దురహంకారాన్ని ప్రోత్సహించారు. తమిళనాడుకు, కర్ణాటకు మధ్య ఇటువంటి ప్రాంతీయ దురంహంకారం రెచ్చగొట్టబడి బెంగళూరులో భాషా ఘర్షణలు చెలరేగాయి. బెంగళూరులో నివసించే తమిళుల మీద దాడులు జరిగాయి. తమిళ రచయితలను, మేధావులను అరెస్ట్ చేసి ప్రభుత్వానికి వ్యతిరేకంగా కుట్ర చేసారని కేసులు పెట్టారు. కర్ణాటక హైకోర్టు వారికి బేయిల్ ఇవ్వడానికి నిరాకరించి ఏడాదికి పైగా వారి నిర్బంధంలో ఉంచారు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా యుద్ధానికి పూనుకున్నారని ఒక కింది స్థాయి పోలీసు అధికారి పెట్టిన కేసు న్యాయమా అన్యాయమా పార్లమెంట్ గానీ, న్యాయస్థానాలు గానీ ఆలోచించనే లేదు. ఒక కింది స్థాయి పోలీసు అధికారి ఇలా చేస్తే బ్రిటిష్ వలసవాదులు సమర్థించడాన్ని నేనర్థం చేసుకోగలను. కాని బ్రిటిష్ పాలకులు వెళ్లిపోయిన తరువాత దేశాన్ని భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా విడదీసి ఆయా రాష్ట్రాల పాలనా పరిధులు, సరిహద్దులు నిర్ణయించిన తరువాత శాంతి భద్రతలు, ప్రజా రక్షణ, విభిన్నంగా రూపొందించవలసి ఉండవలసింది. 44వ రాజ్యాంగ సవరణ తరువాత యుద్ధ పరిస్థితులలో మాత్రమే అత్యవసర పరిస్థితి విధించవచ్చునని రాసుకున్నాం. కాని ఒక కిందిస్థాయి పోలీసు అధికారి అత్యవసర పరిస్థితి లేకుండానే కొందరు వ్యక్తులు ప్రభుత్వం మీద యుద్ధం ప్రకటించారని కేసు నమోదు చేసుకున్నాడు. ఈ పని దాదాపు అన్ని రాష్ట్రాలలోను హాస్యాస్పదమైన పద్ధతిలో జరుగుతోంది.

నేను చెపుతున్న విషయం నుంచి చాలా దూరం వెళ్లాను. నేను చెప్పదలచినదల్ల రాజకీయాలలో దూర దృష్టి గాని, ప్రాపంచిక దృక్పథం గాని సంపూర్ణంగా రద్దయిపోయాయని మాత్రమే. ఒక ప్రత్యేక రాష్ట్రం సంపాదించడమో, వెనుకబడిన కులాల కూటమి అధికారానికి రావడమో, వాటికవిగా అంతిమ లక్ష్యాలు కావు. దినపత్రికలలో ఈ విషయాలపై మనం చదువుతున్న చర్చలు అధికారం సంపాదించడం దగ్గరే ఆగిపోతున్నాయి గాని ముందుకు కదలడం లేదు. బహుజన రాజకీయాలు అధికారం కోసం పోరాడుతున్నాయి. అటువంటి రాజకీయా పార్టీలు ఏర్పాటును నేను పూర్తిగా సమర్థిస్తాను. కాని బహుజనులు ఒకే ముద్ద కాదు. వారిలో విభిన్న బృందాలు ఉన్నాయి. నిర్ణయాధికారం సంపాదించడం కొరకు వారు ఒక్క చోట సమీకృతం అవుతున్నారు. ఈ

రాజకీయ పక్షం పోటీ పడే ఆకాంక్షలున్న విభిన్న కులాల సమ్మేళనంగా మాత్రమే ఉంటుంది. బ్రాహ్మణులకు వ్యతిరేకంగానో, ఇతర పెత్తందారీ అగ్రవర్ణాలకు వ్యతిరేకంగానో వాళ్లు ఏకం కావచ్చు. కాని లోలోపల పోటీ పడే ఆకాంక్షలు దాన్ని లోపలి నుంచి ధ్వంసం చేస్తాయి. ఈ కులాలు ఉపకులాలు తమ సొంత అస్తిత్వాన్ని యథాతథంగా ఉంచుకుంటున్నాయి. ఉద్యోగాల కోసమో, సామాజిక హోదాల కోసమో, ఆ అస్తిత్వాన్ని నిలుపుకోవాలని కోరుకుంటున్నాయి. ఒకవేళ వాళ్లు ధృడంగానూ, దూకుడుగానూ లేకపోతే వాళ్లకు అందవలసిన ప్రయోజనాలు కోల్పోతున్నారు.

మాలలకు, మాదిగలకు మధ్య జరిగిన ఘర్షణ లాంటిదే ఇతర కులాల మధ్య జరుగుతున్నది. మాదిగలకు ఇతర ఉపకులాలకు వారికి ఉద్యోగాలలో, విద్యలో రావలసిన వాటా వచ్చేవరకు ఉమ్మడి శత్రువుకు వ్యతిరేకంగా ఐక్యత సాధ్యం కావడం లేదు. బహుజన సమ్మేళనంలోని విభిన్న కులాలు, ఇప్పటికీ కచ్చితంగా అంతర్ వివాహాలను మాత్రమే పాటిస్తున్నాయి. అంతర్ వివాహాల పద్ధతి రద్దయ్యే వరకు కుల అస్తిత్వాలను తొలగించడం సాధ్యం కాదు. ఈ చర్చ వల్ల తేలేదేమంటే వెనుకబడిన కులాలు ఒక సమష్టి బృందంగా తయారు కావడానికి చాలా దూరంలో ఉన్నారు. అది సాధించడానికి ఇంకా చాలా కృషి చేయవలసి ఉంది. ఈ పని జరగకపోతే వాళ్లు అధికారానికి వచ్చినా ఇంత కాలము అధికారాన్ని అనుభవిస్తున్న అగ్రవర్ణాలు తెలివిగా వెనుకబడిన కులాల అధికారాన్ని దెబ్బతీస్తాయి.

అంతేకాదు, మనం చరిత్రను మరచిపోలేం. ఉత్తర ప్రదేశ్‌లోని మాయావతి పాలనలో ఒక బ్రాహ్మణుడు ప్రవేశించాడంటే నాకేమీ ఆశ్చర్యం లేదు. బ్రాహ్మణులు పాలక వర్గాలకు ఎప్పుడు సలహాదారులుగానే ఉంటూ వచ్చారు. మొత్తం మీద మనం ఇవాళ అనిశ్చితి స్థితిలో ఉన్నాం. ఈ అనిశ్చిత స్థితని పరిష్కరించలేం అని కాదు. కాని, మనం మన కాలం చెల్లిన దృక్పథాన్ని ఒదులుకోవడానికి సిద్ధంగా లేము కనుక, అధికారం కోసం ఆ కాలం చెల్లిన అస్తిత్వాలనే వాడుకో దలచుకొన్నాం గనుక ఈ సమస్య ఎప్పటికీ పరిష్కరించలేనట్టు కనబడుతోంది. అలా కాక ఈ విభిన్న అస్తిత్వాలు సామాజిక వర్గాలు మన సమాజంలోని బహుళత్వానికి చిహ్నాలనీ, వారందరికీ సమానత్వ హక్కు ఉందనీ, వారిని సమానంగా చూసి ఏకాభిప్రాయం సాధించి అధికారాన్ని సాధించవచ్చుననీ, నిర్వహించవచ్చుననీ, సమానత్వాన్ని స్థాపించవచ్చుననీ, గుర్తించవలసి ఉంది. ఒకసారి సాధించిన ఏకాభిప్రాయాన్ని పునరుద్ధరించుకుంటూ సమానత్వం అందరూ అంగీకరించే అలవాటు అయిపోయే దాకా సాగినప్పుడు మాత్రమే మనం ఒక ప్రజాస్వామిక గణతంత్రాన్ని రూపొందించగలం. అది మాత్రమే రాజ్యాంగ ఆదర్శమైన సోషలిజం వైపు పయనించగలదు. ◆

## పరిశోధనా ఫలాలు సమాజానికి అందజేయండి !

సామాజిక, ఆర్థిక, రాజకీయ అంశాలలో మీరు ఎంతో పరిశోధన చేసి ఉంటారు. అధ్యాపకులుగా మీ విద్యార్థులకు ఎన్నో పరిశోధనలలో ప్రత్యక్ష పరోక్ష సహకారాలు అందిస్తూ ఉంటారు. అయితే సమాజానికి ఎంతో ఉపయోగపడాల్సిన పరిశోధనా పత్రాలు ఏ సెమినార్‌లోనో ప్రస్తావించి వదిలేస్తే సరిపోదు. మీ పరిశోధనా ఫలాలు తెలుగు సమాజంలో నలుగురికీ చేరాలి. కొత్త ఆలోచనలకు ప్రేరణ కావాలి, కొత్త మార్గాలను ఆవిష్కరించాలి. అందుకు మీకు వేదికగా నిలిచేందుకు వీక్షణం ముందుకు వస్తోంది.

తెలుగులో పాప్‌కార్న్ పత్రికలే కానీ సీరియస్ పత్రికలు లేవన్న అభిప్రాయాన్ని పటాపంచలు చేస్తూ విజయవంతంగా రెండున్నరేళ్ల ప్రస్థానం సాగించి, 50 సంచికలు పూర్తి చేసుకుంది వీక్షణం.

ఎటువంటి డబ్బు మూటల దన్ను లేకుండా గుప్పెడు పాత్రికేయులు, సామాజిక శాస్త్రవేత్తలు కలిసి నడుపుతున్న ఈ పత్రికకు ఎందరో మేధావులు, అధ్యాపకులు, ఆలోచనాపరులు చందాదారులుగా ఉన్నారు. తెలుగు సమాజం గర్వించదగ్గ పాత్రికేయులు, సామాజిక శాస్త్రవేత్తలు, ఉద్యమకారులు, నిపుణులు అనేకుల రచనలు వీక్షణం ప్రచురిస్తోంది.

రండి, ఈ బృహత్కార్యంలో మీరూ పాలుపంచుకోండి. మీరు చేసిన పరిశోధనా ఫలితాలను వీక్షణంలో ప్రకటించండి. అది ఏ సామాజిక, ఆర్థిక, రాజకీయ అంశం అయినా ఫర్వాలేదు. తెలుగు ప్రజలకు ఆ అంశం ఆసక్తిగొల్పేదీ, ఉపయోగకరమైనదీ అని మీరు భావిస్తే చాలు. మీరే కాదు పి.హెచ్.డి చేసిన, చేస్తున్న మీ విద్యార్థులు కూడా తమ పరిశోధనా పత్రాలను (ఒక వ్యాసరూపంలో) పంపవచ్చు. రచనతో పాటు దానికి సంబంధించిన చిత్రాలు, గణాంకాలు కూడా జతపరిస్తే మరీ మంచిది.

***ఎంతో శ్రమించి మీరు చేస్తున్న పరిశోధనలు నలుగురికీ ఉపయోగపడేలా చేయండి.***
***వీక్షణం మీ రచనల కోసం ఎదురుచూస్తుంది !***
***మీదే ఆలస్యం !!***

*రచనలు పంపాల్సిన చిరునామా :*

ఎడిటర్, వీక్షణం, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్
3-6-394, 301, మైత్రీ రెసిడెన్సీ, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040 - 66843495

*ఇవ్వాళ్టి హిందుత్వ కేవలం మతతత్వ, భూస్వామ్య, అగ్రవర్ణ, పితృస్వామిక అర్థంలో మాత్రమే లేదనీ వీటితోపాటు సామ్రాజ్యవాద, నవసంపన్న, పతన సంస్కృతి కూడా తోడైందనీ అంటున్నారు* **ఎన్. వేణుగోపాల్**

# నడమంత్రపుసిరి భావజాలమే ఇవాళ్టి మతోన్మాదం

గుజరాత్ ఎన్నికల ఫలితాల తర్వాత మతోన్మాదం గురించి, ప్రత్యేకించి సంఘ్ పరివార్ నాయకత్వంలోని హిందూ మతోన్మాదం గురించి, వినాయక్ దామోదర్ సావర్కర్ ప్రవచించిన హిందుత్వ ఆధిపత్య భావజాల ఉన్మాదం గురించి మరొకసారి చర్చ జరుగుతున్నది. గుజరాత్, హిమాచల్ ప్రదేశ్‌లలో భారతీయ జనతాపార్టీ అధికారంలోకి రావడం హిందూ మతోన్మాద విజృంభణకు సూచన అవుతుందా కాదా అనీ చర్చ జరుగుతున్నది. అది ఒకవేళ హిందూ మతోన్మాద విజృంభణకు సూచిక అయితే హిందుత్వ ప్రతినిధిగా, నవసంపన్నుల అభివృద్ధి భావజాల ప్రతినిధిగా నరేంద్ర దామోదర్ దాస్ మోడీ మూడోసారి ఎన్నిలలో ప్రజామోదాన్ని పొందడం, అది కూడ వేలాదిమంది ముస్లింలను చంపిన, నిరాశ్రితులను చేసిన జాతి హననకాండ తర్వాత, దేశంలోనూ విదేశాలలోనూ కర్కోటకుడిగా పేరు తెచ్చుకున్న తర్వాత కూడ గుజరాత్ ఓటర్లలో అత్యధికులు ఆయనకే పట్టం కట్టడం ఏ పరిణామాలకు దారి తీస్తుందని చర్చ జరుగుతున్నది.

ఆశ్చర్యకరంగా 2007 గుజరాత్ ఎన్నికలలో హిందుత్వ, హిందూ మతోన్మాదం ప్రత్యక్ష, బహిరంగ నినాదాలుగా లేవు. మోడీ గుజరాతీ అస్తిత్వం, ఆర్థిక ప్రగతి, భద్రత అనే మూడు ప్రధాన భూమికలను ప్రకటించి వాటి మీదనే గెలిచాడు. మోడీ నిలువెల్లా హిందుత్వ మూర్తీభవించిన వ్యక్తే అయినప్పటికీ, కనీసం మూడు దశాబ్దాలుగా గుజరాత్ రాజకీయాల్లో సంఘ పరివార్ భావజాలాన్ని ప్రచారం చేస్తూ గుజరాతీ సమాజాన్ని నిట్టనిలువునా చీల్చిన చరిత్ర ఉన్నవాడయినప్పటికీ, ఈసారి ఎన్నికలలో ప్రకటించిన ఈ మూడు లక్ష్యాలలో హిందుత్వ గాని, విస్పష్టమైన హిందూ మతోన్మాదం గాని లేవు. గుజరాతీ అస్తిత్వం అనే జాతి భావనను, ఆర్థిక ప్రగతి అనే జీవనావకాశాల భావనను, భద్రత అనే సాధారణ ఆకాంక్షను ఆయన ఈ ఎన్నికల కోసం వాడుకున్నాడు. పైకి సాధువుల్లా కనబడే ఈ మూడు నినాదాల సారాంశమూ పరోక్షంగా ముస్లిం వ్యతిరేకతేననేది వేరే కథ. అంటే ఆధునిక హిందుత్వ మత ప్రతీకల స్థానంలో ఇతర ప్రతీకలను వాడదలచుకున్నదన్నమాట. లేదా తమ మతప్రతీకలను దాచుకుని వాటికి సర్వజనామోద ప్రతీకలను అద్దదలచుకున్నదన్నమాట. లేదా ఇతరేతర భావజాలం మతాన్ని ఆలంబనగా వాడుకుంటుదన్నమాట.

నిజానికి ఇటీవలి సంఘ్ పరివార్ నాయకత్వంలో చాలమంది, ముఖ్యంగా భారతీయ జనతాపార్టీ నాయకత్వంలో చాలమంది బహిరంగంగా హిందుత్వ పరిభాషకన్న ఎక్కువగా అభివృద్ధి, ఆర్థిక ప్రగతి, భద్రత పరిభాషను వాడుతున్నారు. క్రమక్రమంగా మత పరిభాషను ఈ ఆర్థిక రాజకీయ పరిభాష ఆక్రమిస్తున్నది. ఈ పరిభాష ముసుగు విప్పి చూస్తే అభివృద్ధి అన్నప్పుడు అది కేవలం పిడికెడు మంది సంపన్నుల అభివృద్ధి అని, లేదా పైకి ఎదగదలచుకున్న మధ్య తరగతి, నవ సంపన్నుల అభివృద్ధి అని, ఆర్థిక ప్రగతి అన్నప్పుడు సామ్రాజ్యవాద ప్రపంచీకరణకు, బహుళజాతిసంస్థలకు వారి స్వదేశీ దళారులకు మేలు అని, భద్రత అన్నప్పుడు మైనారిటీలను బూచిగా చూపడం, మైనారిటీల మీద హింస అని అర్థం చేసుకోవాలసి ఉంటుంది.

ఈ నేపథ్యంలో అసలు హిందూ మతోన్మాదం అని చాలాకాలంగా ప్రగతిశీల శక్తులు వాడుతున్న మాటను యథాతథంగా వాడవచ్చునా, సంఘ్‌పరివార్ ప్రతినిధిగా నిలిచిన భావజాలంలో హిందూ మతోన్మాదం మాత్రమే ఉందా, దానితోపాటు గుర్తించదగిన ఇతర అంశాలేమయినా ఉన్నాయా ఆలోచించవలసి ఉంది. మతోన్మాదం సంఘపరివారానికి సారాంశమా, పాలకవర్గ ఫాసిజానికి ఒక రూపం మాత్రమేమా ఆలోచించవలసి ఉంది. సంఘపరివారం తనవెనుక ఇతోధికంగా శక్తులను సమీకరించుకోవడానికి ఒక సమీకరణ నినాదంగా ప్రధానంగా మతాన్ని 1990ల దాకా వాడుతూ వచ్చింది గాని, ఆ తర్వాత ప్రారంభమయిన నూతన ఆర్థిక విధానాల శకంలో మతప్రతీకలతో పాటుగానో, అంతకన్న ఎక్కువగానో ఆర్థిక రాజకీయ ప్రతీకల అవసరం పెరిగింది. సంఘపరివారం వైపు ఎక్కువగా ఆకర్షితులవుతున్న మధ్యతరగతి, నడమంత్రపు సంపన్నులకు ఇవాళ మతంతో పాటుగా అభివృద్ధి భావజాలం కూడ ఉంది. అందువల్ల ఇవాళ్టి హిందుత్వ కేవలం మతతత్వ, భూస్వామ్య, అగ్రవర్ణ, పితృస్వామిక అర్థంలో మాత్రమే లేదు. ఆ పాత లక్షణాలన్నీ అలాగే ఉంచుకుంటూనే సామ్రాజ్యవాద, నవసంపన్న, పతన సంస్కృతికి కూడ గొడుగుపడుతున్నది.

కనుక ఇవాళ్టి హిందుత్వను 1960ల నుంచీ విపరీతంగా పెరుగుతూ వచ్చిన మత ఘర్షణలు, 1984 సిక్కుల ఊచకోత, 1992

బాబ్రీ మసీదు విధ్వంసం, 2002 గుజరాత్ జాతి హననకాండ వంటి పరిణామాల పూర్వరంగంలో మాత్రమే కాక, ప్రపంచీకరణ రాజకీయార్థిక సమ్మేళనంతో కూడ కొత్తగా అర్థం చేసుకోవలసి ఉంది. దాన్ని కేవలం ఒక మతభావనగా, మతతత్వంగా, మతోన్మాదంగా మాత్రమే కాక ఇతర అంశాల సమాహారంగా చూడవలసి ఉంటుంది. ఇతర మతస్తుల పట్ల వీరశైవులు, క్రుసేడ్లలో క్రైస్తవులు, జిహాద్‌లలో ముస్లింలు ప్రదర్శించిన మతభరితమైన హింసాకాండకూ నరేంద్రమోడీ నాయకత్వంలో ప్రస్తుత సంఘ్ పరివార్ శక్తులు సాగిస్తున్న హిందుత్వ హింసాకాండకూ గుర్తించదగిన తేడాలు ఉన్నాయి. బహుశా పాలస్తీనియన్ల మీద ఇజ్రాయిల్ చేస్తున్న దాడితో మాత్రమే మోడిత్వకు పోలిక ఉంది. సరిగ్గా ఇజ్రాయిల్ జియోనిజంలో కూడ మతభావన ఉన్నప్పటికీ, రాజకీయార్థిక కోణాలే ఎక్కువ.

నరేంద్రమోడీ అమలు చేస్తున్న హిందుత్వ సావర్కర్ రాసిన నాటి హిందుత్వలోని మౌలిక లక్షణాలయిన అఖండ భారతం, పితృభూమి (లేదా మాతృభూమి), హిందూ ఔన్నత్యం, ముస్లింల వంటి ఇతర మతస్తులను లొంగదీయడం, వ్యాయం, హింసల ద్వారా ఆధిపత్యం వంటి వాటికే పరిమితం కాకుండా కాలక్రమంలో ఇతర అంశాలను, ముఖ్యంగా రాజకీయార్థిక అంశాలను భాగం చేసుకుంది. సావర్కర్ రాసిన హిందుత్వ, ఆ తర్వాత మాధవ్ సదాశివ్ గోల్వాల్కర్ ప్రారంభించిన రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘం, దాని భావజాన్ని వ్యాపింపజేయడానికి దాని అనుబంధ సంస్థలుగా పుట్టుకొచ్చిన భారతీయ జన సంఘం, ప్రస్తుత భారతీయ జనతాపార్టీ, భారతీయ జనతా యువ మోర్చా, భారతీయ కిసాన్ మోర్చా, భారతీయ మజ్దూర్ సంఘ్, అఖిలభారత విద్యార్థి పరిషత్ వంటి అనేక సంస్థలు, సంఘ పరివారంలో భాగంగా పుట్టుకొచ్చి తమ భావజాలాన్ని ప్రచారం చేయడం హింసాత్మకంగా మాత్రమే సాధ్యమవుతుందని నమ్ముతున్న శివసేన, బజరంగదళ్, విశ్వహిందూ పరిషత్ వంటి సంస్థలు ఏమి సాధించదలచుకున్నాయో, ఎటు ప్రయాణం చేస్తున్నాయో చూస్తే అవన్నీ హిందూ మతోన్మాదాన్ని వదులుకోకుండానే, ఆ పునాది మీదనే చాల ఇతర అంశాలను సంలీనం చేసుకున్నాయని అర్థమవుతుంది.

బహుశా వాటి పునాది హిందుత్వ మాత్రమే, మత భావన మాత్రమే అయితే వాటికి ఇవాళ దొరుకుతున్నంత ఆదరణ దొరికి ఉండేది కాదు. వాటి నియోజకవర్గం విస్తరించడానికి కారణాలు మన సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక పరిణామాలలో ఉన్నాయి.

ఒక ఉదాహరణ చెప్పాలంటే, చాతుర్వర్ణ ధర్మాన్ని, మనుస్మృతిని గౌరవించే, అమలు చేయాలని భావించే సంఘపరివారం కేవలం ఆ భావజాలం మీదనే ఆధారపడి ఉంటే దానిలో శూద్రకులాలకు చెందినవారు, దళితులు, ఆదివాసులు చేరడానికి అవకాశమే లేదు. ఎందుకంటే సైద్ధాంతికంగా శూద్రులను అణగదొక్కాలని, శూద్రులు పైన ఉన్న మూడు వర్ణాలకు సేవచేయడానికి మాత్రమే పుట్టారని సంఘ పరివారం భావిస్తుంది. దళితులు, ఆదివాసులు అసలు హిందూ ధర్మంలోనే భాగం కారు గనుక హిందూ ధర్మగంగ బిందువులను ఏకం చేయదలచిన సంఘ పరివారంలో వారికి స్థానం ఉండడానికి వీలేలేదు. అట్లాగే పితృస్వామ్యాన్ని, మనుధర్మాన్ని ఆరాధించే, ఆచరించే సంఘ పరివారం దగ్గరికి మహిళలు వెళ్లే అవకాశమే లేదు. కాని ప్రస్తుతం సంఘపరివారం తన ప్రతినిధులుగా, నాయకులుగా ప్రచారం చేస్తున్న వారిలో అనేక మంది దళితులు, ఆదివాసులు, శూద్రకులాలకు చెందినవారు, మహిళలు ఉన్నారు. అంటే భావజాల పరంగా చూసినప్పుడు తనలో కలవడానికి అవకాశంలేని శక్తులను సంఘపరివారం ఏ రకంగా కలుపుకోగలుగుతున్నదో లోతుగా ఆలోచించాలి. ఇవాళ హిందుత్వకు ప్రధాన ప్రతినిధిగా కనబడుతున్న మోడీ కూడా ఒక వెనుకబడిన కులానికి, (నూనె తయారు చేసే ఘాంచీ కులానికి) చెందిన వ్యక్తి గనుక సంఘ పరివారం బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య ప్రయోజనాలు నెరవేర్చడానికి శూద్ర నాయకత్వాన్ని ముందు పెట్టడానికి కూడ వెనుకాడడం లేదన్నమాట.

నిజానికి ఈ దేశంలో మతభావనలు, మత తత్వం, మతోన్మాదం ఎప్పుడూ స్వతంత్ర అస్తిత్వాన్ని ప్రదర్శించలేదు. మతం అధికారంతో కొనసాగుతూ అధికారం పట్ల ప్రజలలో అధీనవైఖరిని పెంచి పోషించడానికే పనిచేసింది. అందువల్లనే మత గ్రంథాలన్నీ కూడ ఒకవైపు కుటుంబ పెద్ద, పురుషుడు, వయసులో పెద్ద, కుల పెద్ద, కులాల దొంతరలో పెద్ద, మతాల దొంతలరో పెద్ద, మత పెద్ద అనే నిచ్చెనమెట్ల అధికారానికి ఇతరులను అధీనం చేయడానికి ప్రయత్నిస్తూ అదే సమయంలో భూ యజమాని, ఆస్తిపరుడు, గ్రామాధికారి, మండలాధీశుడు, రాజు, చక్రవర్తి, భగవంతుడు అనే అధికార నిచ్చెనను కూడ అనుల్లంఘనీయమైన ఆధిపత్య శక్తులుగా మార్చాయి. అలా వేలఏళ్లుగా మతానికీ భూస్వామ్యానికీ విడదీయరాని సంబంధం ఉంది. మరీ ముఖ్యంగా హైందవం, బ్రాహ్మణ్యం భూస్వామ్యానికి సమర్థన ఇవ్వడానికీ, రాజ్యాధికారాన్ని సాధికారికం చేయడానికీ పనిచేస్తూ వచ్చాయి. ఒకవైపు ఆర్థిక పరమైన ఆస్తి (ఆ రోజుల్లో ప్రధానమైన ఆస్తి భూమి)ని, మరొకవైపు సామాజికమైన వర్ణవ్యవస్థను ఇంకొక వైపు ఆధ్యాత్మకమైన ధర్మం పరలోకం, పరంపరాగత జన్మలు, మోక్షం అనే భావనలను కలగలిపింది మతం. అందువల్ల భారత సమాజంలో మతానికీ కులానికీ భూస్వామ్యానికీ విడదీయరాని సంబంధం ఉంది. ప్రపంచంలో ఇతర మతాలు ఏవైనా కులంతో సంబంధం ఉన్నవి కావు. తొలిరోజుల్లో భూస్వామ్యంతో, రాచరికంతో అంటకాగినవే అయినా కాలక్రమంలో అవసరం వచ్చినప్పుడు లౌకికం కావడానికి ప్రయత్నించాయి. హిందూ మతానికి అటు కులంతోనూ ఇటు భూస్వామ్య భావజాలంతోనూ ఉన్న పీటముడి కారణంగా అది లౌకికంగా మారే అవకాశమే కోల్పోయింది.

కులంతోనూ, భూస్వామ్యంతోనూ ఇంత అవినాభావ సంబంధం ఉన్న హిందుత్వను తమ రాజకీయ సిద్ధాంతంగా చేసుకున్న సంఘపరివారం సహజంగానే కులవ్యవస్థను యథాతథంగా నిలిపి ఉంచడానికి, భూస్వామ్యానికి సాధికారత కల్పించడానికి ప్రయత్నిస్తూ వచ్చింది. కాని ఒక రాజకీయ సిద్ధాంతంగా అది వీలయనంత ఎక్కువమందిని ఆకర్షించి తనలో సంలీనం చేసుకోవాలి గనుక ప్రధానంగా కులాన్ని, భూస్వామ్యాన్ని ముందర పెట్టుకోకుండా మతాన్ని ముందర పెట్టింది. మనమంతా హిందువులం ధర్మగంగ బిందువులం అని సంఘపరివారం నినదించి భారతీయులను సమీకరించడానికి

ప్రయత్నించినప్పుడు మతం పేరుతో ఒక కృత్రిమ ఐక్యతను, సంఘీభావాన్ని తయారుచేయడానికి సంఘపరివారం కృషి చేసింది.

ఈ నినాదంలో రెండు అసమంజసత్వాలున్నాయి. ఒకటి, భారత ఉపఖండం, లేదా కనీసం ఇవాళ ఉన్న భారతదేశం 1947కు ముందు ఎప్పుడూ ఒక పాలనా విభాగంగా లేనేలేదు. అట్లాగే భారత ఉపఖండం వందలాది జాతులతో, కులాలతో, మతాలతో, భాషలతో ఒక బహుళ సమాజం. ఆ బాహుళ్యాన్నంతా కలిపి ముద్ద చేసి మనమంతా హిందువులం అనడం మొదటి అబద్ధం. ఆ అబద్ధం మీద ఆధారపడి మనిషిని కేవలం ధర్మగంగ బిందువుగా గుర్తించడం, అంటే మనిషిని ఆధ్యాత్మికమైన ధర్మం చేతిలో నిష్క్రియాపరుడైన పావుగా, అందులోనూ ఈ ఉపఖండంలోని వందలాది నదులలో మతభావజాల అబద్ధాలు నింపుకున్న గంగతో కలపడం మరొక అసమంజసం. ఈ అబద్ధాలతో సాధించవలసిన ప్రయోజనం మతానికి సంబంధించినది కాదు. కులాన్నీ, భూస్వామ్యాన్నీ, ఆధిపత్యాన్నీ, అసమానతనూ బలపర్చడమే అసలు లక్ష్యం. అందువల్ల సంఘపరివారానికి ప్రధాన స్వభావం మతం అని అనుకోవడం పొరపాటు. దానికి మతం ఒక సాధనం, ఆలంబనం మాత్రమే. దాని లక్ష్యం కుల వ్యవస్థను, భూస్వామ్యాన్ని కొనసాగించడమే. కులానికి, భూస్వామ్యానికి దెబ్బ తగలకుండా చూడడమే.

ఈ విధంగా మతం పునాదిపై కులాన్నీ భూస్వామ్యాన్నీ పరిరక్షించే కార్యక్రమానికి సంఘ పరివారం పూనుకుంటున్న సమయాన నిజానికి భారత సమాజం వలసవాద వ్యతిరేక జాతీయోద్యమంలో తలమునకలుగా ఉన్నది. వలసవాదం స్థానిక భూస్వామ్యంతో పొత్తు పెట్టుకుని అయినా ప్రజా ఉద్యమాన్ని అణగదొక్కడానికి ప్రయత్నిస్తున్నది. అలా భూస్వామ్యానికీ, సామ్రాజ్యవాదానికీ కుదిరిన మిలాఖత్తులో సంఘపరివారం భాగమయింది. దాని చరిత్ర అంతా వలసవాద వ్యతిరేక ప్రజా ఉద్యమానికి ద్రోహం చేసిన చరిత్రే. ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం నాటినుంచీ విభజించి పాలించు సూత్రాన్ని అమలు చేస్తున్న వలసవాదానికి, హిందూ ముస్లింల మధ్య చీలికలు తేవడానికి ఆ చీలికలను హింసాపూరితం చేయడానికి, ఈ హిందూ మతోన్మాద భావజాలం ఉపయోగపడింది. భూస్వామ్య, కుల ఆధిపత్యాన్ని పరిరక్షించడానికి పుట్టుకొచ్చిన సంఘపరివారం సామ్రాజ్యవాద ఆధిపత్యానికి కూడ నమ్మిన బంటుగా మారింది. 1920లలో బ్రిటిష్ పాలకులు మన శత్రువులు కాదు అని ప్రకటించిన నాటినుంచి, ప్రపంచీకరణ శక్తులకు దాసోహం అన్న ఎన్.డి.ఎ. పాలనకాలం దాకా సంఘపరివారం చరిత్ర మాటల్లో ఏమి చెప్పినప్పటికీ సామ్రాజ్యవాదానికీ ఊడిగం చేసిన చరిత్రే.

సరిగ్గా ఎన్.డి.ఎ. పాలనాకాలం నాటి సంఘపరివార రాజకీయాల దగ్గరికి వచ్చాం కాబట్టి, అప్పటికి మన సమాజంలో మతంతో సమానంగా వ్యాప్తిలోకి వచ్చిన అభివృద్ధి అనే తప్పుడు భావాజాలాన్ని కూడ గుర్తించాలి. అభివృద్ధి అంటే అట్టడుగు మనిషి వికాసానికి అన్ని అవకాశాలను అందడం మొట్టమొదట కూడు గూడు గుడ్డ వంటి కనీస మానవ అవసరాలు తీరడం, ఆ పైన విజ్ఞాన, వినోద అవసరాలు తీరడం, మానవ సంబంధాలలో సమానత్వం, సౌభ్రాతృత్వం పెరగడం, ప్రతి మనిషికీ స్వేచ్ఛ ఉండడం, ఒక సమాజపు వనరులు ఆ సమాజ వినియోగంలోనే ఉండడం, సమష్టి కార్యాచరణ, సమష్టి అనుభవం వంటి గుణాత్మక అంశాలలో మెరుగుదలలను చెప్పుకోవాలి. కాని కొద్దిమందికి సంపద, వ్యక్తిగత ఆస్తి, భోగ వస్తువుల వినియోగం పెరగడం, అంకెలు, లాభనష్టాలుగా చూసే ధోరణి ఇటీవల ప్రబలింది. అభివృద్ధికి తప్పుడునిర్వచనాలు మొదలయ్యాయి. స్థూల జాతీయోత్పత్తి, జాతీయాదాయం, పెరుగుదల రేట్లు అనే నిరర్థకమైన సగటు ఉమ్మడి అంకెలు రాజ్యం చేస్తూ అదే అభివృద్ధిగా కనబడడం మొదలయింది. గుజరాత్ ఆర్థిక వ్యవస్థ సాలీనా పది శాతమో, పదకొండు శాతమో పెరుగుదల సాధిస్తున్నదని, ఆ పెరుగుదలను సాధించినది మోడీ పాలనేనని ఒక ప్రచారం మొదలయింది. అభివృద్ధి అనబడేదాన్ని ఒక్క శాతం పెంచగలిగిన వాడు వేలాది మందిని చంపించినా ఫరవాలేదు అనుకునే అమానుష స్థితికి సమాజంలోని ఒక వర్గం చేరుకుంది.

దురదృష్టవశాత్తూ ఆ వర్గం – ప్రధానంగా మధ్యతరగతి వర్గం – మాట్లాడే రాసే సామాజిక వ్యాఖ్యాతలుగా ఉండే వర్గం గనుక వాళ్ల మాటే సమాజపు మాటగా చలామణీ కావడం మొదలయింది. ఈ మధ్యతరగతి – ముఖ్యంగా గుజరాత్ లోని ఈ వర్గం చాలాకాలంగా షేర్ మార్కెట్ ఆదాయాలను అనుభవిస్తూ, ప్రపంచీకరణ శక్తులతో సన్నిహిత సంబంధంలో ఉంటూ ఉంది. అదే విధంగా ఈ వర్గమే గుజరాత్‌ను మత విద్వేషాల ప్రయోగశాలగా మార్చడానికి 1960లలో అద్వానీ ప్రారంభించి, ఆయన శిష్యుడిగా మోడీ కొనసాగిస్తున్న విభజనలో తమను తాము హిందువులుగా, ముస్లింలను శత్రువులుగా భావించుకుంటున్నది. అచ్చ తెలుగు నుడికారంలో చెప్పాలంటే వీళ్లు నడమంత్రపు సిరి దక్కినవాళ్లు. ఒకవైపు తీవ్రమైన మతవిద్వేషం, మరొకవైపు నడమంత్రపు సిరి, అమెరికా, ఇంగ్లండ్‌లతో సన్నిహిత సంబంధం వల్ల ఆ సామ్రాజ్యవాద పాలకవర్గాల ముస్లిం వ్యతిరేకతలో భాగస్వామ్యం, ఇవి వీళ్ల ప్రస్తుత లక్షణాలు.

కనుక ఇవాళ గుజరాత్‌లో గెలిచినది కేవలం హిందుత్వనో, హిందూ మతోన్మాదమో మాత్రమే కాదు. అది నడమంత్రపు సిరి భావజాలం, అది అమెరికా అనుకూల ముస్లిం వ్యతిరేక వైఖరి. అది ప్రపంచీకరణ శక్తులు ప్రపంచం మీద రుద్దుతున్న అభివృద్ధి భావజాలం. అది మన మధ్యతరగతి అమాయకంగానే, తన స్వప్రయోజనాల కొరకే నమ్ముతున్న, భాగమవుతున్న తప్పుడు చైతన్యం.

అయితే ఇదే సందర్భంలో మరొక రెండు ప్రశ్నలను కూడా ఆలోచించాలి. అందరూ అనుకుంటున్నట్టుగా, ముఖ్యంగా పార్లమెంటరీ వామపక్షాల మేధావులు చెపుతున్నట్టుగా హిందూ మతోన్మాదం అంటే సంఘపరివారానిది మాత్రమేనా అనేది మొదటి ప్రశ్న. భిన్న మతవిశ్వాసాలున్న భారత సమాజంలో ఇతర మత ఛాందసవాదాలను ఎలా అర్థం చేసుకోవాలి అనేది రెండో ప్రశ్న.

అసలు భారత సమాజంలో విస్పష్టమైన మత అస్తిత్వం బ్రిటిష్ వలసవాదుల సృష్టి. అంతవరకూ భారత సమాజం భిన్న ఆచార వ్యవహారాల అస్తిత్వాలన్నిటినీ భిన్నమైన కులాలు గానే గుర్తించి, కుల అంతరాల వ్యవస్థలో ఏదో ఒక స్థానంలో ఆ అస్తిత్వాన్ని కూచోబెట్టింది. అంటే భిన్న మతాలు కూడ కులాల రూపం ధరించి సామాజిక నిర్మాణంలో భాగమయ్యాయి. (షాద్ నగర్ దగ్గర మొగిలిగిద్దలో ఒకప్పుడు

ఉండిన రొహిల్లా భూస్వాములను, వాళ్ల మతం ప్రకారం ముస్లింలు అని కాకుండా రొయ్యలోల్లు అని స్థానికులు సంబోధించారు. తురకోళ్లు, దూదేకులోళ్లు, పింజార్లు, సాయిబులు అనే తెలుగు మాటలన్నీ ఆ సమూహాల మత అస్తిత్వాన్ని కాక, మరొక కులం లేదా సమూహం అనే అస్తిత్వ ప్రత్యేకతను మాత్రమే తెలుపుతున్నాయి.)

మధ్యయుగాల యూరప్ చరిత్రలో మత అస్తిత్వాల మధ్య హింసాపూరితమైన ఘర్షణల వల్ల బ్రిటిష్ వారికి గాని, యూరపియన్ సామాజిక శాస్త్రవేత్తలకు గాని తెలిసిన అస్తిత్వాలు మత అస్తిత్వాలే తప్ప భారత సమాజానికి, ప్రత్యేకమైన కుల అస్తిత్వాలు కావు. అందువల్ల భారత సామాజిక నిర్మాణం చూసిన యూరపియన్లకు మొట్టమొదట ఇది అర్థం కాలేదు. అందుకే భారత సమాజం గురించి వెలువడిన తొలి యూరపియన్ రచనలన్నీ కూడ ఇక్కడి ప్రత్యేకతలను పక్కన పెట్టి తమకు తెలిసిన అవగాహనల నుంచి ఇక్కడ మత అస్తిత్వాలను వెతకడానికి ప్రయత్నించాయి. ఇక్కడ ప్రజలలో మత భావనలు లేవని గాని, మత విభజన లేదని గాని అర్థం చేసుకోగూడదు గాని, భారత సమాజం గురించి బ్రిటిష్ వలస పాలకులు చెప్పినంత పెద్ద ఎత్తున, ఏకైక రూపంలో మత అస్తిత్వాలు లేవనే చెప్పాలి.

ఒకటి రెండు శతాబ్దాల పాటు భారత సమాజాన్ని ఆ రకంగా మత విభజన దృష్టి నుంచి అధ్యయనం చేసిన బ్రిటిష్ పాలకులు, 1857 తిరుగుబాటు తర్వాత ఆ అస్తిత్వాన్ని వాడుకుని ప్రజలను విభజించాలని, తద్వారా తమ పాలన సజావుగా సాగించుకోవచ్చునని అనుకున్నారు. ఆ పాలక కుట్ర ఫలితంగానే హిందూ ముస్లిం విభజన ఒక అగాథంలా మారిపోయి హింసా రూపం కూడ తీసుకుంది. మొత్తం సమాజంలోనే మేము – వాళ్లు అనే ఒక విభజన పట్ల అవగాహన పెరుగుతూ వచ్చింది. ఒకసారి వాళ్లు వేరు అనుకున్న తర్వాత మేం చేసేది అంతా ఒప్పు, వాళ్లు చేసేది అంతా తప్పు అనే అవగాహన రావడానికి ఎంతో దూరం ఉండదు. అక్కడ రాజకీయార్థిక ప్రయోజనాలు కూడ తోడయితే అది ఆధిపత్యానికి, హింసకు, అణచివేతకు దారితీయడం కూడ సహజమే. ఈ పూర్వరంగంలో మామూలు మనుషులలో కూడ, హింసను వ్యతిరేకించే వారిలో కూడ మేం – వాళ్లు అనే విభజన రేఖ ఏర్పడుతుంది. 'మనమంతా ఒకటే, మనలో చాల వైవిధ్యాలున్నాయి, ఆ వైవిధ్యాలలో భాగంగానే ఏ సమూహానికి ఆ సమూహానికి ప్రత్యేక లక్షణాలున్నాయి' అని అనుకోవలసిన చోట, విభిన్న అస్తిత్వాల మధ్య పరస్పర అవగాహన, గౌరవం, ఆదానప్రదానాలు ఉండవలసిన చోట, మేం వేరు, వాళ్లు వేరు అనే ఆలోచన తలెత్తిందంటే, అది ఒకరి మీద మరొకరి ఆధిపత్యాన్ని సమర్థించే స్థితికి మార్గం సుగమం చేస్తుంది. ఇరవయోశతాబ్ది భారత చరిత్ర అంతా జరిగినదిదే.

అందువల్ల ఏదో ఒక స్థాయిలో ఇవాళ తమ మతం గొప్పదనీ, ఇతర మతం లోపపూరితమైనదనీ లోలోపలనైనా అనుకోని వ్యక్తులు లేరు. 'వాళ్లంతేనండీ, మత ఛాందసులు' అనే మాట చాల ఉదారవాదులయిన ఆలోచనాపరులు కూడ అనడం సాధారణంగా వినబడడం అందువల్లనే. ఈ మానసిక వైఖరిని ఎప్పటికప్పుడు సవరించుకోకపోతే ఎంత మతరహితంగా ఆలోచించే వాళ్లయినా మతతత్వంలోకి, అక్కడినుంచి మతోన్మాదంలోకి ప్రయాణించడం చాల సహజంగా జరిగిపోతుంది. ఆ సహజమైన ప్రయాణాన్ని అభివృద్ధి భావజాలం, రాజకీయార్థిక పరిణామాలు మరింత త్వరితం చేస్తాయి. ఆ అర్థంలో చూసినప్పుడు ఇవాళ్టి మతోన్మాదం సంఘ పరివారపు గుత్తసొమ్ము కాదు. సంఘపరివారం ఆ మతోన్మాదాన్ని ప్రత్యక్షంగా ప్రబోధిస్తుండవచ్చు కాని భారత పాలకవర్గాలన్నీ – వామపక్షాలని పేరు పెట్టుకున్న వాటితో సహా – ప్రచ్ఛన్నంగా మతోన్మాదానికి సహకరస్తూనే ఉన్నాయి.

తనను తాను అజ్ఞేయవాదిగా చెప్పుకున్న జవహర్‌లాల్ నెహ్రూ ఒకరకంగా ఈ ప్రచ్ఛన్న మతోన్మాదాన్ని తొలి వ్యక్తీకరణలలో ఒకరు కావచ్చు. ఒకవైపు లౌకిక భావనలు ప్రకటిస్తూనే, మరొకవైపు భారత స్వాతంత్ర్య ప్రకటన వేదపండితులు నిర్ణయించిన హైందవ సుముహూర్తంలో జరగాలని నిర్ణయించినప్పుడైనా, బాబ్రీ మసీదులోపలికి రాముడి విగ్రహం తరలించి ఆ స్థలాన్ని దురాక్రమించినప్పుడు పాటించిన మౌనంలోనైనా, చివరికి తన చితాభస్మాన్ని దేశంలోని 'పుణ్యజలాల్లో' కలపాలని కోరినప్పుడైనా నెహ్రూ మెతక, సాధు రూపంలోనే కావచ్చు గాని హిందూ మతోన్మాదాన్ని ప్రదర్శించాడు. అక్కడి నుంచి ఇవాళ్టి దాకా కాంగ్రెస్ పార్టీ చరిత్ర అంతా సాధు రూపంలో హిందూ మతోన్మాదాన్ని విస్తరించిన చరిత్రే. అందువల్లనే మోడీని సోనియాగాంధీ మృత్యువ్యాపారి అని పిలిస్తే ఆమె పార్టీ కూడా మృత్యు వ్యాపారే కదా అని ప్రజలు అనుకున్నారు. మిగిలిన రాజకీయ పక్షాల అవకాశవాద, దివాళాకోరు రాజకీయాల వల్ల మాటల్లో ఎంత లౌకికత్వం, మతరాహిత్యం కనబరిచినా ఆచరణలో మతోన్మాదామే అమలయింది. నందిగ్రామ్‌లో గత సంవత్సరంగా తమ భూమికోసం పోరాడుతున్న ప్రజలను ముస్లింలుగా, 'ఛాందసులు, తీవ్రవాదులు'గా చూస్తున్న సిపిఎం కూడ పాలకవర్గ భావజాలపు తానులో ముక్కనేనని చూపుకుంటున్నది.

ఇక రెండవ ప్రశ్న దగ్గరికి వస్తే, తప్పనిసరిగా ఏ మతభావన కయినా ఛాందసంగా, ఉన్మాదంగా మారగలిగిన శక్తి ఉంది. అందువల్ల మతభావనలన్నీ మతోన్మాదంగా మారగలవు. కాని, మత భావనలు వాటికవిగా, వ్యక్తిగత విశ్వాసాల రూపంలో ఉన్నప్పుడు, మనుషులు సహజీవనాన్ని, సంఘజీవనాన్ని కోరుకుంటారు గనుక అవి ఘర్షణా మయం, హింసా పూరితం కావు. మతభావనలకు ఆధిపత్య భావనలు, రాజకీయాధికారం, ఆర్థికాధికారం, తప్పుడు భావజాలం తోడయినప్పుడే అవి హింసామయం అవుతాయి, అసహ్యంచుకోదగినవీ, ప్రతిఘటించ వలసినవీ అవుతాయి. ఆ అర్థంలో భారత సమాజంలో హిందూ మతోన్మాదానికి మాత్రమే అటువంటి ఆధిపత్య అవకాశాలున్నాయి. బహుశా గల్ఫ్ దేశాలలో, పాకిస్తాన్‌లో, బంగ్లాదేశ్‌లో ఇస్లాంకు, అమెరికాలో క్రైస్తవానికి, ఇజ్రాయిల్‌లో జియోనిజానికి ఆ అవకాశం ఉండవచ్చు. కాని అటువంటి ఆధిపత్య అవకాశాలు లేని, మైనారిటీ మతంగా ఉన్నచోట ఆ మతస్తులు ఛాందసం కనబరచినా, హింసకు కూడ పాల్పడినా అది మెజారిటీ మతోన్మాదపు హింసకు వ్యతిరేకంగా తమను తాము రక్షించుకోవడానికి, సమీకృతం కావడానికి మాత్రమే గాని, ఆధిపత్యం కోసం కాదు. ◆

*చేనేత రంగాన్ని అభివృద్ధి చేయాలంటే చేనేత కార్మిక సంక్షేమమే కేంద్రంగా దేశీయ మార్కెట్‌ను అభివృద్ధి చేయాలనీ, పరిశోధనలు జరగాలనీ ఆ దిశగా విధానాలు రూపొందాలనీ అంటున్నారు* **పులుగుజ్జు సురేష్**

# ఎత్తివేసే దిశగా చేనేత రిజర్వేషన్ చట్టాలు

చైనా నుండి దిగుమతియైన సాక్సులతో అమెరికా సాక్సుల పరిశ్రమ పోటీ పడలేక కుప్పకూలిపోవడం వలన పదివేల మంది ఉపాధికి తీరని నష్టం ఏర్పడింది. చైనా దాడికి తట్టుకోలేని అమెరికా జౌళి పరిశ్రమకు తీరని నష్టం ఏర్పడడం వలన అమెరికా జౌళిపరిశ్రమ తీవ్రమైన ఆందోళనకు గురయి, పదివేల మందిని రక్షించుకోవడానికి సాక్సుల తయారీ, దిగుమతులను అడ్డుకోవడానికి నిబంధనలు తీసుకురావాలని సంకల్పించింది. ఈ పరిశ్రమను ఆదుకోవడానికి అనేక రాయితీలు ప్రకటించి, కట్టుదిట్టమైన చర్యలు తీసుకోవడానికి సిద్ధపడింది. అభివృద్ధి చెందిన పాశ్చాత్యదేశాలలో వారి ప్రజల ప్రయోజనాలకు ఏమాత్రం నష్టం జరిగినా వారు ఊరుకోవడానికి ఇదొక్కటి మాత్రమే ఉదాహరణ కాదు. బ్రిటిష్ వలసపాలన కింద ఉన్నప్పుడు 18, 19 శతాబ్దాలలో భారత చేనేత రంగంలో తయారయిన ఆంధ్రదేశపు నాణ్యమైన వస్త్రాలు పర్షియా, ఫ్రెంచ్, డచ్, నైజీరియాలతోపాటు అమెరికా సంయుక్త రాష్ట్రాలు బ్రిటిష్ దేశాలకు విస్తారంగా ఎగుమతి చేయబడేవి. భారతదేశం నుండి ముఖ్యంగా ఆంధ్రరాష్ట్రం నుండి ఎగుమతయ్యే వస్త్రాలకు ప్రపంచ దేశాలలో విపరీతమైన డిమాండ్ ఉండేది. భారత చేనేత వస్త్రాలను వీథుల్లో ఎగబడికొనేవారు. కొందరయితే ముందుగానే బయానా ఇచ్చి వేచి ఉండేవారు. చేనేత వస్త్రాలతో పోటీపడలేక మాంచెస్టర్ సంక్షోభంలో పడింది. మాంచెస్టర్ మిల్లురంగాన్ని కాపాడటానికి చేనేత ఆనాటి ప్రభుత్వం భారత చేనేత పరిశ్రమను దెబ్బతీయడానికి అనేక పద్ధతులనుసరించింది. వాటిలో చెప్పుకోదగినవవి, వర్తకులపై ఆంక్షలు విధించింది, వర్తకులకు ఇచ్చే బయానాలను బ్రిటిష్ ఉద్యోగులు తీసుకునేవారు. అవి కార్మికులకు చేరకుండా చేసి, చేనేతలు సరిగా పనిచేయరని డబ్బు తీసుకొని మోసం చేస్తారనే అసత్య ప్రచారం చేసేవారు. గ్రామాలకు నూలు అందుకుండా చేసేవారు. ఉత్పత్తి పన్ను, ఎగుమతి సుంకం విధించడంతోపాటు మిల్లులలో తయారు చేసిన వస్త్రాలను వీథుల్లో కుప్పలుపోసి అమ్మడం వలన మన చేనేత పరిశ్రమకు కోలుకోలేని దెబ్బ తగిలింది. అయినా కూడా ఇది మానవశ్రమ ఆధార పరిశ్రమ కావడం వలన, నైపుణ్యంతో కూడిన పరిశ్రమకావడం వలన నేటికీ తమ ఉనికిని కాపాడుకుంటూ 1.24 కోట్ల గ్రామీణ, పట్టణ పేదలకు జీవనాధారంగా నిలబడింది. పాశ్చాత్యదేశాలలో తీసుకుంటున్న చర్యల గురించి, ఎప్పుడో వందేండ్ల క్రితం జరిగిన సంఘటనలు జ్ఞాపకం చేసుకుంటూ సమకాలీన కాలంలో కోటాపద్ధతి రద్దయిన తరువాత ప్రపంచమే ఒక కుగ్రామంగా మారిన ఈ రోజుల్లో సాక్సుల పరిశ్రమ కోసం ఆందోళన చెందుతున్న అమెరికా నుంచి నేర్చుకోవలసిన పాఠాలు ఉన్నాయి కాబట్టి, అత్యంత తగ్గరగా పరిశీలించుకొని, చేనేత రంగాన్ని కాపాడుకోవాల్సిన బాధ్యత ప్రభుత్వాల మీద ఉంది.

ప్రపంచ దేశాలలో ఎక్కడా లేనన్ని చేనేత మగ్గాలు మనదేశంలో (389 లక్షలు) ఉన్నాయి. మగ్గాల సంఖ్యలో భారత అగ్రభాగాన నిలిచింది. వస్త్రోత్పత్తిలో రెండవస్థానం, పత్తిపంటలో మూడవ స్థానంలో ఉంది. 3.3 కోట్ల మందికి ఉపాధి కల్పిస్తున్న జౌళిరంగంలో 1.24 కోట్ల మందికి 30 శాతం మందికి చేనేత రంగం ఉపాధి కల్పిస్తోంది. పర్యావరణానికి ఏమాత్రం విఘాతం కలగకుండా, కాలుష్యరహితమైన చేనేత 11వ ప్రణాళిక ప్రతిపాదనలలో పొందుపరచిన కొన్ని అంశాలు ఈ రంగం ఉనికిని దెబ్బతీసే విధంగా కనబడుతున్నాయి.

భారత జౌళిరంగాన్ని ఆధునీకరించాలని 1985 అధికారంలో ఉన్న రాజీవ్ గాంధీ ప్రభుత్వం నూతన జాతీయ జౌళి విధానాన్ని ప్రవేశ పెట్టింది. మిల్లు పవర్‌లూంల సంఖ్య పెరిగి చేనేత రంగానికి నష్టం జరిగే అవకాశం ఉన్నందున సామాజిక సంస్కృతిక కోణం నుంచి చేనేత రంగాన్ని కాపాడుకోవడానికి 22 రకాలు కేటాయించబడ్డాయి. ఈ రకాలను తూర్పు, ఉత్తర రాష్ట్రాలలో ఉన్న దళితులు, గిరిజనులు నేసే తువ్వాలు, గావంచా, మఫ్లర్‌లు, చద్దర్‌లు, దోరియాలు, దర్రీలు దక్షిణ భారతదేశంలో నేసే సంప్రదయా వస్త్రాలైన చీరలు, ధోవతులు, లుంగీలు, డ్రెస్ మెటీరియళ్లు ఉన్నాయి. ఈ రకాలు చేనేత రంగంలో మాత్రమే ఉత్పత్తి చేయాలి. ఏ ఇతర రంగాలలో చేయరాదు. ఇతర రంగాలలో చేయకుండా చూడటానికి 1985లోనే ఎన్‌ఫోర్స్‌మెంట్ విభాగం ఒకటి కేంద్ర ప్రభుత్వం ఆధ్వర్యంలో ఏర్పడింది. 18 వేల కంటే ఎక్కువ పవర్‌లూంలు ఉన్నచోట ఎన్‌ఫోర్స్‌మెంట్ కార్యాలయాల ఏర్పాటు చేసింది. రాష్ట్రంలో నాలుగు కార్యాలయాలు ఉన్నాయి. ఈ ఎన్‌ఫోర్స్‌మెంట్ విభాగం పనితీరు ఎంత తక్కువ చెప్పుకుంటే అంత మంచిది. ప్రతి సంవత్సరం లక్షల కొద్ది పవర్‌లూంలు తనఖీ చేసినట్టు 30–50 పవర్‌లూంలు రిజర్వేషన్ చట్టాన్ని ఉల్లంఘిస్తున్నట్టు గుర్తించి 10–15 పవర్‌లూంలపైన కేసులు నమోదు చేస్తున్నారు. వీరిపైన శిక్షలు పడుతున్నవి మచ్చుకు ఒక్కటైనా కనిపించడం లేదు. పవర్‌లూంలు చేనేత రిజర్వేషన్ చట్టాన్ని ఉల్లంఘిస్తున్నట్టు ప్రభుత్వం అంగీకరించింది. జౌళి మంత్రిత్వశాఖ ఆధ్వర్యంలో ఈ చట్టాన్ని పటిష్టంగా అమలు చేయడానికి

సలహా బోర్డు కేంద్రం ఏర్పాటు చేసింది. ఈ బోర్డులో ఒకరిద్దరు మినహాయించితే మిగిలిన వారందరూ పవర్‌లూం, మిల్లు రంగాలవారే ఉన్నారు. 2006-07 ఆర్థిక సంవత్సరంలో రెండు గంటల కాలవ్యవధిలో సమావేశం ఒకటి జరిగింది. ఈ సమావేశంలో చేనేతకు కేటాయింపులను ఏ విధంగా పరిరక్షించుకోవాలనే అంశాన్ని పక్కకునెట్టి, రిజర్వేషన్ చట్టం జౌళి రంగానికి పెద్ద అడ్డంకిగా ఉంది. ఇప్పటికే టవళ్లను మూడు లక్షల పవర్‌లూంలపై నేయడం జరుగుతున్నది. కావున ఈ చట్టాన్ని ఎత్తివేయాలనే ప్రతిపాదన ముందుకు వచ్చింది. చట్టాన్ని ఉల్లంఘించిన విషయం బహిరంగంగా ఒప్పుకున్నారు. ఈ సమావేశంలో ఎన్‌ఫోర్స్‌మెంట్ అధికారులు కూడా ఉన్నారు. ఉల్లంఘించిన వారిపై చర్యలు తీసుకోలేదు. ఈ విధంగా కంచె చేను మేసినట్టుగా సలహా బోర్డు పరిస్థితి ఉంది.

1985లో కేటాయించిన 22 రకాలు ఒక్క కలంపోటుతో 1996లో 11 రకాలుకు కుదించికుపోయాయి. ఎన్.కె. సింగ్ అధ్యక్షతన రూపొందిన 11వ ప్రణాళిక ప్రతిపాదనలో రిజర్వేషన్ చట్టానికి ఉన్న అన్ని గేట్లను ఎత్తేసారు. చేనేత రిజర్వేషన్ చట్టాన్ని కొనసాగిస్తామని చెబుతూనే, ఎగుమతి చేసే పవర్‌లూంలు, మిల్లులను మినహాయించాలని ప్రతిపాదించడం జరిగింది. ఈ ప్రతిపాదన చాలా విమర్శలకు తావిస్తున్నది. భారత దేశంలో ఉన్న ఇతర చట్టాలకు ఏమాత్రం తీసిపోనంతగా ఉన్నది. స్పష్టమైన 11 రకాల కేటాయింపులతో ఉన్న చట్టం అమలుగాక ఇబ్బంది పడుతుంటే ఈ ప్రతిపాదన మరిన్ని తలనొప్పులు తీసుకురాబోతున్నది. ఉత్పత్తి చేయరాదనే నిబంధన ఉన్నప్పుడే పవర్‌లూంలు బహిరంగంగా ఉత్పత్తి చేస్తున్నాయి. ఎగుమతుల కొరకు రకాలను మిల్లు పవర్‌లూంలపై ఉత్పత్తి చేయడానికి మినహాయించి అనుమతినిస్తే ఈ చట్టం పూర్తిగా పనికి రానట్టు అవుతోంది. సంవత్సరంలో ఏర్పడిన జాతీయ జౌళి విధానం 2000లో ప్రతిపాదించిన టెక్స్‌టైల్ పార్కుల విధానంలో ఎగుమతుల కొరకే టెక్స్‌టైల్ అపెరల్ పార్కులు ఏర్పాటు చేస్తున్నట్టు ప్రభుత్వం ప్రకటించింది. హైదరాబాద్‌కు సమీపంలో ఉన్న గుండ్లపోచంపల్లిలో ఏర్పాటు చేసిన అపెరల్ పార్కులో ఉత్పత్తయిన వస్త్రాలు కేవలం 10-15 శాతం మాత్రమే ఎగుమతి జరుగుతున్నాయి. 85 శాతం వస్త్రాలు దేశీయ మార్కెట్‌లోనే అమ్ముడవుతున్నాయి.

ఈ ఒక్క అనుభవమే ప్రభుత్వం దురాలోచనను బహిరంగం చేస్తున్నది. అందువల్ల ఎగుమతి చేసేందుకు రిజర్వేషన్ రకాలను పవర్‌లూంలు, మిల్లులకు మినహాయించడమంటే పూర్తి రిజర్వేషన్ చట్టాన్ని ఎత్తివేయడమే అవుతుంది.

చేనేత రిజర్వేషన్ చట్టం ఏర్పడిన రోజు నుండి ఈ చట్టంపై చర్చ జరుగుతోంది. చట్టాన్ని ఎత్తివేసే క్రమంలోనే అనేక సవరణలు చేయడం, బడ్జెట్ తగ్గించడం, ఖర్చు చేయకపోవడం సమర్థవంతమైన సిబ్బందిని నియమించకుండా కాలయాపన చేయడం జరుగుతోంది. అందులో భాగంగానే ఈ ప్రతిపాదన బయల్పడింది. రిజర్వేషన్ చట్టం అమలయితే చేనేత రంగం ఎదుర్కొంటున్న సమస్యలలో యాభై శాతం పరిష్కారమవుతాయని అనేక సందర్భాలలో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు తెలపడం జరిగింది. 2005లో ఆంధ్రప్రదేశ్ నుండి వెళ్లిన ఒక ప్రతినిధి బృందం ప్రధాన మంత్రి మన్మోహన్ సింగ్‌ను కలిసి వివరించడం కూడా జరిగింది. అయినప్పటికీ ఈ చట్టం అమలుకు నోచుకోవడం లేదు. రిజర్వేషన్ ఉల్లంఘన సమస్య ఆంధ్రప్రదేశ్‌ది మాత్రమే కాదు, భారతదేశంలో ఉన్న 20 రాష్ట్రాలలో ఈ సమస్య ఉన్నట్టు కేంద్ర ప్రభుత్వం క్లస్టర్ అభివృద్ధి పథకం ఆధ్వర్యంలో రూపొందించిన డయాగ్నొస్టిక్ స్టడీ నివేదికలో తెలిపారు. చేనేత రకాలు పవర్‌లూంలపై నేయడం చేనేత పేరుతో మార్కెట్ చేయడం వలన ప్రతి కుటుంబానికి కనీసం 1000 నుండి 3000 రూపాయల వరకు నెల ఆదాయం తగ్గింది. ఈ పరిస్థితి ఆర్థిక మంత్రి కొణిజేటి రోశయ్యగారు ప్రాతినిధ్యం వహిస్తున్న చీరాలలో కళ్లకు కట్టినట్టు కనిపిస్తుంది. ధర్మవరం, గద్వాల్, చీరాలలో నేసే రకాలు కర్నాటక బోర్డర్, తమిళనాడు రాష్ట్రాలలో ఉత్పత్తి చేసి తక్కువ ధరకు చేనేత పేరుతో మార్కెట్ చేస్తున్నారు. వీటి ఫలితమే పేరొందిన ప్రధాన వస్త్ర వ్యాపార కేంద్రాల వారు ఒక చీర కొనండి రెండు చీరలు తీసుకోండి అని, రెండువేల రూపాయల గద్వాల్ చీర వెయ్యి రూపాయలకే స్వంతం చేసుకోండని ప్రకటనల వర్షం కురిపిస్తున్నారు.

ఇది ఏ విధంగా సాధ్యమవుతుందో ఆయా కంపెనీల యజమానులకే తెలుసు. ఎప్పుడైనా దేశంలో ఒక కిలో బియ్యం కొనండి రెండు కిలోలు పట్టుకెళ్లండి అనే ప్రకటనలు వెలువడ్డాయా అంటే అది ఇంతవరకు జరగలేదు. మానవశ్రమతో జరిగే ఉత్పత్తిలో ఒకటి ప్లస్ ఒకటి ఇవ్వడం అసాధ్యం. కావున ఉచితం అనే ప్రకటనలు రావడమంటే పెద్ద యంత్రాలపైన తయారయినట్టు సామాన్యులకు సైతం అర్థమవుతుంది. ప్రభుత్వానికి ఇవన్నీ కనిపించడం లేదా? లేక తెలియదా అంటే అన్ని తెలుసు మరి ఎందుకు అమలు చెయ్యదు అంటే ఇక్కడి ప్రభుత్వాలలో కీలక పదవులలో ఉండి, చేనేత నాయకులుగా చలామణి అవుతున్న వారిలో అధికులు పవర్‌లూం యజమానులు. చేనేత నాయకులుగా ఉండి ఆ ముసుగులో పవర్‌లూం వస్త్రాలను చేనేత వస్త్రాలుగా చలామణి చేయడం వీరికి వెన్నతో పెట్టిన విద్య. వేదికపైన చేనేత, వేదిక దిగగానే పవర్‌లూం మంత్రం వీరిది. ఈ ఘనమైన నాయకులకు చేనేత సహకార సంఘాలు ఉన్నాయి. ఆప్కో డైరెక్టరుగాను, మాస్టర్‌వీవర్లుగా, ప్రజా ప్రతినిధులుగాను, చేనేత పితామహులుగాను వెలగొందుతూ, అనేక కీలక పదవుల్లో కూడా కొనసాగుతున్నారు. అందువల్ల ఈ అంశంపై బలమైన పోరాటం చేయడానికి పెదవి విరుస్తారు. ఆ ఒక్కటి తప్ప ఏమయినా చెప్పండి అంటారు. అదే మాట ముఖ్యమంత్రి నోట వినబడుతుంది. రిజర్వేషన్ చట్టాన్ని పటిష్ఠంగా అమలు చేయాలని ఆయన నోట వచ్చేది ఒకటే వారు మీవారే కదా, అంటే మీది తెనాలి, మాది తెనాలి అన్నట్టుగా ఉంది. చేనేత చట్టాన్ని ఉల్లఘించేది ఎవరో బయటివారు కాదు అదే సామాజిక కులానికి చెందిన వారు కావడం వలన పోరాటాలన్ని ప్రభుత్వం మీదే ఉంటాయి. కానీ మన ఇంటి పక్కనే జరుగుతున్న పవర్‌లూం ఉత్పత్తులను ఆపడానికి సాహసించరు. వారు కూడా వీళ్ల రక్తానికి సంబంధించిన వారే కావడం ఒక కారణం కావచ్చు. కానీ అంతకంటే బలమైన కారణం ఈ చట్టం అమలు చెయ్యాలని ఉద్యమించే పేద చేనేత కార్మికులపై కొరడా ఝుళిపించి, జైళ్లల్లో పెట్టిన సందర్భాలు లెక్కలేనన్ని ఉన్నాయి. ఇంతేకాదు, చేనేత కోసం నియమించిన అన్ని రకాల కమిటీలలో చేనేత కంటే

పవర్‌లూం ప్రయోజనాలకే ఎక్కువగా విధానాలు రూపొందడం జరుగుతున్నది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆర్థికమంత్రి కొణిజేటి రోశయ్య అధ్యక్షతన నియమించిన నిపుణుల కమిటీ నివేదిక 2005 ఆగస్టులో వెలువడింది. ఈ నివేదికలో పవర్‌లూం ఉత్పత్తులకు ఆప్కో మార్కెట్ కల్పించాలని నొక్కి చెప్పింది. అది ఆప్కో నియమ నిబంధనలకూ విరుద్ధం. ఒకే బోనులో సాధు జంతువును క్రూర మృగాన్ని ఉంచవద్దని చేనేత నిపుణులు చెప్పడం జరుగుతోంది. ఈ కమిటీ కూడా సాధువుల పక్షం కంటే మృగాల పక్షమే అధికంగా ఉంది. కనుకనే చేనేతకు ప్రత్యేక మంత్రిత్వశాఖ కావలనే నినాదానికి నడుములు విరిగినా మళ్లీ నిలబడాల్సిన అవసరం ఆసన్నమయింది. ఎందుకంటే అఖిల భారత చేనేత బోర్డులో చేనేతకు స్థానం లేదు. చేనేత నిధులతో టెక్స్‌టైల్ కమిటీ నిర్వహిస్తున్న వివిధ రకాల సమావేశాలలో చేనేత ప్రతినిధులు ఉండడం లేదు. చేనేత ప్రోత్సాహక మండలి (ఎన్.హెచ్.డి.సి.) ఆధ్వర్యంలో ఎగుమతి జరుగుతున్న వస్త్రాలలో పది శాతం కూడా చేనేత వస్త్రాలు ఉండడంలేదు. చిలపలనూలు అబ్లిగేషన్ యాక్ట్ నిర్జీవం చేయబడింది. భవిష్యత్తులో చిలపలనూలు దొరుకుతుందో లేదో కచ్చితంగా చెప్పలేని పరిస్థితి ఉంది. పవర్‌లూం రంగం ఆధునీకరణకు లక్ష కోట్ల రూపాయల ఖర్చు చేయడానికి సిద్ధమైన ప్రభుత్వాలు చేనేతకు పది కోట్ల రూపాయలు కేటాయించలేక పోతున్నాయి. చేనేత పరిశోధన కేంద్రాలు నెలకొల్పి, చేనేత విధానాన్ని రూపొందించి శాస్త్రీయమైన అభివృద్ధి జరగాలనే డిమాండ్ ఉంది. ఇవన్నీ బుట్టదాఖలవుతున్నాయి. కానీ పవర్‌లూం రంగాల సాంకేతికాభివృద్ధి కొరకు ఇరవై అయిదు వేల కోట్లు కేటాయించడానికి ప్రభుత్వం దగ్గర పుష్కలంగా నిధులున్నాయి. మౌలిక వసతుల కల్పనలో చేనేత సంక్షోభానికి పరిష్కారం దొరుకుతుంది. దీనిని పక్కకునెట్టి చేనేత ఎగుమతుల ద్వారా అన్ని సమస్యలు పరిష్కారమ వుతాయని క్లస్టర్ అభివృద్ధి పథకాన్ని కేంద్రం ప్రవేశపెట్టింది. ఎగుమతి చేస్తున్న వస్త్రాలు ఏ రంగానికి చెందినవో తెలుపలేని స్థితిలో ఉంటే ఇదెలా సాధ్యమవుతుంది. కేరళ ఎగుమతి లక్ష్యంగా అమలయిన క్లస్టర్ పథకం నేల విడిచి సాము చేసింది. విస్తారమైన సంప్రదాయ మార్కెట్‌ను అశ్రద్ధచేసి, ఎగుమతి రకాలను తయారు చేసిన కేరళ చేనేత రంగానికి ఎగుమతి చెస్తున్న సమయంలో తమిళనాడులోని పవర్‌లూంలు కేరళ చేనేత సంప్రదాయ మార్కెట్‌ను ఆక్రమించాయి. ఇప్పుడు కేరళలో యాభై శాతం చేనేత మగ్గాలు ఆగిపోయాయి. ఎగుమతి చేయలేక, స్థానిక మార్కెట్‌లో నిలబడలేక ఉనికికే ప్రమాదం ఏర్పడింది. ఎగుమతి మార్కెట్‌లో ఏ రంగానికి కూడా సరియైన, నిర్ధిష్టమైన మార్కెట్ లేదు. ఎగుమతులలో చైనా అగ్రస్థానంలో నిలబడింది. ఈ మధ్య పెరిగిన రూపాయి విలువకు భారత జౌళి పరిశ్రమ వెన్నెముక విరిగింది. అపెరల్, టెక్స్‌టైల్ పరిశ్రమలు 7000 వరకు మూతపడుతున్నాయి. నెల్లూరు జిల్లా వెంకటగిరి సమీపంలో 700 ఎకరాలలో దక్షిణ భారత మిల్స్ అసోసియేషన్ ఆధ్వర్యంలో ఏర్పాటు చేయడానికి తలపెట్టిన అతి పెద్ద టెక్స్‌టైల్ పార్కు తన ప్రతిపాదనను విరమించుకుంటున్నట్టు ప్రకటించింది. ఈ నేపథ్యంలో ఎగుమతి మార్కెట్ కూడా లాభదాయకం కాదని, నాటి నుండి వస్తున్న అనుభవాల సారాంశం.

కావున ప్రభుత్వం ఒంటెద్దు పోకడలా వ్యవహరించకుండా ప్రపంచ పరిణామాలను విశ్లేషించుకోవాలి. భారత దేశంలో మధ్య తరగతి ప్రజల సంఖ్య పెరుగుతోంది. ప్రపంచ దేశాలకు భారత్ అతి పెద్ద మార్కెట్ కేంద్రంగా ఉంది. కావున చేనేత రంగం అభివృద్ధి చేయాలంటే దేశీయ మార్కెట్‌ను అభివృద్ధి చేసుకోవాలి. ఆ విధమైన పరిశోధనలు చేయాలి. విధానాలు రూపొందించాలి. ముందుగా చర్చించినట్టు అమెరికా, బ్రిటన్ దేశాలు వారి ప్రయోజనాలకు ఇబ్బంది జరగకుండా ఎటువంటి నిబంధనలు చేస్తున్నారో అసంఖ్యాకంగా చేనేత పై ఆధారపడి బతుకుతున్న ప్రజల అభివృద్ధికి తగిన విధంగా రూపొందాలి. ◆

తొంభైయవ దశాబ్దంలో వ్యవసాయంపై ఆధారపడిన శ్రామికుల్లో పదకొండు శాతంపైగా వైదొలగడం వ్యవసాయ సంక్షోభానికి ఒక సూచిక కాగా, ఆత్మహత్యలు సంక్షోభ నివారణ జరగక పోవడానికి సూచికగా పేర్కొంటున్నారు **ఎస్. గాలిబ్, ఇ. రేవతి**

# రైతుల ఆత్మహత్యలు - ఒక సమీక్ష

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం వ్యవసాయంలో ముఖ్యంగా ఆహారపంటల్లో ముందంజలో వున్న రాష్ట్రం. గత దశాబ్దంగా గ్రామీణ దుస్థితి, వ్యవసాయ సంక్షోభం పట్టి పీడిస్తున్న సమస్యలుగా నిలిచిపోయాయి. సంక్షోభ సంకేతాలను ప్రధానంగా రైతుల ఆత్మహత్యలు, ఆకలి చావులు, శరీరభాగాల (కిడ్నిల) అమ్మకాలు రూపంతో ప్రత్యక్షంగానే 90 ల మధ్య నుండి కనబడుతున్నది. ఇటీవలి కాలంలో రైతుల ఆత్మహత్యలు కొంత తగ్గుముఖం పట్టినా ఇంకా అక్కడక్కడా నమోదవుతూనే వున్నాయి. ప్రత్యక్ష రూపంలో అంత ఉధృతంగా కనబడకపోయినా వ్యవసాయ రంగంలో సంక్షోభం సమసిపోయిందని చెప్పడానికి వీలులేదు. తగ్గిపోతున్న వ్యవసాయరంగ వృద్ధిరేటు, పెరిగిపోయిన రుణగ్రస్తత రూపంలో సంక్షోభం ఇంకా మిగిలేవుంది. వ్యవసాయ రంగ విధానం సంక్షోభానికి, దాని తొలగింపుకు ఎంత వరకు కారణమయ్యింది? ఆత్మహత్యల సమీప కారణాలుగా ప్రకృతి వైపరీత్యాలు చీడపీడలు,కల్తీలు, కుటుంబ గొడవలు, అప్పులవాళ్ల వత్తిళ్లు వంటి అంశాలను చెపుతున్నా వీటన్నింటికి అంతర్గతంగా వున్న సంక్షోభం నుండి వేరుచేసి చూడలేము. 2004 తర్వాత సంక్షోభ నివారణ ప్రధాన అజెండాగా మారిన పరిస్థితుల్లో అందుకు జరిగిన ప్రయత్నాలు, వాటి ఫలితాలను సమీక్ష చేసుకోవలసి వుంటుంది. ఈ వ్యాసం ఆ ప్రయత్నం చేస్తుంది.

వ్యవసాయ సంక్షోభంపై జరిగిన అధ్యయనాలు సంక్షోభ కారకాలను ప్రధానంగా నాలుగుస్థాయిలలో విశ్లేషిస్తాయి. మొదటిది అంతర్జాతీయ విధానాలు (సరళీకృత వాణిజ్య విధానం), రెండు కుదించుకుపోయిన రాజ్య (దేశీయ) విధానాలు, (ద్రవ్య విధానాలు, పరిశోధన, విస్తరణ విధానాలు), మూడు వ్యవసాయ రంగంలో చిన్నా, సన్నకారు, రైతుల దిశగా ఏర్పడిన నిర్మాణపరమైన మార్పులు , (భూయాజమాన్యంలోని మార్పులు నికరసాగు భూమిలో తగ్గుదల, బీడుభూమి పెరుగుదల ఆహారేతర పంటల దిశగా మారిన పంటల తీరు, నీటిపారుదల వనరులలో వచ్చిన మార్పు మొదలయినవి). నాలగవది గృహ స్థాయిలో వచ్చిన మార్పులు (ఉమ్మడి కుటుంబాల నుండి చిన్న కుటుంబాలుగా ఏర్పడటం, విద్య, ఆరోగ్యంపై పెరిగిన వ్యయం, ఆర్థికంగా సామాజికంగా పైకెదగాలన్న వాంఛ). కొన్ని అధ్యయనాలు రైతుల ఆత్మహత్యలను కేవలం వ్యక్తిగత, మానసిక అంశాలే కారణాలుగా చూపిస్తే, మరికొన్ని రాజ్య విధానాలను ప్రధాన కారణాలుగా చూపిస్తాయి. కారణాంశాల విశ్లేషణ తప్పకుండా పరిష్కారాలను కూడా సూచిస్తాయి కాబట్టి ఒకవైపు మానసిక, సామాజిక కౌన్సిలింగ్ వంటి వైయక్తిక పరిష్కారాలు ముందుకు రాగా మరోవైపున ప్రభుత్వ విధానాలే సంక్షోభానికి ప్రధానకారణాలు కావడంవలన వాటి మార్పు దిశగా పరిష్కారం కనబడుతున్నది. వ్యవసాయరంగంలో విధానాన్ని సూచించే అంశాలు మొదటిది వ్యవసాయరంగంపై ప్రభుత్వం పెట్టే ఖర్చు, రెండవది పరిశోధన-అభివృద్ధిపై వెచ్చించే పబ్లిక్ వ్యయం. ఇది ప్రభుత్వం చేయొచ్చు. ప్రైవేట్ సంస్థలు కూడా చేయొచ్చు. పై రెండు అంశాలుకూడా కొన్ని సంవత్సరాలుగా తగ్గుముఖం పట్టాయి.

వ్యవసాయ రంగంలో రుణగ్రస్తత పై 2007 లో ప్రభుత్వానికి సమర్పించిన రాధాకృష్ణ కమిటీ నివేదిక ప్రకారం దేశం మొత్తంగా వ్యవసాయికంగా వెనకబడిన జిల్లాలు 100 వరకు గుర్తించారు. మూడు సంవత్సరాల సగటు ఉత్పాదకత, 2006 సంవత్సరానికి 60 శాతం కన్నా తక్కువగానున్న రుణ - ఆదా నిష్పత్తి, 2001 సెన్సెస్ ప్రకారం 30 శాతం కన్నా తక్కువగా ఉన్న పట్టణ జనాభ అనే మూడు సూచికల ఆధారంగా వ్యవసాయిక వెనకబాటును గుర్తించారు. ప్రధానమంత్రి ఆత్మహత్యల రిలీఫ్ ప్యాకేజిని దేశవ్యాప్తంగా సంక్షోభం అధికంగా ఉన్న 31 జిల్లాలకు ప్రకటించారు. ఇందులో 16 జిల్లాలు మన రాష్ట్రానికి చెందినవే. వ్యవసాయికంగా వెనకబడిన జిల్లాలు ఉన్న రాష్ట్రాలు ఉత్తరప్రదేశ్, ఉత్తరాంచల్, రాజస్థాన్, ఒరిస్సా, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, కేరళ, కర్ణాటక, జార్ఖండ్, జమ్ము-కాశ్మీర్, చత్తీస్‌గడ్, బీహార్, ఆంధ్రప్రదేశ్‌లు. ఇందులో ఆత్మహత్యలు కేంద్రీకృతమయిన రాష్ట్రాలు మహారాష్ట్ర, కేరళ, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్, ఇవికాక వ్యవసాయికంగా బాగా వృద్ధి చెందిన పంజాబ్‌లో కూడా రైతుల ఆత్మహత్యలు ఎక్కువగానే ఉన్నాయి. పైన పేర్కొన్న అన్ని రాష్ట్రాలను ఆర్థిక వృద్ధిపరంగా అధిక వృద్ధి, మాధ్యమిక వృద్ధి, అతి తక్కువ వృద్ధిగల రాష్ట్రాలుగా విభజించవచ్చు. కేరళ, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్‌లు వృద్ధిలో మాధ్యమంగా ఉంటే, మహారాష్ట్ర, పంజాబ్‌లు అధికవృద్ధి రాష్ట్రాలుగా, ఒరిస్సా, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, జార్ఖండ్, చత్తీస్‌గడ్, బీహార్ వంటివి కనిష్ట వృద్ధిరేటు ఉన్న రాష్ట్రాలుగా చెప్పవచ్చు. అయితే బాగా వెనకబడిన రాష్ట్రాల్లో రైతు ఆత్మహత్యలు ఎందుకు లేవనే ప్రశ్న తలెత్తుతుంది. ఇందుకు రెండు కారణాలను గుర్తించవచ్చు.

1. బాగా తక్కువ అభివృద్ధివున్న పరిస్థితిలో ఆర్థిక చలనానికి ప్రోత్సాహకంగానీ, చొరవగానీ ఉండవు.

2. అభివృద్ధి ఎక్కువగా ఉన్న రాష్ట్రాల్లో అంతర్గతంగా గణనీయమైన అభివృద్ధి వ్యత్యాసాలు ఉన్నాయి.

రెండవ కారణానికి ఉదాహరణగా కర్ణాటకలోని ఉత్తర ప్రాంతం మహారాష్ట్రలోని విదర్భ, ఆంధ్రప్రదేశ్‌లోని తెలంగాణ, రాయలసీమలను చెప్పవచ్చు. వ్యవసాయికంగా వెనకబడిన ఈ ప్రాంతాలు మొదటిదశ హరిత విప్లవానికి ఆవలిగా ఉన్న ప్రాంతాలే. ఆధారిత ప్రభుత్వ నీటి వనరులు ఎక్కువగా లేని ప్రాంతాలే. అభివృద్ధి చెందిన ప్రాంతాల్లోని రైతుల సరసన చేరాలని ప్రయత్నాలు చేసి, తమ చొరవకు తగిన ఫలితం దక్కనివారే రాష్ట్రాలమధ్య, రాష్ట్రాల్లో కూడా ప్రాంతీయంగా సమ్మిళిత అభివృద్ధి జరగలేదనే వాస్తవం యాభై సంవత్సరాల మన అభివృద్ధి చరిత్ర చెపుతున్నది.

గత కొన్ని సంవత్సరాలుగా వ్యవసాయరంగంలో నిర్మాణపరంగా మార్పులు చోటుచేసుకున్నాయి. కమతాల సైజు చిన్నదిగా మారడం. చిన్న కమతల కింద దాదాపు 40 శాతం సాగుభూమి ఉండడం. నీటిపారుదల ఉన్న ప్రాంతాల్లో కౌలుదారీ విధానం ప్రబలంగా మారడం, ఆహారేతర వాణిజ్య పంటల దిశగా పంటల తీరు మారడం, వర్షాధార ప్రాంతాల్లో భూగర్భ జలాల ఆధారంగా వాణిజ్య పంటలను పండించడం కొన్ని ముఖ్యమార్పులుగా చెప్పుకోవచ్చు. సంప్రదాయికంగా వ్యవసాయం చేసే వర్గాలు కులాలతో పాటుగా అట్టడుగు కులాల, వర్గాల వారు కూడా వ్యవసాయంలోకి అడుగుపెట్టారు. తక్కువ వనరులతో ఎక్కువ రిస్కును, లేక అనిశ్చితికి లోనయ్యే పంటలసాగు వైపుకు వెళ్లారు. మరోవైపున ప్రభుత్వ విధానాల ప్రతికూలత వల్ల ప్రభుత్వ మద్దతు లభించలేదు. ఉదారవాద విధానాల అమలులో భాగంగా ప్రభుత్వ రంగం ఇంకా కుంచించుకుపోయింది. వాణిజ్య సరళీకరణ ప్రపంచ మార్కెట్లలోని అనిశ్చితిని దేశీయ మార్కెట్లలోకి తీసుకువచ్చింది. దేశం మొత్తానికి విధానాలు ఒక్కటే అయినా వాటి తీవ్రత వాస్తవంగా ఉన్నా అభివృద్ధి వ్యత్యాసాల ననుసరించి భిన్నరకాలుగా ఉంటుంది.

ఉదారవాద విధానాల అమలులో ఆంధ్రప్రదేశ్ మొదటి వరుసలోనే ఉన్నది. వ్యవసారంగానికి సంబంధించిన ఉదారవాద విధానాలకు సామాజిక, రాజకీయ, ఆర్థిక పర్యవసానాలు ఉన్నాయి. ప్రభుత్వ విధానాలు వ్యవసాయ సంక్షోభానికి కారణమయిన తీరును ఒక్కొక్కటిగా చూడవచ్చు.

## వ్యవసాయ రంగంలో అభివృద్ధి

1. వ్యవసాయరంగంలో వృద్ధిరేటు 1980-81 - 1992-93 ల మధ్య 2.3 శాతం కాగా 1993-94 - 2005-06 ల మధ్య స్వల్పంగా పెరిగి 2.7 కు చేరింది. అయితే ఇది పారిశ్రామికరంగం, సేవారంగాల్లోని వృద్ధిరేట్ల కన్నా చాలా తక్కువస్థాయిలో ఉందని చెప్పాలి. మనరాష్ట్రంలో వ్యవసాయ వృద్ధి దేశీయ వృద్ధిరేటుతో పోలిస్తే పైన ప్రస్తావించిన రెండుకాలాలకు కూడా తక్కువగానే ఉంది. నికర రాష్ట్ర ఉత్పత్తిలో వ్యవసాయరంగ వాటా 1983లో 41.3 శాతంకాగా 2004-05 నాటికి 27.4 శాతానికి పడిపోయింది. వ్యవసాయరంగంపై ఆధారపడిన శ్రామికుల శాతం 1991 సెన్సెస్ ప్రకారం 71 శాతం కాగా 2001 సెన్సెస్ ప్రకారం 60 శాతంగా వుంది. 91-2001 మధ్య శ్రామికుల శాతం గణనీయంగా పడిపోయింది. వ్యవసాయ రంగంలో తలసరి ఆదాయం 1993-94 - 2003-04 ల మధ్య బాగా క్షీణించింది. రైతాంగంలోని చిన్న రైతుల ఆదాయాలు మరింతగా దిగజారాయి.

వ్యవసాయ రంగంలో వృద్ధిరేటు 7 శాతంకాగా ఇందులో పంట వృద్ధిరేటు అతి తక్కువగా, అనుబంధ శాఖల వృద్ధిరేటు ఎక్కువగా వుంది. 1993-94 - 2005-06 ల మధ్య పంటల వృద్ధిరేటు మరీ తక్కువగా 0.3 శాతం వద్ద ఉంది. ఇదే కాలానికి జిల్లాల వారీగా వృద్ధిరేట్లను పరిశీలిస్తే తెలంగాణ జిల్లాల్లో ఎక్కువగా నమోదయినట్లు తెలుస్తున్నది.

జిల్లావారీ వృద్ధిరేట్లలో వరంగల్‌జిల్లా సాలీనా 3 శాతం వృద్ధిరేటును కనబర్చింది. అదే కాలానికి ఆత్మహత్యల రేటు కూడా ఎక్కువగా ఉంది. ఈ వైరుధ్యానికి కారణాలను వృద్ధిరేటు పరిమాణంలో కాక గుణాత్మకతలో చూడవలసి ఉంటుంది. వృద్ధి జరుగుతున్నప్పటికి అది ఎంత మూల్యంతో కూడుకున్నదో గమనించవలసి ఉంటుంది. ప్రభుత్వ నీటిపారుదల వనరులు లేనందువల్ల రైతులు ప్రైవేట్‌గా సాగునీటిపై పెడుతున్న అధిక పెట్టుబడి వల్ల ఉత్పత్తి వ్యయం బాగా పెరిగిపోయింది. పంట ఉత్పత్తి విలువ పెరుగుతుంది కాని అందుకు చెల్లించే మూల్యం విస్మరించ కూడదు. భూగర్భ జలాలమీద ఆధారపడటం అస్థిర కొరత వనరుల మీద ఆధారపడినట్లే కనక ఎక్కువ కాలం మనగలగడం కూడా ప్రశ్నార్థకమే. ముఖ్యంగా తక్కువ వర్షపాతం, తక్కువ నీటిపారుదల వసతి గల ప్రాంతాల్లో మధ్యతరహా నీటివనరులయిన చెరువుల నిర్లక్ష్యం, బోరుబావుల వైఫల్యం వంటివి వ్యయాలను మరింతగా పెంచుతాయి.

## సబ్సిడీల తగ్గింపు

90ల మధ్య నుండి వేగవంతమయిన ఉదారవాద విధానాల వలన సబ్సిడీల తగ్గింపు, విద్యుచ్ఛక్తి నీటి వాడకాలపై ఆర్థిక ఫీజు, ప్రైవేట్ పెట్టుబడిని ఆకర్షింప చేయడానికి కల్పించే వసతులు వంటి అంశాల్లో మన రాష్ట్రం అగ్రభాగాన ఉన్నది. 1996-97 నుండే ప్రైవేటీకరణ ప్రారంభమయ్యింది. 1997-98 లో నీటి తీరువాలను 5 రెట్లు పెంచగా, 1996, 1999-2000లలో విద్యుచ్ఛక్తి రేట్లు బాగా పెరిగాయి 1990 ల్లో ఆనాటి తెలుగుదేశం ప్రభుత్వం విడుదల చేసిన 'విజన్ 2020' డాక్యుమెంట్ వ్యవసాయరంగం ప్రాముఖ్యతను తగ్గించి వేయాలనే వ్యూహాన్ని తేటతెల్లం చేసింది. ముఖ్యంగా కోశ, ద్రవ్య రంగాల్లోని సంస్కరణలు వ్యవసాయ రంగంలోని ప్రభుత్వ పెట్టుబడిని బాగా తగ్గించివేశాయి. గ్రామీణ ప్రాంతాల్లో ప్రభుత్వ పెట్టుబడి జిడిపిలో శాతంగా కుంచించుకుపోయింది. కేంద్రం నుండి రాష్ట్రాలకొచ్చే ద్రవ్య, బదిలీలు కూడా తగ్గిపోయాయి.

## వ్యవసాయరంగంలో ప్రభుత్వ పెట్టుబడి

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయరంగంలో ప్రభుత్వ పెట్టుబడి పెరుగుదల రేటు 1980లలో 8.5 శాతం కాగా 1990 కల్లా అది 1.4 శాతానికి పడిపోయింది. మరోవైపు ప్రైవేట్ పెట్టుబడి కూడా 1990 ల కల్లా

ప్రతికూలంగా మారింది. వ్యవసాయ పరిశోధన, విస్తరణ సేవలపై పెట్టే ఖర్చు 1992-94 లో వ్యవసాయ జిడిపిలో 0.26 శాతంగా ఉండింది. ఇది మిగతా దక్షిణాది రాష్ట్రాలకన్నా చాలా తక్కువ.

మరోవైపు ప్రభుత్వ విధానాల ఫలితాలను రైతుల స్థితిగతులపై సర్వే 2005 సమర్పించిన నివేదిక 499 ద్వారా వెల్లడి చేసింది. ఈ సర్వే ప్రకారం రైతులు వ్యవసాయ సాంకేతికతకు సంబంధించిన సమాచారంలో కేవలం 9 శాతం మాత్రమే ప్రభుత్వ విస్తరణ సంస్థల నుండి పొందుతున్నారు. విస్తరణ సమాచారానికి ఎక్కువగా విత్తనాలు, ఎరువు, పురుగమందుల డీలర్లపైన, ఇతర రైతుల మీద ఆధారపడుతున్నారు. అట్లాగే ఎరువులు, పురుగుమందులు-విత్తనాల నాణ్యతను పరీక్షించే సౌకర్యాలున్నాయని చెప్పిన రైతు కుటుంబాలు కేవలం 1.5 శాతమే పంటలతీరు మారినా, కొత్త వ్యవసాయ పద్ధతులకు సంబంధించిన శాస్త్రీయ సమాచారం రైతులకు అశాస్త్రీయ మార్గాల ద్వారానే అందాయి. ద్రవ్యరంగంలోని సంస్కరణల వల్ల వ్యవసాయ రంగానికి అందవలసిన పరపతి మొత్తం బాగా పడిపోయింది. మొత్తం బ్యాంక్ రుణంలో చిన్న ఖాతాదార్ల అకౌంట్లు 1991 లో 22 శాతంకాగా 2001 నాటికి 7 శాతానికి పడిపోయింది.

## విదేశీ వాణిజ్య విధానం

విదేశీ వాణిజ్య విధానం అనేక మార్పులకు కారణమయ్యింది. మన రాష్ట్రంలో వరి తర్వాత ప్రధాన పంట వేరుశనగకు సంబంధించి దిగుమతి సుంకాలు 1991-92 నుండి 2002-03 మధ్య పడిపోయాయి. నూనెగింజలపై 1991-92 లో దిగుమతి సుంకం 55 శాతం ఉండగా 2001-02 నాటికి 35 శాతానికి, పత్తిపై 1991-92లో 35 శాతం ఉండగా 2002-03 నాటికి ఇది 5 శాతానికి పడిపోయింది. (రమేష్ చంద్ 2004, జివోనెం.1) 1990 మొదటి సంవత్సరాల్లో వ్యవసాయ దిగుమతులపై పరిణామాత్మక ఆంక్షలు ఉండేవి. 2000 సంవత్సరం తర్వాత దిగుమతి సుంకాలు పరిమితి కన్నా బాగా తక్కువగా పడిపోయాయి. ప్రపంచ ధరల్లో అస్థిరత్వం ఉన్నా టారిఫ్‌లను పెంచకపోవడం వల్ల మన రైతులు ప్రపంచ ధరల ఒడిదుడుకులను ఎదుర్కొవలసి వచ్చింది. ఇందుకు తోడు వరితో సహా పత్తి, వేరుశనగ పంటల ఉత్పత్తి వ్యయాలు 1990లలో దాదాపుగా 54 శాతం పెరిగాయి. కానీ ఉత్పత్తి పెరుగుదల మాత్రం అదే రీతిలో లేదు. వేరుశనగ పంట 1980-2004-05 సంవత్సరాల మధ్య ఉత్పత్తి వ్యయం యాభై శాతం పెరిగింది, కానీ ఉత్పత్తి కేవలం 36 శాతం పెరిగింది. ముఖ్యంగా పత్తి, వేరుశనగ పంటల్లో ఉత్పత్తి పెరుగుదల ఇతర దక్షిణాది రాష్ట్రాలతో పోలిస్తే మన రాష్ట్రంలో తక్కువగా ఉంది. (ఎస్. గాలిబ్, రేవతి రెడ్డి 2007).

## సంక్షోభ సంకేతాలు ఇంకా మిగిలే ఉన్నాయి

వ్యవసాయంలో రుణగ్రస్తత కొత్తగా వచ్చిన సమస్య కాదు. అప్పుల చక్రం ఎప్పటినుండో కొనసాగుతోంది. కానీ తీసుకున్న రుణం భారమయి, అధిక వ్యయంతో కూడిన రుణంగా పరిణామం చెందుతున్నది. ఇటీవలి కాలంలోనే ఆత్మహత్యలకు ప్రధాన కారణం రుణభారమేననేది అనేక అధ్యయనాలు చెపుతున్నాయి. రుణభారం అన్ని రైతు కుటుంబాలు ఎదుర్కొంటున్నప్పటికీ, వీటి వలన ఏర్పడే ఒత్తిళ్లు చావు వరకు నెట్టివేస్తున్నాయి. రుణగ్రస్తత లక్షణాలు ఏ విధంగా ఉన్నాయి, ప్రభుత్వ చర్యల ద్వారా ఈ సమస్యకు ఏమయినా ఉపశమనం దొరికిందా అనేది ముఖ్య ప్రశ్నలు. ఎన్.ఎస్.ఎస్. అధ్యయనం ప్రకారం మన రాష్ట్రంలో రైతు కుటుంబాల్లో రుణభారం 82 శాతం వద్ద దేశం మొత్తంగానే ప్రథమ స్థానంలో ఉంది. వ్యవస్థేతర రుణం అఖిల భారత స్థాయిలో 42.4 శాతం ఉంటే మన రాష్ట్రంలో అది 68.5 శాతంగా ఉంది. ఇకపోతే చిన్న, సన్నకారు రైతుల మొత్తం రుణంలో దాదాపు 73 శాతం వ్యవస్థేతర ఆధారాల నుండి తీసుకున్నదే. 'వడ్డీవ్యాపారి' నుండి తీసుకున్న రుణం అత్యధికంగా ఉన్న రాష్ట్రం (53 శాతం) మొత్తం దేశంలో మన రాష్ట్రమేనని కూడా ఈ సర్వే చెపుతున్నది. వాణిజ్య బ్యాంకులు, గ్రామీణ బ్యాంకులు, సహకార సంస్థలు నుండి తీసుకున్న రుణం రాష్ట్రంలో అతి తక్కువగా 30 శాతం వద్ద ఉంది. ప్రాంతాల వారీగా రుణగ్రస్తత తీసుకుంటే తెలంగాణ, రాయసీమల్లో ఇంకా తీవ్రంగా ఉన్నట్లు అధ్యయనాలు చెపుతున్నాయి. (ఎస్. గాలిబ్, పృథ్వీకర్ రెడ్డి 2007). ప్రాంతీయ, కుల, వర్గ అంశాల దృష్ట్యా రుణ భారాన్ని అంచనా వేస్తే ఇది ఎక్కువగా బి.సి, ఎస్.సి, ఎస్.టి. కులాలకు (75 శాతం) చిన్న సన్నకారు రైతుల మీద (66 శాతం) ఉన్నట్టు తెలుస్తున్నది. భూమి సైజుకు, బ్యాంకులు ఇతర వ్యవస్థల నుండి పొందే రుణానికి మధ్య అనుకూల సంబంధం ఉంది. మొత్తం రుణంలో అధిక భాగం ఉత్పత్తి అవసరాలకే వాడుతున్నారనేది వాస్తవం. వ్యవసాయ ఉత్పాదకాల కోసం మార్కెట్ మీద ఆధారపడటం మన రాష్ట్రంలోనే అధికం. ఉదాహరణకు 81 శాతం రైతు కుటుంబాలు విత్తనాలు కొనుగోలు చేస్తున్నారు. పురుగు మందుల వాడకంలో దేశం మొత్తంగా రాష్ట్రం రెండవ స్థానంలో ఉంది. పంట ఉత్పాదకాలకు, పెట్టుబడి అవసరాలకోసమే అత్యధిక రుణాలను రైతులు వాడుతున్నారు. రుణ, ఉత్పాదకాల, మార్కెట్లు మధ్య లావాదేవీలు ఎక్కువగా ఉండటం వల్ల ఆంధ్రప్రదేశ్‌లోనే ఉత్పాదకాల వ్యయం అధికంగా ఉంది. అంతేకాదు 'అధిక వ్యయ' రుణం ఆంధ్రప్రదేశ్‌లోనే ఎక్కువ. వ్యవస్థేతర రుణాల్లో దాదాపు 92 శాతం 24 నుండి 60 శాతం మధ్య వడ్డీరేటు కలిగి ఉన్నాయి.

వ్యవసాయంలోని అతి తక్కువ వృద్ధిరేటు గ్రామీణ ప్రాంతాల జీవనస్థాయిపై తీవ్ర పరిణామాలను చూపింది. దాదాపు అన్ని వర్గాల రైతుల ఆదాయ వ్యయాల మధ్య అంతరం బాగా పెరిగిపోయింది. అఖిలభారత స్థాయి కన్నా మన రాష్ట్రంలో అన్ని వర్గాల రైతుల్లో కూడా ఆదాయ, వినియోగ వ్యయ స్థాయిలు తక్కువగా ఉన్నాయి. మరో వైపు వలసల వల్ల, రైతుల ఆత్మహత్యల వల్ల, రుణగ్రస్త చావుల వల్ల కుటుంబ భారం, వృత్తిభారం మహిళలపై పడుతున్నది. వ్యవసాయ భూమి సాగుచేయలేని పరిస్థితిలో పడావుగా పెట్టడం లేక కౌలుకివ్వడం వంటి మార్పులు జరుగుతున్నాయి. ఈ రకమైన మార్పులు పంట వృద్ధి రేటును మరింత కృంగదీస్తుందేమో.

## రైతు ఆత్మహత్యలు - తక్షణ చర్యలు

తక్షణ చర్యల్లో భాగంగా ఆత్మహత్య కుటుంబాలకు ఉపశమన ప్యాకేజిని జూలై 1997 నుండి వర్తింప చేయడం వలన పత్తిపంట

కారణంగా ఆత్మహత్య చేసుకున్న వారికి కొంతమేరకు ఉపశమనం లభించింది. వ్యవసాయరంగ సంక్షోభాన్ని గుర్తించటానికే నిరాకరించిన పరిస్థితి నుండి అన్ని వర్గాలు కూడా వ్యవసాయరంగంలో సంక్షోభం వాస్తవమేనని ఒప్పుకున్నారు. తక్షణ ఉపశమన చర్యలు రుణ ఒత్తిడి నుండి తాత్కాలికంగా ఉపశమనాన్ని అందించాయి. అన్ని పథకాలలాగే ఈ ప్యాకేజి అమలు కూడా అమలులో ఉండే లోపాలను కలిగి ఉంది. 1.5 లక్షల రూపాయల ద్రవ్య సహాయం అందటానికి అందులో 15 నుండి 20 శాతం 'అందుకోవడానికి మూల్యం'గా కోల్పోవలసి వచ్చింది. నాలుగు జిల్లాల్లో రైతు ఆత్మహత్యలపై జరిగిన ఒక అధ్యయనం ప్రకారం రైతు ఆత్మహత్యలుగా నమోదు అయిన మొత్తంలో వరంగల్ జిల్లాలో 71.5 శాతం, మహబూబ్‌నగర్‌లో 45.5, అనంతపురంలో 47.6, గుంటూరులో 50.2 శాతం కుటుంబాలకు రిలీఫ్ ప్యాకేజి అందింది. (ఇ. రేవతి, 2006)

స్థానిక రాజకీయ నాయకులతో సాన్నిహిత్యం, డబ్బు, సమయం రెండింటినీ వెచ్చించగల స్తోమత, కుటుంబంలో ఇతర మగవారి మద్దతు వంటి అంశాలు ప్యాకేజిని అందుకోవడానికి దోహదపడతాయని ఈ అధ్యయనాలు చెపుతున్నాయి.

## సంక్షోభం - దీర్ఘకాలిక చర్యలు

రుణగ్రస్తతను, రుణభారాన్ని తగ్గించడానికి పరపతిని అదనంగా, సులువుగా, సమ్మిళితంగా, దీర్ఘకాలికంగా అందించడంతో పాటుగా ఉత్పత్తి వ్యయాన్ని తగ్గించే విధమయిన చర్యలు కూడా అవసరమ వుతాయి. దీర్ఘకాలిక చర్యలను ఈ కింది విధంగా వర్గీకరించవచ్చు.

అ) సాంకేతికత, ఆ) సంస్థాగత పరపతి పెంపుదల, ఇ) నీటి పారుదలకు సంబంధించి, ఈ) సంస్థాగత ఏర్పాట్లు

### సాంకేతికత

వ్యవసాయంలో రసాయన ఎరువులు తగ్గించి బయోటెక్నాలజీ ఆధారంగా సేంద్రీయ పద్ధతులను పెంపొందించడానికి ప్రభుత్వం - స్వచ్ఛంద సంస్థల భాగస్వామ్యంతో (ఇందిరా క్రాంతి పథకం - సెంటర్ ఫర్ సస్టేయినబుల్ ఎగ్రికల్చర్) మనగలిగే వ్యవసాయ పద్ధతులను విస్తరింప చేస్తున్నారు. అట్లాగే ముఖ్య ఉత్పాదకమయిన విత్తనాన్ని రైతులే తయారుచేసుకునే విధంగా 'సీడ్ విలేజ్' పథకాన్ని ప్రవేశపెట్టినా, తయారుచేసిన విత్తనాన్ని రైతులే మార్కెట్ చేసుకోవల్సిరావడం కష్టమయిన పనే.

వాణిజ్య పంటలకు సంబంధించి నిర్వహణ పద్ధతులను వ్యవసాయ విస్తరణాధికారి ద్వారా కల్పించే పొలంబడి కార్యక్రమం ఎక్కడయితే సర్పంచ్‌లు చొరవ తీసుకుని నిర్వహిస్తున్నారో అక్కడ కొంత ఉపయోగకరంగానే ఉంటున్నది. 2004 తర్వాత కూడా విస్తరణ సిబ్బంది ఖాళీలను నింపకుండా విస్తరణా సౌకర్యాలను ప్రైవేట్ అగ్రిక్లీనిక్‌ల ద్వారా అందించే ప్రయత్నమే జరిగింది. రైతులకు కావల్సిన ఉపయుక్త సేవలు వసతులకు డిమాండ్ లేమి ఏమీ లేదు. అయితే సప్లై సమస్యలే ఉన్నాయి. ప్రభుత్వం వైపునుండి వచ్చే సప్లై సరిపోయినంతగా, తక్షణంగా అందించే విధంగా లేవు. అట్లాగే ప్రైవేట్ మార్కెట్ అందించే సేవలు కూడా ఆధారపడే విధంగా లేవు. వీటిని క్రమబద్ధీకరించవలసి ఉంది.

### వ్యవస్థాగత పరపతి పెంపు

వ్యవసాయ పరపతిని రెండింతలుగా పెంచాలనే విధానాన్ని 2004-05లో ప్రవేశపెట్టారు. పంట రుణాలు 40-45 శాతంతో పెరిగిందని చెపుతున్నప్పటికీ కాగితం తీరగరాయడం జరిగి అదనంగా రైతాంగానికి అందిన పరపతి తక్కువగానే ఉంటోంది. పదహారు సంక్షోభ జిల్లాల్లో రైతుల రుణాలపై వడ్డీ మాఫీతో కలిపి ప్రధానమంత్రి ప్యాకేజిగా దాదాపు 9000 కోట్ల రూపాయలు ప్రకటించారు. అయితే ఆత్మహత్య చేసుకున్న కుటుంబాల్లో 80-90 శాతం రుణం వ్యవస్థేతర ఆధారాల నుండే కావడం వలన బ్యాంకు వడ్డీ రద్దుతో వీరు పెద్దగా ఉపశమనం పొందలేకపోయారు. చిన్న, సన్నకారు రైతుల వ్యవస్థేతర రుణభారం తగ్గించడానికి 'సంపూర్ణ ఆర్థిక చేకూర్పు ప్రణాళిక' ద్వారా ప్రయత్నం జరుగుతున్నది. ఈ మధ్యనే మొదట నాలుగు జిల్లాలలో (నిజామాబాద్, మెదక్, కరీంనగర్, ఆదిలాబాద్) ప్రారంభమయినా క్రమంగా అన్ని జిల్లాలకు విస్తరింప చేశారు. పావలా వడ్డీకే రుణాల నందజేయాలంటే ముందు కనీసం 12 శాతం వడ్డీ చెల్లించవలసిందే. పేద వర్గాలకు 'సాఫ్ట్‌లోన్' వసతి కల్పిస్తే వ్యవస్థేతర రుణాలపై అధిక వడ్డీ భారం తగ్గిపోతుందనేదే ఈ పథకం ముఖ్య ఉద్దేశ్యం. ఇందిరా క్రాంతి పథకం ద్వారా అమలవుతున్న ఈ పథకం అధిక వడ్డీ భారం నుంచి ఉపశమనం ఇస్తుంది. అయితే ఎంతో కొంత పెరుగుతున్న పరపతి ప్రవాహాన్ని ఉత్పాదకంగా ఉపయోగించుకునే పరిస్థితి ఇవాళ ఉందా అన్నదే పెద్ద సందేహం. ముఖ్యంగా డ్రైల్యాండ్ ప్రాంతాలు, వర్షాధారిత ప్రాంతాల్లో వ్యవసాయం లేక అనుబంధ కార్యకలాపాలు గానీ, వ్యవసాయేతర కార్యకలాపాలుగానీ లేని పరిస్థితుల్లో పెరిగిన పరపతి భారంగా మారక తప్పదు. 'రుణాన్ని ఇముడ్చుకునే శక్తి' లేకపోబట్టే విదర్భలో ఎన్ని నూతన పథకాల ద్వారా పరపతిని అందించినా బూడిదలో పోసిన పన్నీరులాగానే ఉందనేది అధ్యయనాలు చెపుతున్నాయి. (నారాయణ మూర్తి, 2006). సంక్షోభ నివారణకు చేపట్టే దీర్ఘకాలిక చర్యలు ముఖ్యంగా నీటిపారుదల, అంతర్గత రోడ్లు, స్టోరేజ్ వసతులు మొదలయిన గ్రామీణ అవస్థాపన మెరుగుపర్చకపోతే పరిస్థితిలో ఏమీ మార్పు ఉండదు.

### నీటి పారుదల

రుణ సమస్య మూలాల్లోనే రుణ గ్రస్తతకు పరిష్కారం లభిస్తుంది. వర్షపాతం - నీటి పారుదల వసతి రెండూ తక్కువగా ఉన్న తెలంగాణ, రాయలసీమ ప్రాంతాల్లో పెట్టుబడి వ్యయం ఎక్కువగా నీటిపారుదల కోసమే జరుగుతున్నది. గత కొన్ని సంవత్సరాలుగా నీటి పారుదల కోసం భూగర్భ జలాలమీద ఆధారపడటం ఎక్కువయింది. ప్రధానమంత్రి ప్యాకేజిలో భాగంగా సత్వర సాగునీటి ప్రయోజన పథకం (ఏఐబిపి) ద్వారా విడుదలయ్యే కేంద్ర నిధుల్లో అధికభాగం (5709 కోట్ల రూపాయలు) మన రాష్ట్రానికే కేటాయించారు. అంతేకాక మైక్రో ఇరిగేషన్, వాటర్‌షెడ్, హార్టికల్చర్, పశుగణాభివృద్ధి, వ్యవసాయ విస్తరణ వంటి అంశాలకు దాదాపు 2500 కోట్ల రూపాయలు కేటాయించారు. 2004 ఆగస్ట్‌లో చేపట్టిన జలయజ్ఞం కింద గోదావరి నదిపై తలపెట్టిన ఆరు ప్రాజెక్ట్‌ల ద్వారా నీటిపారుదల వసతి ఎంతో తక్కువగా ఉన్న తెలంగాణ

ప్రాంతానికి 16.32 లక్షల ఎకరాలకు నీటి పారుదలను కల్పించాలని ప్రభుత్వ ప్రణాళిక. అంతేకాక జలయజ్ఞంపై జరిగే బడ్జెట్‌లో 52 శాతం తెలంగాణ ప్రాంతానికి కేటాయించామని ప్రభుత్వం చెపుతున్నా నికరజలాలు కచ్చితంగా ఉండి వాస్తవంగా నీటిపారుదలను కల్పిస్తామన్న ప్రాజెక్టులకు ప్రాధాన్యత ఇవ్వడం లేదనేది నిపుణుల విమర్శ. 'కాగ్' నివేదిక ప్రకారం మార్చ్ 2007 నాటికే 2.16 లక్షల ఎకరాలకు నీరందవలసి ఉండగా ఆ లక్ష్యం నెరవేరలేదు. అట్లాగే కచ్చితమైన విద్యుత్తు సప్లై కేటాయింపు లేకుండా లిఫ్ట్ ఇరిగేషన్ పథకాల పనితీరు కూడా సందేహమేనని తేల్చింది. ప్రాజెక్టుల అమలులో జరుగుతున్న జాప్యం అవకతవకలు, ప్రాజెక్టుల ప్రాధాన్యత, చిన్న నీటి వనరులపై అశ్రద్ధ వంటి అంశాలన్నీ కూడా సంక్షోభ ప్రాంతాల్లో నీటిపారుదల వ్యవస్థ మెరుగు పడుతుందా అనే సందేహం కలిగిస్తున్నాయి. ఈ విషయంలో ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ వహించవలసి ఉంటుంది.

## సంస్థాగత ఏర్పాట్లు

మార్కెట్ సంస్కరణల తర్వాత కాలంలో గ్రామీణ ప్రాంతాల్లో రైతుల మధ్య పరస్పర సంబంధాలు తగ్గిపోయి మార్కెట్‌తో ఉండే వైయక్తిక సంబంధాలు పెరిగాయి. రైతాంగం ఒకే విధమైన సమస్యలెదురు కుంటున్నప్పటికీ సంఘటితంగా లేకపోవడం వలన సంక్షోభ తీవ్రత ఎక్కువగా ఉంది. రైతులను స్వయం సహాయక బృందాలుగా ఏర్పాటు చేసి వాటి ద్వారానే వీరు మార్కెట్‌తో గానీ, ప్రభుత్వంతో గానీ నెగోషియేట్ చేసుకోవడం మేలనే భావనతోనే రైతుమిత్ర గ్రూపులను ప్రారంభించింది. అయితే ఈ గ్రూపులను సమైక్య పరిచి గ్రామైక్య సంఘంగా ఇంకా ఎగువస్థాయి సంఘాలుగా చేయడంలో జాప్యం జరుగుతోంది. మహిళల విషయంలో ఎస్.ఇ.ఆర్.పి. నమూనాలోనే రైతుమిత్ర గ్రూపులకు కూడ ఒక స్వతంత్ర సంస్థను నెలకొల్పితే తప్ప ఈ విషయంలో పురోగతి ఉండదు. గ్రూపుల ద్వారా రైతాంగం ఇటు ప్రభుత్వంతో అటు మార్కెట్‌తోను నెగోషియేట్ చేయగల్గుతుంది.

పంటల ఉత్పత్తిలో ముఖ్యంగా ఆహారేతర పంటల ఉత్పత్తిలో రైతులు సహజ మార్కెట్ వంటి అనేక కారణాల వల్ల అనిశ్చితతకు గురవుతున్నారన్నది విదితమే. పంట బీమా పథకం, రైతు బంధు పథకం వంటి వాటిని ఇందుకు పరిష్కారంగా అమలు చేస్తున్నారు. పంట బీమా వంటి పథకాలను 'టార్గెటింగ్‌లో సమస్యలు, అమలులో లోపాలు' కలిగి ఉండటం వలన అది సాధారణ పరిష్కారంగా మిగలకూడదనేది నిపుణుల అభిప్రాయం. దీనితోపాటు దీర్ఘకాల చర్యలయిన నీటిపారుదల పెరుగుదల తద్వారా ఉత్పాదకత పెరుగుదలలోనే పరిష్కారాలను వెతకవలసి ఉంటుంది. (సి.ఎచ్. హనుమంతరావు, 2005)

వ్యవసాయాధారిత కుటుంబాలకు వ్యవసాయేతర మార్గాల ద్వారా ఆదాయం వచ్చినట్లయితే సంక్షోభ తీవ్రత తగ్గుతుందని అధ్యయనాలు చెపుతున్నాయి. అనుబంధ కార్యకలాపాలయిన డైరీ, పౌల్ట్రీ, మేకలు, గొర్రెల పెంపకం, సెరికల్చర్, తేనెటీగల పెంపకం వంటివయినా, లేక వ్యవసాయేతర కార్యకలాపాలు ముఖ్యంగా సర్వీసు రంగం ద్వారా ప్రత్యామ్నాయ ఆదాయం వచ్చే అవకాశం ఉంటుంది. అయితే ఈ రంగాల పెరుగుదల రేటుకు వ్యవసాయ పెరుగుదల రేటుకు బలమైన సంబంధం ఉంటుందనేది వ్యవసాయేతర ఉద్యోగితపై వచ్చిన అధ్యయనాలు చెపుతున్నాయి. సంక్షోభ జిల్లాల్లో వ్యవసాయం కుంటుపడిన పరిస్థితుల్లో స్వల్ప వడ్డీపై రుణం వంటి ప్రత్యేక చర్యల ద్వారా వీటిని ప్రోత్సహించవలసి ఉంటుంది. ఇటీవలిగా అమలువుతున్న గ్రామీణ ఉపాధిహామీ పథకం సంక్షోభ జిల్లాల్లో కొంత ఉపశమనం ఇస్తున్నది.

## సంక్షోభ నివారణ చర్యలు - పూర్తికాని ఎజెండా

ఇటీవలి కాలంలో రైతు ఆత్మహత్యల రేటు తగ్గింది. అయినా రోజూ ఎక్కడో ఒకచోట జరుగుతూనే ఉన్నాయి. పెరిగిన అప్పులే ప్రధాన కారణాలుగా నమోదవుతున్నాయి. వర్షాభావ పరిస్థితి లేకపోవడంతోపాటు, ఉపాధి హామీ పథకం అమలు, బిటి పత్తి కింద సాగు పెరగడం, (స్వల్పకాలంలో నయితే ఉత్పత్తి పెరుగుతున్నట్లుగా అధ్యయనాలు చెపుతున్నాయి, కానీ దీర్ఘకాల పరిణామాల కోసం ఇంకా వేచి చూడాలి) గ్రామీణ ప్రాంతాల్లో వ్యవస్థాగత పరపతి పెరగడం సంక్షోభం నుండి కొంత మేరకు ఉపశమనం ఇచ్చాయి. మరోవైపున దీర్ఘకాలిక సంక్షోభ తొలగింపు లేక నివారణ చర్యల వైపు తొలి అడుగు పడినప్పటికీ సరయిన మార్గంలో, సుస్థిర మార్గంలో పయనించవలసి ఉంటుంది. ముఖ్యంగా పట్టి పీడిస్తున్న గ్రామీణ రుణగ్రస్తత, దిగజారిన పంటల వృద్ధిరేటు, సహజ వనరుల క్షీణత, ద్రవ్య బ్యాంకింగ్ పరిధిలోకి రాని గ్రామీణుల శాతం, విస్తరణ సమస్యలు, మార్కెట్ సమస్యలు వంటివన్నీ ఉండనే ఉన్నాయి. కనుక వ్యవసాయ సంక్షోభ నివారణ ఇంకా 'అసంపూర్ణ ఎజెండా'గానే ఉంది. ◆

**వచ్చే సంచికలలో...**

- **ఫోకస్ - మార్చ్ 2008 : ఆంధ్రప్రదేశ్‌లో భూ సంస్కరణలు**
- **ఫోకస్ - ఏప్రిల్ 2008 : కేంద్ర బడ్జెట్**
- **సమస్యల వలయంలో రైతులు - వెనుకబడుతున్న వ్యవసాయరంగం - కూరపాటి వెంకటనారాయణ, డా. సి.హెచ్ దినేష్‌కుమార్**
- **షెడ్యూల్డ్ కులాల రిజర్వేషన్ల సూక్ష్మ వర్గీకరణ - దళితుల మధ్య సామాజిక న్యాయం - నాగరాజు వాడపల్లి, డా. జి. వీరన్న**

*మానవ చరిత్రలో ముందుగా భాషా శబ్దాలూ, ఆ తర్వాత ఎన్నో వేల సంవత్సరాలకు వాటన్నింటినీ అక్షరబద్ధం చేసే పద్ధతులూ వచ్చాయంటూ భాషా లిపుల పరిణామం గురించి వివరిస్తున్నారు* **కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# మనుషులూ, మాటలూ

**త**క్కిన ప్రాణులను "నోరులేని జీవాలుగా" పరిగణించడం మనకు అలవాటు. భౌభౌలూ, కావుకావులూ మన వాక్పటిమకు సాటిరావు. కుక్కలనూ, పిల్లులనూ పెంచుతున్న వారు వాటితో మాట్లాడతారుగాని ఆ సంభాషణ అంతా ఏకపక్షమే. అందుకే తమకున్న రోగ లక్షణాలెటువంటివో వివరించలేనివారు పశువుల డాక్టర్ వద్దకు వెళ్ళాలనేది ఒక జోక్. చిలక పలుకులు నిజమైన మాటలు కావు. మాటలంటే కేవలం ధ్వనులు చెయ్యడంకాదు. వాటి వెనక ఆలోచనలూ, ఉద్దేశాలూ ఉంటాయి. మాటలు పలకగలగడమూ, భాషల ఆవిర్భావమూ మనుషులు సాధించిన ప్రత్యేక విజయాలు. ఇందుకుగాను నోటి నిర్మాణంలోనూ, మెదడు పరిణామంలోనూ కొంత అభివృద్ధి జరగాలి.

మనుషుల శరీర నిర్మాణం దృష్ట్యా సుమారు 30, 40 వేల సంవత్సరాల క్రితం దాకా భాషలు మొదలవలేదని కొందరు శాస్త్రవేత్తల అభిప్రాయం. ప్రాచీన మానవ అవశేషాలనుబట్టి తొలి భాషలు ఎప్పుడు మొదలయి ఉంటాయో శాస్త్రజ్ఞులు ఊహించగలుగుతున్నారు. అరుపులూ, కూతలూ, పెడబొబ్బలూ పెట్టడానికి ప్రత్యేక ఏర్పాట్లేవీ అవసరం కావుగాని, మాటలు మాట్లాడడానికి నోట్లో నాలుక అష్టవంకరలూ తిరగగలిగి ఉండాలి. నాలుక కండరాలను నియంత్రించడానికి మెదడు కొంత శ్రమపడాలి. అందుచేత పదాలు ఉచ్చరించడానికి నాలుకనూ, మెదడునూ కలిపే నరాలు ప్రవేశించే మార్గం తగుమాత్రం పెద్దదిగా ఉండాలి. పుర్రెకు అడుగున ఈ సదుపాయానికై ఏర్పాటయిన రంధ్రం చింపాంజీ, గొరిల్లాలవంటి నరవానరాలకు మనకన్నా చిన్నదిగా ఉంటుంది. కనకనే అవి మాట్లాడలేవు. అంతేకాక నాలుక స్వేచ్ఛగా తిరగడానికి వాటి దంతాల మధ్య మనుషులకున్నంత స్థలం ఉండదు.

ఆధునిక మానవుల ఆవిర్భావం జరుగుతున్నప్పుడు వారి శరీరాల్లో (ముఖ్యంగా, మెదడుకు సంబంధించిన నాడీవ్యవస్థలో) కొద్దిపాటి మార్పులు కొనసాగుతూనే ఉన్నాయి. ముఖ్యంగా మనుషులు రెండు కాళ్ళమీద నడవడం మొదలుపెట్టాక వారి చేతులూ, చేతి వేళ్ళూ నైపుణ్యాన్నీ, ప్రత్యేకతనూ సంతరించుకోసాగాయి. ఇందుకు అనుగుణంగా వారి మెదడులోని కొన్ని భాగాల్లో అపూర్వమైన అభివృద్ధి జరిగింది. వీటిలో నుదుటి వెనక ఉండే బ్రోకా కేంద్రం ఒకటి. ఇది పెద్దది కావడం వల్ల పెదవులూ, నాలుకా బాగా తిరగగలిగాయి. పదాలను ఉచ్చరించ డానికీ, వాటిని విని, అర్థంచేసుకోవడానికీ తగిన పరిణామాలు జరిగాయి.

జంతువులూ, పక్షులూ అవసరమైనప్పుడు శబ్దాలు చేస్తూ సంకేతాలు పంపగలవు. జత కట్టడానికో, సాటి ప్రాణులను హెచ్చరించడానికో, కోపమూ, బాధా వ్యక్తం చెయ్యడానికో రకరకాల చప్పుళ్ళు చెయ్యగలవు. కానీ అవన్నీ పరిమితంగా, వాటి అవసరాలకు మించకుండా ఉంటాయి. కోతులలాగా చెట్లకు అంటిపెట్టుకోకుండా విభిన్న పరిస్థితులలో జీవించసాగిన మనవజాతి మనుగడకు భాష ఉపయోగం జీవన పరిణామంలోనూ మానసిక అభివృద్ధిలోనూ అత్యవసరం అయిపోయింది. సముదాయాలుగా జీవిస్తూ, పరస్పరం సహకరించుకోసాగిన తొలి మానవుల జీవనశైలి జటిలం అవుతున్న కొద్దీ భాష అవసరం పెరిగింది.

మొదటగా ఒక్కొక్క వస్తువుకూ సంకేతాలు ఏర్పాటు చేసుకోవలసి వచ్చింది. రోజువారీ సంఘటనల వైవిధ్యం పెరుగుతున్న కొద్దీ ఈ శబ్దాల మధ్య పొరబాట్లూ, అపార్థాలూ తలెత్తకుండా ఉండడానికని క్రమంగా వేరు వేరు పదాలవంటివి ఏర్పాటు చేసుకోక తప్పలేదు. ఒకవంక మెదడులో ఉచ్చారణకు సంబంధించిన అభివృద్ధి జరుగుతూ ఉంటే మరొకవంక తాము వింటున్న ఒక్కొక్క పదానికీ అర్థాలు స్ఫురించడం, ఆ పదం వర్ణిస్తున్న వస్తువునే, జంతువునే ఊహించు కోగలగడం కూడా మనుషులకు సాధ్యమైంది. జంతువులలాగా కాకుండా "ఫలానా పరిస్థితిలో ఫలానా సంఘటన జరిగితే ఏమౌతుంది" అనే ఆలోచనలు తలెత్తడానికీ, వాటి గురించి సాటివారితో మాటల ద్వారా చర్చించడానికీ అవకాశాలు పెరగసాగాయి.

ప్రాణుల్లో నోరు అహారానికై ప్రధానంగా ఉద్దేశించబడిన అవయవం. శబ్దాలూ, మాటలూ ఆ తరవాత మొదలైన ప్రక్రియలు. మాట్లాడడానికి జీవపరిణామ క్రమంలో స్వరపేటికలో తగిన మార్పులు జరగాలి. జపాన్‌లోని కొందరు పరిశీలకులు ఈ మార్పులు అహారం మింగడానికి సంబంధించినవని భావిస్తున్నారు. మన గొంతులోని అహారనాళిక శ్వాసనాళికకు సమీపంలోనే ఉంటుంది. అందుకనే తక్కిన జంతువులతో పోలిస్తే మనుషుల్లో అహారం శ్వాసనాళికకు అడ్డంపడే ప్రమాదం ఎక్కువ. ఊపిరితీసి వదిలేందుకని ఏర్పాటైన శ్వాసకోశవ్యవస్థ పరిణామక్రమంలో మాటల ఉచ్చారణకు పనికొచ్చి ఉంటుంది.

స్వరపేటిక నిర్మాణంలో చింపాంజీలకూ, మనుషులకూ పెద్దగా తేడాలు లేవు. ఈ రెండు జాతుల్లోనూ స్వరపేటిక గొంతుకు దిగువ

భాగాన ఉంటుంది. చిన్నపిల్లల్లో ఇది జరగడానికి కొంతకాలం పడుతుంది. కనకనే పసిపిల్లలకు మాటలు రావు. నియాండర్తాల్ మానవుల స్వరపేటిక నిర్మాణం నేటి పసిపిల్లలను పోలి ఉండేదనీ, అందుకనివారు మాట్లాడగలిగేవారా అన్నది సందేహాస్పదమనీ భావిస్తున్నారు. ఎటొచ్చీ చింపాజీల్లో నాలుక వెనకభాగపు కండరాన్ని పట్టి ఉంచే ఎముక స్థానం తేడాగా ఉండడంవల్ల అవి మాట్లాడలేక పోయాయని ఈ పరిశీలకుల ఉద్దేశం. ఆధునిక మానవుల్లో స్వరపేటిక ప్రాంతం దీర్ఘంగా సాగి ఉంటుంది కనక మాట్లాడడం వీలవుతోంది. ముఖ్యంగా అచ్చులు పలకడానికీ, అవసరమైనప్పుడు ముక్కుతో అనునాసికాలు మాట్లాడకుండా ఉండడానికీ ఏర్పాట్లున్నాయి. అందువల్లనే మనుషులు రకరకాల పదాలు ఉచ్చరించగలరు.

మనుషులకు భాష విషయంలో శారీరకంగా ప్రత్యేకత ఉంటే దానికి జన్యుపరమైన కారణాలుండాలి. మాట్లాడడంలో ఇబ్బందులకు గురవుతున్న వారిమీద ఇటీవల జరిపిన పరిశోధనలవల్ల అందుకు సంబంధించిన ఒక జన్యువు గురించి శాస్త్రవేత్తలకు తెలిసింది. ఒక కుటుంబంలో వంశపారంపర్యంగా కనబడుతున్న ఈ వింత రుగ్మత గురించి పరిశోధనలు చేశారు. వాటివల్ల తెలిసనదేమిటంటే ఫాక్స్‌పీ2 అనబడే ఈ జన్యువులోని డిఎన్ఏ క్రమంలో మ్యుటేషన్ కారణంగా ఒకే ఒక్క మార్పు జరిగితే ఈ సమస్యలు తలెత్తుతాయి. పిండదశలో ఇవి మొదలవడంతో మెదడులో మాటలు పలకడానికి తోడ్పడే నరాలు దెబ్బతినడం, ఇతర సమస్యలు ఏర్పడటం జరుగుతుంది. ఈ కారణంగా బాధితులకు నోటినీ, పెదవులనూ, తక్కిన ముఖభాగాలనూ సరిగ్గా కదిలించడంలో ఇబ్బంది ఉన్నట్టుగా తెలిసింది. స్పష్టమైన ఉచ్చారణ లోనూ, వ్యాకరణపరమైన వాక్య నిర్మాణంలోనూ లోపాలు కలిగాయి.

ఈ జన్యువు మనలోనేకాక సేంద్రియ పదార్థాల్లోనూ, చుంచులూ, గొరిల్లాలూ, చింపాజీలవంటి ప్రాణుల్లోనూ కూడా ఉంటుంది. దీనివల్ల ఒక రకమైన ప్రోటీన్ నిర్మాణం జరుగుతుంది. ప్రోటీన్లన్నీ అమినో ఆసిడ్లతో తయారవుతాయి. ఉదాహరణకు విభిన్న జాతులుగా ఏడున్నర కోట్ల సంవత్సరాల క్రితమే వేరుపడిన చుంచులకూ, వానరాలకూ 715 అమినో ఆసిడ్లలో ఒక్క అమినో ఆసిడ్ తేడాగా ఉంటుంది. మనుషులకు 60 లక్షల సంవత్సరాల క్రితం బంధువులుగా ఉండిన గొరిల్లాలూ, చింపాంజీ వగైరాలకూ మరి రెండు అమినో అసిడ్లు తేడాగా ఉంటాయి, కానీ ఈ జాతులన్నిటిలోనూ ఉండే అర్జినీన్ అనే ఒక అమినో ఆసిడ్ వ్యాధిగ్రస్తులలో మ్యుటేషన్ వల్ల హిస్టిడీన్ అనే అమినో ఆసిడ్‌గా మారిపోవడంతో మాటలకు సంబంధించిన ఒక రుగ్మత కలుగుతుందని తెలిసింది.

ఇదేదో భాషకూ, వ్యాకరణానికీ సంబంధించిన జన్యువు కాకపోవచ్చుగాని మ్యుటేషన్ జరిగినప్పుడు ఈ మార్పు మనుషులలో మాటలపై ప్రభావాన్ని కలిగిస్తుంది. మనుషుల లక్షణాలన్నీ కేవలం జన్యువులమీదనే ఆధారపడవు. వారి జీవనవిధానం తక్కిన జంతువులకు భిన్నంగా కొనసాగడంతో వారి జన్యువుల్లోని ప్రోటీన్ల ప్రభావక్షేత్రాల్లో మార్పులు కలిగి, వారికి ప్రత్యేకతను కలిగిస్తాయి. శారీరక లక్షణాలూ, పరిసరాల ప్రభావమూ రెండిటికీ ఇందులో ప్రాముఖ్యత ఉంటుంది. మొత్తంమీద మాటల గారడీ మనిషిజాతికే పరిమితమైనది.

వీటన్నిటి ఫలితంగా చదవడం, రాయడం అనేవి మానవ సంస్కృతిలో ప్రధానమైన అంశాలు అయిపోయాయి. ఈ రెండిటికీ అవసరమైన లిపి, తక్కిన రాత పరికరాలూ తయారవడానికి ముందుగా భాషలు మొదలయ్యాయి. చదవడం, రాయడం పసితనం నుంచీ అలవాటైన మనవంటివారికి నిరక్షరాస్య సమాజం గురించి ఊహించు కోవడం కూడా కష్టమనిపిస్తుంది. కాని మానవచరిత్రలో ముందుగా భాషా శబ్దాలూ, ఆ తరువాత ఎన్నో వేల సంవత్సరాలకు వాటన్నింటినీ అక్షరబద్ధం చేసి పద్ధతులూ వచ్చాయి.

నాగరికత అనేది సుమారుగా క్రీస్తుకు 9 వేల సంవత్సరాల కిందట మొదలైందనుకుంటే లిపి మొదలైన దాఖలాలు మరొక అయిదారువేల ఏళ్ల దాకా కనబడవు. అప్పటిదాకా మనుషులకు శబ్దాలతోనేపని గడిచిపోయింది. భాషలన్నీ మాట్లాడడం, వినడాలకే పరిమితం అయి ఉండేవి. అతి ప్రాథమిక స్థాయిలో నోటి మాటల సంకేతాలుగా మొదలైన భాషలు త్వరలోనే తొలి మానవజాతులకు ముఖ్యమైన జీవితావసరం అయిపోయాయి. నిత్యజీవితంలో ప్రతి వస్తువుకూ, స్థలానికీ, ప్రతి భావనకూ, చర్యకూ, ఉద్దేశానికీ పదరూపం ఏర్పడింది.

తమ సాటివారితో అవసరార్థం ఎప్పటికప్పుడు సంభాషించు కోవటానికే ఆరంభమైనప్పటికీ భాషలన్నీ భూత భవిష్యద్వర్తమానాలన్నిటికీ ఉపయోగపడగలిగిన స్థాయికి ఎదిగాయి. ఇందులో ముఖ్యంగా అనుభవాలకు రూపకల్పన చెయ్యడం వీలైంది. జరిగిపోయిన విషయాలనూ, అవసరమైనవీ, గుర్తుంచుకోవలసినవీ అనిపించిన చారిత్రక సంఘటనలనూ నమోదు చెయ్యటానికి కథలూ, గాథలూ తయారు కాసాగాయి. లిపి, రాత పరికరాలూ మొదలవని ఆ యుగంలో ఇవన్నీ మౌఖిక రూపంలోనే మొదలై కొనసాగాయి.

శ్రుతీ (వినదగినవి), స్మృతీ (గుర్తుంచుకోవలసినవి) అనే రూపాల్లో మనదేశపు తొలి సాహిత్యమంతా ఎంతో ప్రాధాన్యతను సంతరించుకుంది. ఈ రోజుల్లో సీడీ రామ్‌లూ, హార్డ్ డిస్కుల సంగతి పల్లెటూరివాళ్లకు కూడా తెలుస్తుందేమో కాని ఆనాడు గ్రంథాలూ, పుస్తకాల గురించి ఎవరికీ తెలియదు. మొత్తం మీద ప్రపంచమంతటా మానవ నాగరికత లోని తొలి దశలలో భాషలన్నీ నోటిద్వారా శ్రవణ రూపంలోనే ప్రాచుర్యం పొందాయి.

రాముడి రాజాస్థానంలో లవకుశులు రామాయణగాథను గానం చేసి వినిపించారని మన పురాణాల్లో ఉంది. అసలురామాయణ, మహా భారతాల్లోని సంఘటనలన్నీ అతిప్రాచీనకాలానికి చెందినవనీ, గాథలుగా ప్రచారంలో ఉన్న ఈ పురాణాలకు వాల్మీకి తదితరులు సాహిత్య రూపాన్నిచ్చారనీ కొందరి అభిప్రాయం. ఇందులో నిజమెంతో తెలియక పోయినా పురాణశ్రవణం అనేది పురాణ పఠనంకన్నా చాలా పాత సంప్రదాయం. ఎటొచ్చీ తొలియుగాల్లో పుస్తకం చూసి ఉదహరించకుండా కంఠస్థం చేసిన వివరాలనే చెప్పేవారు. మన దేశంలోనే కాదు, ప్రపంచ మంతటా పురాణాలన్నీటినీ గాథలరూపంలోనే వినిపించేవారు. అక్షరాస్యత పెరిగిన ఇన్ని వేలసంవత్సరాల తరవాత కూడా మనవాళ్ళలో ఇటీవలి దాకా హరికథలూ, బుర్రకథలూ మొదలైనవన్నీ దృశ్య, శ్రవణ రూపాల్లో జనాదరణ పొందాయంటే ఈ సంప్రదాయం ఎంతపాతదో అర్థమౌతుంది.

గతంలో జరిగిన సంఘటనల గురించీ, ఆనాటి వీరులూ, మేధావులూ పొందిన అనుభవాల గురించీ నలుగురూ విని, నేర్చుకుని, స్ఫూర్తినీ, జ్ఞానాన్నీ సంపాదించడానికి ఇటువంటి సమావేశాలు జరుగుతూ ఉండేవి. సమాజానికి పనికొచ్చే నీతులూ, బోధలూ అన్నిటినీ చక్కగా వర్ణిస్తూ, తమ ప్రదర్శనను ఒక కళగా నేర్చుకుని గానం చెయ్యగలిగిన వారికి ప్రత్యేకస్థానం ఉండేది. స్పష్టమైన ఉచ్చారణా, బాగా మోగే కంఠస్వరమూ, మంచి జ్ఞాపకశక్తీ, ఆకట్టుకోగలిగిన శైలీ మొదలైనవన్నీ ఈ ప్రదర్శకులకు అవసరమయేవి.

గ్రీస్‌కు ఉత్తరాన ఉన్న బాల్కన్ ప్రాంతంలో పురాణాలను గానం చేసే పద్ధతి ఆధునిక యుగంలో కూడా కొనసాగుతూ ఉండేది. ఆ విధంగా సంప్రదాయరీతిలో పాడుతున్న వ్యక్తి చుట్టూ శ్రోతలు చేరి కూర్చుని తమకు పరిచితమైన పురాణగాథలని తమకుపరిచితమైన పద్ధతిలో వినబడే పాటల ద్వారా ఆస్వాదిస్తారు. వీటిలో ఒక్కొక్క ప్రదేశానికీ సంబంధించిన సంప్రదాయాలుండేవి. అలాగే అంత్యక్రియల వంటి సందర్భాలకు తగిన పద్ధతిలో గానం జరిగేది. ఇటువంటి రకరకాల పాటలనూ. గాథలనూ కూర్చే సంప్రదాయాలుకూడా తరతరా లుగా అందించబడేవి. వీటి ఇతివృత్తాల నిర్మాణమూ, కథనరీతులూ వేటికవిగా వివిధ సంప్రదాయ పద్ధతుల్లో ఉండేవి. కొన్ని మామూలు సంఘటనల వర్ణనలైతే మరికొన్ని గంభీరంగానూ, లోతైన అర్థాలు కలిగినవిగానూ వినిపించబడేవి. ప్రాచుర్యం పొందుతున్న కొద్దీ శ్రోతలను ఆకట్టుకునే విధంగా వీటిలో సాహిత్యపు సొగసులూ, కవిత్వపు అందాలూ చోటుచేసుకున్నాయి.

ప్రఖ్యాత గ్రీక్ కవి హోమర్ క్రీ.పూ. ఎనిమిదో శతాబ్దంలో ఇలియడ్, ఒడిసీ మొదలైన గొప్ప పురాణాలను రచించాడు. అప్పటికే నాలుగు వందల సంవత్సరాలకు పూర్వం జరిగిన కాంస్య యుగపు సంఘటనలను అతను గ్రంథస్థం చేసినట్టుగా చెపుతారు. ఆనాడు టర్కీలోని ట్రోయ్ నగరాన్ని గ్రీక్ సేనలు పదేళ్లపాటు ముట్టడించి నాశనం చేసిన వైనం, అందులో ముఖ్య పాత్రధారి అయిన ఒడీసియస్ అనే గ్రీక్ వీరుడు మళ్లీ స్వదేశానికి చేరుకొవటానికి పదేళ్ల పాటు పడిన కష్టాలూ అన్నీ ఈ పురాణాల్లో లభిస్తాయి. ఈ గాథలను శతాబ్దాలపాటు గాయకులు పాటలు కట్టి పాడి వినిపించేవారనీ, అవి వినడం వల్లనే వాటి గురించి హోమర్ రాయగలిగాడనీ అంటారు. హోమర్ కూడా గొప్ప గాయకుడే.

ఆ రోజుల్లో పురవీథుల్లోనైనా, రాజాస్థానాల్లోనైనా శ్రోతల ఎదుట ప్రచీనకాలపు వీరుల, వీరాంగనల గురించిన గాథలను పాడి వినిపించడం ఆచారంగా ఉండేది. ఇటువంటి రచనల్లో నిజంగా జరిగినది ఏమిటో, గాథలుగా వర్ణించినవారు స్వకపోల కల్పితంగా చేర్చినది ఎంతో చెప్పడం కష్టం. ప్రేక్షకుల ఎదుట గానం చేస్తున్నవారు చిలవలూ, పలవలూ కల్పించి, ఉన్నదాన్ని మరికాస్త జనరంజకంగా చెయ్యడానికి ప్రయత్నించి ఉండవచ్చు. గట్టి సాక్ష్యాధారాలేవీ లేని పరిస్థితిలో కొన్ని తరాలపాటు మార్పులూ చేర్పులూ సంతరించుకుంటూ అందివచ్చిన ఈ వివరాలకు లిఖితరూపాన్ని ఇస్తున్నప్పుడు నిజనిర్ధారణకై కవులు చెయ్యగలిగినది ఏమీ ఉండకపోవచ్చు. మన పురాణాల్లో కూడా తరుచుగా కనబడే ఈ రకపు అద్భుతరసం, అతిశయోక్తులూ, అభూత కల్పనలూ వాటిలోని వాస్తవికతను వెనక్కి నెట్టినప్పటికీ, శ్రోతల ఊహాశక్తిని ప్రభావితం చేశాయి. అపోహలనూ, మూఢనమ్మకాలనూ కూడా పెంచాయి.

అయితే పుస్తకాలూ, గ్రంథాలూ అవతరించని కాలంలో ప్రాచుర్యంలో ఉండిన మౌఖిక సంప్రదాయానికి కొంత ప్రత్యేకత ఉంది. ప్రాచీనకాలపు చరిత్రను గురించిన వివరాలు లభ్యమయ్యేది అటువంటి "పుక్కిటి" పురాణాల్లోనే. ఎందుకంటే ప్రతిచోటా పురాతత్వ అవశేషాలూ, రాళ్ళమీద చెక్కిన శాసనాలూ దొరకవు. అలాంటప్పుడు జరిగిపోయిన విషయాల గురించిన వివరాల కోసం ఆదిమ సంప్రదాయాల్లో కూడా వెతుక్కోవాలి. ఉదాహరణకు ఉత్తర అమెరికాలోని తొలి మానవుల చరిత్రను గురించి మనకు తెలిసినది చాలా తక్కువ. అయితే కొన్ని ఆధారాలు ఆదిమ ఇండియన్ తెగలు ఈనాటికీ చెప్పకునే గాథల్లో కనిపిస్తున్నాయి. ఆఫ్రికా ఖండంలో నాగరికత ఏనాడూ ఉండేది కాదనడం పొరపాటని ఇటీవలి పరిశీలకులు అనుకుంటున్నారు. ఎందుకంటే ఇటువంటి గాథల ఆధారంగా అక్కడ కూడా ప్రాచీన రాజవంశాల వివరాలున్నట్టుగా తెలుస్తోంది.

ఒక వంక ఆదిమజాతులన్నీ ఈ గాథలని పూర్తిగా నిజమని నమ్ముతూ అదే నిజమైన చరిత్ర అని భావిస్తూ ఉంటే సంప్రదాయరీతుల్లో అధ్యయనం చేసే చరిత్రకారులు మాత్రం ఇటువంటి సాక్ష్యాధారాలను కొట్టిపారేస్తూ ఉంటారు. అలా కాకుండా ప్రతి విషయానికి కేవలం లిఖితరూపంలో దొరికేసాక్ష్యాల మీదనే ఆధారపడక, పురాణగాథలుగా చలామణీ అవుతున్న సంప్రదాయాల్లోని ఆధారాలను కూడా పరిగణించడం తప్పులేదన్న భావన బలపడుతోంది. పురాతత్వ పరిశోధకులకు ఇతరత్రా లభిస్తున్న సాక్ష్యాలకు ఈ వివరాలు తోడైనట్టుగా కనిపిస్తోంది. వీటిలో నమ్మదగినవి ఏమిటో పరిశీలకులు విశ్లేషిస్తున్నారు. మొత్తంమీద ఒకే రకమైన మాటల్లో రాసిపెట్టినవాటికీ, కేవలం నోటితో పలికినవాటికీ తేడాఉంటుందని అనుకోవడం ఎంతవరకూ సమంజసమో చెప్పడం కష్టమే. ◆

*ఆంధ్రప్రదేశ్‌లో సాంఘిక రంగ అభివృద్ధికి సంబంధించిన ఐదు మౌలిక సమస్యలను చర్చిస్తున్నారు*

**ఎస్. మహేంద్ర దేవ్**

# ఆంధ్రప్రదేశ్‌లో సమ్మిళిత అభివృద్ధి

*(... గత సంచిక తరువాయి)*

## ప్రాంతీయ అసమానతలు

సమ్మిళిత అభివృద్ధిలో ప్రధానాంశాలలో ఒకటి ప్రాంతీయ అసమానతల తగ్గింపు. రాష్ట్రంలో ప్రతి జిల్లాలోను స్థానిక ఉత్పత్తి ఎంత ఉందో రాష్ట్ర అర్థ గణాంక శాఖ ప్రకటించింది. ఈ గణాంకాలు 1993-94 నుంచి 2003-04 కాలానికి సంబంధించి లభిస్తున్నాయి. జిల్లా స్థానిక ఉత్పత్తిలోను, తలసరి జిల్లా స్థానిక ఉత్పత్తిలోను వృద్ధి రేట్లు పక్కన పట్టికలో ఇచ్చాం. దాన్ని బట్టి తెలంగాణలో రంగారెడ్డి, నిజామాబాద్, ఖమ్మం, హైదరాబాద్, మహబూబ్‌నగర్, వరంగల్, మెదక్ అనే ఏడు జిల్లాలు, ఉత్తర కోస్తాలో విశాఖపట్నం, శ్రీకాకుళం అనే రెండు జిల్లాలు రాష్ట్ర సగటు వృద్ధి రేటు కన్న ఎక్కువ వృద్ధి రేటు నమోదు చేశాయి. మరొకపక్క దక్షిణ కోస్తాలోని అన్ని జిల్లాలు, రాయలసీమలోని అన్ని జిల్లాలు, తెలంగాణలోని మూడు జిల్లాలు ఉత్తర కోస్తాలోని ఒక్క జిల్లా రాష్ట్ర సగటు రేటు కన్న తక్కువ వృద్ధిని నమోదు చేశాయి.

తలసరి ఆదాయం ప్రమాణాన్ని చూసినప్పుడు అతి పేదవైన నాలుగు జిల్లాలకు అతి సంపన్నమైన నాలుగు జిల్లాలకు మధ్య తేడా 1993-94 నుంచి 2003-04 మధ్య పెరిగిపోయింది.

తలసరి ఆదాయ స్థాయి తక్కువ ఉండడానికి, జిల్లా స్థానిక ఉత్పత్తి వృద్ధి రేటు, తలసరి జిల్లా స్థానిక ఉత్పత్తి వృద్ధి రేటుకు మధ్య సంబంధం ఏమన్నా ఉన్నదా. కొన్ని జిల్లాలో వృద్ధి రేట్లు ఎక్కువగా ఉండడానికి అక్కడి పునాది చిన్నది కావడం కారణం కావచ్చు. అయినా తలసరి ఆదాయాన్ని పరిగణనలోకి తీసుకుంటే రాష్ట్ర వృద్ధి రేటు కన్న ఎక్కువ వృద్ధి రేటును నమోదు చేసుకున్న తొమ్మిది జిల్లాలో మహబూబ్‌నగర్, నిజామాబాద్, వరంగల్, శ్రీకాకుళంలలో మాత్రమే పునాది తక్కువగా ఉంది.

అయితే ఈ పెరుగుదల స్వభావం ఏమిటనేది కీలకమైన అంశం. తెలంగాణలోని కొన్ని జిల్లాలు ఎక్కువ వృద్ధి రేట్లను చూపుతూ ఉండవచ్చు. కాని, ఆ వృద్ధి స్వభావం సరైనదేనని చెప్పలేము. ఆ ప్రాంతంలో సమ్మిళిత వృద్ధి జరుగుతున్నదని చెప్పలేము. తెలంగాణలోనూ, ఇతర ప్రాంతాల లోనూ ఈ వృద్ధి ప్రభావాన్ని అర్థం చేసుకోవడానికి మరింత పరిశోధన అవసరం. అట్లాగే ఈ ప్రాంతాలలో సామాజిక అభివృద్ధిలో గణనీయమైన వ్యత్యాసాలు ఉన్నాయి.

జిల్లా స్థానిక ఉత్పత్తి వృద్ధిలో కొన్ని ఆమోదయోగ్యమైన ధోరణులు కనబడుతున్నప్పటికీ, రాష్ట్రంలో అభివృద్ధి స్థాయిలో ప్రాంతీయ అసమానతలు ఇంకా ప్రముఖంగానే ఉన్నాయి. ఉదాహరణకు దక్షిణ కోస్తాలో రక్షిత సాగునీటి సదుపాయాలు ఎక్కువగా ఉన్నందువల్ల ఆ ప్రాంతం హెక్టారుకు సగటు వ్యవసాయోత్పత్తి విషయంలో అగ్రభాగాన నిలుస్తుంది. ఉత్తర తెలంగాణ, ఉత్తర కోస్తా దాని తరువాతి స్థానంలోనే ఉంటాయి. రాయలసీమ, దక్షిణ తెలంగాణ అట్టడుగున ఉంటాయి. ఈ రెండు ప్రాంతాలలోనూ సరైన సాగునీటి సౌకర్యాలు లేకపోవడం, తక్కువ వర్షపాతం, నమ్మకంలేని వర్షపాతం అందుకు కారణాలు. అంతేకాదు తెలంగాణలోనూ, రాయలసీమలోనూ బావుల ద్వారా సాగునీటి సౌకర్యం చాలా ఎక్కువగా ఉంది. అందువల్ల ఆ నీటిని తోడడానికి ఎక్కువ విద్యుత్ వినియోగం, వ్యయం జరుగుతున్నాయి. అంతే గాక బావుల మీద ఆధారపడడం, వాతావరణ ప్రతికూల ప్రభావాలకు తాగునీటి కొరతకు కూడా దారితీస్తోంది.

హైదరాబాద్ మినహా తెలంగాణలోనూ, ఉత్తర కోస్తాలోనూ అక్షరాస్యత దక్షిణ కోస్తా కన్న చాలా తక్కువగా ఉంది. మహిళల అక్షరాస్యత తెలంగాణ జిల్లాలో అట్టడుగున ఉంది. రంగారెడ్డి, హైదరాబాద్ జిల్లాలు మినహాయిస్తే మిగిలిన తెలంగాణ జిల్లాలలో మహిళల అక్షరాస్యత రాష్ట్ర సగటు కన్న తక్కువగా ఉంది. 2000-01 లో ప్రాథమిక విద్యలో చదువు మానుతున్న వారి నిష్పత్తి తెలంగాణలో బాలురలోనూ, బాలికలలోనూ అతి ఎక్కువగా ఉంది. షెడ్యూల్డ్ కులాలకు, షెడ్యూల్డ్ తెగలకు చెందినవారిలో ఇది మరింతి ఎక్కువగా ఉంది. ఆరోగ్య సేవల విషయంలో ప్రైవేట్ రంగ ఆరోగ్య సేవలు అభివృద్ధి చెందిన జిల్లాలోనే కేంద్రీకృతమై ఉన్నాయి. అంటే వైద్య ఆరోగ్య రంగాలలో ప్రైవేటీకరణను ప్రోత్సహించే ప్రభుత్వ విధానం అభివృద్ధి చెందిన జిల్లాలకే లాభం చేకూర్చిందన్నమాట. ప్రాంతీయ అసమానతలను మరింతగా పెంచిందన్నమాట. అలాగే శిశు మరణాల నిష్పత్తి ఉత్తర కోస్తాలో, రాయలసీమలో, దక్షిణ తెలంగాణలో చాలా ఎక్కువగా ఉంది.

ఇక ఆంధ్రప్రదేశ్‌లో సహస్రాబ్ది అభివృద్ధి లక్ష్యాల సాధనలో

ప్రాంతాలవారీగా విడదీసినప్పుడు పరిస్థితి ఏమిటో చూద్దాం. ఆంధ్రప్రదేశ్ ఈ లక్ష్యాలను సాధించగలదా అనే విషయంలో పెద్దగా అవగాహన రూపొంద లేదు. ఆంధ్రప్రదేశ్‌లో ఈ లక్ష్యాల సాధన గురించి ఇటీవలనే సెంటర్ ఫర్ ఎకనామిక్ అండ్ సోషల్ స్టడీస్ ఒక అధ్యయనం చేసి ప్రభుత్వానికి నివేదిక సమర్పించింది. ఈ అధ్యయనం రాష్ట్ర స్థాయిలో గ్రామీణ ప్రాంతాలలో, పట్టణ ప్రాంతాలలో అభివృద్ధి గురించి ప్రాంతాల మధ్య, సాంఘిక ఆర్థిక బృందాల మధ్య అసమానతల గురించి పరిశీలించడం జరిగింది. ఈ అధ్యయనంలో పేదరికం, విద్య, ఆరోగ్యం, స్త్రీ - పురుష సమానత్వం మొదలైన పద్నాలుగు సూచికలను పరిగణనలోకి తీసుకోవడం జరిగింది. ఈ ముఖ్యమైన సూచికలు ఆంధ్రప్రదేశ్ సహస్రాబ్ది అభివృద్ధి లక్ష్యాలను సాధించగలదా అని ఇక్కడ పరీక్షిద్దాం. ఈ లక్ష్యాల సాధనలో ఇమిడి ఉన్న సవాళ్లు ఏమిటో గుర్తించడానికి అసలు ఆ లక్ష్యసాధన కార్యక్రమం సరైనదారిలో సాగుతున్నదా లేదా తెలుసుకోవడం అవసరం. ప్రాంతాల మధ్య, సామాజికబృందాల మధ్య విపరీతమైన వ్యత్యాసాలు ఉన్నాయి. ఈ అసమానతలలో వెనుకబడిన ప్రాంతాల గురించి, బృందాల గురించి శ్రద్ధ తీసుకోకపోతే లక్ష్యాలను సాధించడం అసాధ్యం. గ్రామాలలో పేదరికం రాయలసీమలో నలభై ఏడు శాతం నుంచి కోస్తాలో పద్దెనిమిది శాతం వరకు విభిన్నంగా ఉంది. అదే విధంగా ఉండవలసిన బరువు కన్న తక్కువ బరువు ఉన్న పిల్లలు రాయలసీమలో యాభై ఆరు శాతం ఉండగా, కోస్తాలో ముప్ఫై ఎనిమిది శాతం ఉన్నారు. సామాజిక బృందాలను చూసినప్పుడు పేదరికం నిష్పత్తి షెడ్యూల్డ్ తెగలలో నలభై మూడు శాతం ఉండగా ఇతర కులాలో పదమూడు శాతం ఉంది. తక్కువ బరువు ఉన్న పిల్లలు షెడ్యూల్డ్ కులాలలో నలభై ఆరు శాతం ఉండగా ఇతరులలో ముప్ఫై నాలుగు శాతం ఉన్నారు. శిశుమరణాల నిష్పత్తి షెడ్యూల్డ్ కులాలో 93 ఉండగా ఇతర కులాలో 64 ఉంది.

| జిల్లా జాతీయ ఉత్పత్తి పెరుగుదల రేట్లు 1993-94 నుంచి 2003-04 | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | జిల్లా జాతీయ ఉత్పత్తి పెరుగుదల (శాతం) 1993-2004 | పెరుగుదల రేటును బట్టి స్థాయి 1993-2004 | తలసరి ఉత్పత్తి పెరుగుదల రేటు 1993-2004 | తలసరి ఉత్పత్తి (రు.) 1993-94 | తలసరి ఉత్పత్తిని బట్టి స్థాయి (రు.) 1993-94 | తలసరి ఉత్పత్తి (రు.) 2003-04 |
| హైదరాబాద్ | 8.4 | 1 | 6.4 | 906 | 8 | 1758 |
| విశాఖపట్నం | 7.9 | 2 | 6.3 | 962 | 3 | 2026 |
| రంగారెడ్డి | 7.4 | 3 | 4.0 | 1109 | 1 | 1667 |
| మహబూబ్‌నగర్ | 7.2 | 4 | 5.9 | 538 | 23 | 976 |
| వరంగర్ | 6.6 | 5 | 5.2 | 611 | 23 | 1045 |
| మెదక్ | 6.0 | 6 | 4.4 | 1068 | 2 | 1636 |
| ఖమ్మం | 6.0 | 7 | 4.5 | 909 | 7 | 1505 |
| నిజామాబాద్ | 6.0 | 8 | 4.6 | 707 | 19 | 1137 |
| శ్రీకాకుళం | 6.0 | 9 | 5.1 | 550 | 22 | 969 |
| ఆంధ్రప్రదేశ్ | 5.7 | - | 4.3 | 840 | - | 1300 |
| తూర్పు గోదావరి | 5.4 | 10 | 4.6 | 887 | 9 | 1422 |
| పశ్చిమ గోదావరి | 5.4 | 11 | 4.6 | 883 | 10 | 1427 |
| ప్రకాశం | 5.4 | 12 | 4.4 | 836 | 14 | 1220 |
| కరీంనగర్ | 5.3 | 13 | 3.9 | 816 | 16 | 1248 |
| అదిలాబాద్ | 5.3 | 14 | 3.5 | 821 | 15 | 1094 |
| చిత్తూర్ | 5.0 | 15 | 3.6 | 872 | 11 | 1179 |
| క్రిష్ణ | 4.9 | 16 | 3.7 | 944 | 5 | 1360 |
| నెల్లూర్ | 4.8 | 17 | 3.7 | 947 | 4 | 1280 |
| నల్గొండ | 4.6 | 18 | 3.3 | 714 | 18 | 1028 |
| కడప | 4.4 | 19 | 3.0 | 838 | 13 | 1050 |
| కర్నూల్ | 4.4 | 20 | 2.7 | 811 | 17 | 1057 |
| గుంటూర్ | 4.1 | 21 | 3.3 | 936 | 6 | 1317 |
| విజయనగరం | 3.9 | 22 | 3.3 | 635 | 20 | 904 |
| అనంతపురం | 3.8 | 23 | 2.4 | 847 | 12 | 1047 |

ఇటువంటి వ్యత్యాసాలు ఉండగా సహస్రాబ్ది అభివృద్ధి లక్ష్యాలను సాధించడం ఏ ప్రాంతాలకు, ఏ సామాజిక వర్గాలకు, ఏ వృత్తి సమూహాలకు వీలౌతుంది.

ఆదాయాన్ని బట్టి పేదరికాన్ని అంచనా వేస్తే అన్ని ప్రాంతాలు, అన్ని సామాజిక వర్గాలు, అన్ని వృత్తి సమూహాలు సరైన దారిలోనే ఉన్నాయి. ప్రస్తుతం ఉన్న వృద్ధిరేట్ల ప్రకారం సహస్రాబ్ది అభివృద్ధి లక్ష్యాలను సాధించడం సాధ్యమే. అయితే 2015 నాటికి కూడ రాయలసీమలో పదమూడు శాతం మంది, తెలంగాణలో ఐదు శాతం మంది పేదలుగానే మిగిలిపోక తప్పదు. అప్పటికి రాష్ట్రంలో ఉండే నలభై ఐదు లక్షల మంది గ్రామీణ పేదలలో 80 శాతం మంది ఈ రెండు ప్రాంతాలలోనే ఉంటారు. పిల్లలలో పోషకాహార లోపం చూస్తే

దాన్ని తగ్గించే లక్ష్యాన్ని ఏ ప్రాంతం గాని, ఏ సామాజికవర్గం గాని, ఏ వృత్తి సమూహం గాని సాధించజాలదని తేలుతోంది. ఈ లక్ష్యాన్ని సాధించే దిశలో ఆంధ్రప్రదేశ్ పయనం చాలా మందకొడిగా ఉంది.

ఇక విద్యారంగం విషయానికొస్తే సహస్రాబ్ది అభివృద్ధి లక్ష్యం 2015 నాటికల్లా పిల్లలందరిని పాఠశాలలో ఉండేలా చూడడం, నూటికి నూరు మంది పిల్లలు ప్రాథమిక విద్యలో చేరేలా చూడడం, ఒకటో తరగతిలో చేరిన పిల్లలు ఐదవ తరగతి దాకా కొనసాగేలా చూడడం. కాని గ్రామీణ ఆంధ్రప్రదేశ్‌లో, తెలంగాణలో, రాయలసీమలో వ్యవసాయ కూలీలలో, షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగలు, ఇతర వెనుకబడిన కులాలలో ఈ లక్ష్యాన్ని సాధించడం అసాధ్యం. రాష్ట్రంలో ఏ ఒక్క సమూహం కూడా నూటికి నూరు మంది పిల్లలు చదువు మానకుండా ఉండడాన్ని సాధించబోవడం లేదు. 2015 నాటికి కూడా వ్యత్యాసాలు ఎంత పెద్ద ఎత్తున ఉండబోతున్నాయంటే షెడ్యూల్డ్ తెగల పిల్లలలో చదువు మానేవారి సంఖ్య 53 శాతం ఉండగా, వ్యవసాయదారులలో 18 శాతంగా ఉంటుంది. ఒకసారి బడిలో చేరిన పిల్లలు చదువు కొనసాగించేలా చూడడం ఒక పెద్ద సవాలే. అదే విధంగా పట్టణ ప్రాంతాల్లో మినహా ఇతర అన్ని చోట్ల విద్యారంగంలో బాలలకు బాలికలకు మధ్య సమానత్వాన్ని సాధించడం అనే లక్ష్యాన్ని ఏ సామాజిక బృందమూ సాధించదు.

శిశు మరణాల సంఖ్యలో తగ్గుదల గ్రామీణ ఆంధ్రప్రదేశ్‌లో గణనీయంగానే సాధించగలిగాము. అది 1980లలో సాలీనా 2.2 శాతం ఉన్నదల్లా '90లలో ఒక శాతం కన్న తక్కువకు తగ్గింది. కాని ఈ ధోరణే కొనసాగితే శిశు మరణాల రేటు మూడింట రెండు వంతులుగా తగ్గించాలనే లక్ష్యం నెరవేరదు. 2015 నాటికి శిశు మరణాల సంఖ్యను తగ్గించడంలో ఆశించిన దానికి సాధించగల దానికి మధ్య చాలా తేడా ఉండబోతుంది. ఈ తేడా షెడ్యూల్డ్ తెగలలో 21 శాతం, షెడ్యూల్డ్ కులాలలో 24 శాతం, వ్యవసాయ కూలీలలో 18 శాతం ఉంటుంది. ప్రసవించిన తల్లుల ఆరోగ్య విషయంలో సాధారణంగా సుఖ ప్రసవాల నిష్పత్తిని ఒక సూచికగా తీసుకుంటారు. అయితే ఇప్పటికి ఉన్న అంచనాల ప్రకారం పట్టణ ప్రాంతాలలో మినహా మొత్తం రాష్ట్రంలో అన్ని సామాజిక బృందాలలో నూటికి నూరు సుఖ ప్రసవాలు సాధించడం అసాధ్యం.

ఇక రక్షిత మంచినీరు, పారిశుధ్యం విషయాలకు వస్తే తగిన మంచినీటి సౌకర్యం లేని, ప్రాథమిక విద్యావకాశాలు వేని జనాభాను సగానికి సగం తగ్గించాలనే లక్ష్యం ఉంది. అయితే మంచినీటికి సంబంధించిన గణాంకాలు సక్రమంగా లేవు. ఈ గణాంకాలు ఏ వనరు నుంచి మంచినీరు దొరుకుతుందో చెపుతాయి గాని, ఆ నీటి నాణ్యత గురించి చెప్పవు. ఆ వనరుల విషయం చూస్తే ప్రభుత్వ రంగంలో గాని, ప్రైవేట్ రంగంలో గాని ఉన్న కుళాయిలు బోర్‌బావులను బట్టి మొత్తం జనాభాలో నాలుగింట మూడువంతుల మందికి మంచినీరు అందుబాటులో ఉంది. అన్ని ప్రాంతాలు, అన్ని సామాజిక వర్గాలు, అన్ని వృత్తి సమూహాలు లక్ష్యాన్ని చేరుకుంటాయి. గ్రామీణ ఆంధ్రప్రదేశ్ లోని ఇప్పటివరకు మంచినీరు అందుబాటులో లేని జనాభా మొత్తానికి అది అందుబాటులోకి వస్తుంది. అయినా గ్రామీణ జనాభాలో నాలుగోవంతు మందికి మంచినీరు అందుబాటులో ఉండదు. పారిశుధ్యం విషయంలో ఆంధ్రప్రదేశ్ సగటు స్థాయి చూస్తే లక్ష్యాన్ని సాధించినట్టే కనబడుతుంది. కాని, విభిన్న బృందాల మధ్య, ప్రాంతాల మధ్య వ్యత్యాసాలు కొనసాగుతున్నాయి. గ్రామీణ జనాభాలోని ఆరు కోట్ల ముప్ఫై లక్షల మందిలో సగం మందికి ఎటువంటి పారిశుధ్య సౌకర్యాలు లేవు. ఈ రంగంలో అభివృద్ధి షెడ్యూల్డ్ తెగల కుటుంబాలలో చాలా మందకొడిగా ఉంది. వారిలో 90 శాతం మంది 2015 నాటికి కూడా ఎటువంటి సౌకర్యాలు లేకుండానే ఉండిపోతారు.

ఈ అధ్యయనంలో మేము పద్నాలుగు సూచికలను పరిశీలించాం. అయితే ఆ పద్నాలుగు సూచికలలో పది సూచికల విషయంలో ఆంధ్రప్రదేశ్ సహస్రాబ్ది అభివృద్ధి లక్ష్యాలను సాధించజాలదని గుర్తించడం విచారకరంగా ఉంటుంది. అంటే, పేదరికం, బాలబాలికల పాఠశాల ప్రవేశం, మంచినీటి సౌకర్యం విషయంలో మినహా మరే ఇతర రంగంలోను ఆంధ్రప్రదేశ్ ఆ లక్ష్యాలను సాధించజాలదు. ప్రస్తుత అభివృద్ధి స్థాయిని బట్టి విద్యా, ఆరోగ్య, పారిశుధ్య కీలక రంగాలలో ఆంధ్రప్రదేశ్ వెనుకబడే ఉంటుంది. అలాగే ఈ పద్నాలుగు సూచికలలో తెలంగాణ పదకొండిటిని, కోస్తా తొమ్మిదిటిని షెడూల్డ్ తెగలు పన్నెండిటిని షెడ్యూల్డ్ కులాలు పదకొండిటిని, వ్యవసాయ కూలీలు పన్నెండిటిని, సాధించడం విఫలమౌతారు. అలాగే గ్రామాలకు పట్టణాలకు మధ్య కూడా చెప్పుకో దగిన వ్యత్యాసాలు మిగిలిపోతాయి. గ్రామీణ ప్రాంతాలు పద్నాలుగు సూచికలలో పదకొండు సూచికలు సాధించలేకపోగా, పట్టణ ప్రాంతాలు కేవలం నాలుగు సూచికలలో మాత్రమే విఫలమౌతాయి. ఈ ఫలితాలు చూస్తే ఆంధ్రప్రదేశ్ లక్ష్యాల సాధనలో తీవ్రమైన ఆందోళన కలుగుతుంది.

పై విశ్లేషణ ప్రకారం రాష్ట్ర ఆర్థిక, సామాజిక అభివృద్ధిలో కొట్టవచ్చినట్టు కనిపించే ప్రాంతీయ అసమానతలు ఉన్నాయని అర్థమౌతుంది. అభివృద్ధి స్థాయిలలో ప్రాంతీయ అసమానతలను తగ్గించడంలో, భౌతిక, సామాజిక, మౌలిక సౌకర్యాల కల్పనలో ప్రభుత్వ రంగపు మలుపు ఉపయోగకరంగా ఉంటుందని ఆంధ్రప్రదేశ్ అనుభవం తెలియజేస్తుంది. రాష్ట్రంలో భారీ, మధ్యతరహా నీటిపారుదల ప్రాజెక్టుల ద్వారా కల్పించగలిగిన నీటిపారుదల సౌకర్యాలకు, ఇప్పటివరకు ప్రభుత్వ నిధులతో కల్పించిన సదుపాయాలకు మధ్య తేడా చాలా ఎక్కువగా ఉంది. అది రాయలసీమలోని, తెలంగాణలోని కరువు పీడిత ప్రాంతాలలో చాలా ఎక్కువగా ఉంది. ప్రభుత్వ నిధులతో ఇప్పుడు నిర్మాణంలో ఉన్న పథకాలను త్వతరితగతిన పూర్తి చేయడం, మిగిలిపోయిన పథకాలను చేపట్టడం, నీటి వినియోగదారుల సంఘాలకు భాగస్వామ్యం కల్పించి చెరువులను బాగుచేయడం, వాటర్ షెడ్ పథకాలు అభివృద్ధిచేయడం మొదలైన పనులు భవిష్యత్తు పట్ల ఆశా కలిగిస్తాయి. ఈ ప్రాంతాలలో ఇతోధిక అభివృద్ధికి కరువు బారినపడే ప్రజల ఇబ్బందుల తొలగించడానికి దారితీస్తాయి. ఇప్పటివరకు తక్కువ అభివృద్ధి చెందిన ప్రాంతాలపై శ్రద్ధపెట్టి ఆరోగ్య, విద్యా రంగాల మీద ప్రభుత్వ నిధులను వెచ్చించవలసి ఉంది.

*(మిగతా వచ్చే సంచికలో...)*

◆

**చెంచుల జీవితంపై చేపట్టిన అధ్యయనం వారి నిజ జీవిత స్థితిగతుల వివరణగానూ, వాటిమీద ఆధారపడి సాగే అన్వేషణగానూ ముందుకు సాగుతుందంటూ చెంచుల జీవన స్థితిగుతుల్ని మన ముందుంచుతున్నారు పాణి**

# చెంచుల జీవన స్థితిగతులు - సామాజిక మూలాల అన్వేషణ

*(.. గత సంచిక తరువాయి)*

### 7. పెద్ద మనిషి

మామూలుగా ఆదివాసీ తెగల సాంస్కృతిక, నైతిక జీవితంలో అనేక విధినిషేధాలు ఉంటాయి. ఇవి సంప్రదాయకంగా, అనుల్లంఘనీయంగా కొనసాగుతూ వస్తాయి. వీటి విస్తృతి, తీవ్రత ఆ దశలో తెగ మేధోవికాసానికి సంకేతం. తెగ అంతర్గతంగా ఉండే సామాజిక సంబంధాల స్థాయిని బట్టే ఇలాంటివి ఏర్పడుతూ ఉంటాయి. సామాజిక సంబంధాలు బలంగా ఉంటే వాటిని అర్థంచేసుకోవడానికి, పరిష్కరించుకోవడానికి సాంస్కృతికస్థాయి రూపొందుతుంది. కనీసం వైరుధ్యాలు తలెత్తకుండా ఉండేందుకు, సజావుగా జీవితం కొనసాగేందుకు ఆచార వ్యవహారాలు, సంస్కృతి దోహదపడుతాయి. దైవికమైన విశ్వాసాలు ప్రధానంగా ప్రకృతిలో ఉండే వైరుధ్యాల నుండి జనించినవే.

ఈ ఆవరణ చెంచులకు తక్కువ. కనీసం అన్నదమ్ముల మధ్య కూడా దృఢమైన సంబంధాలు లేకపోవడం వల్ల గుంపుతత్వం పలుచగా ఉండిపోయింది. ఆహార సేకరణలోని ఇతరుల అవసరం ఐచ్ఛికమైనదే కావడం వల్ల అందరూ కలిసి పని చేసే సందర్భాలు , వాటినుండి ఏర్పడే వ్యవస్థలు చెంచుల పరిణామంలో ఎదురవ్వలేదు. ఉదాహరణకు 'పెద్దమనిషి' అన్ని గూడాల్లో ఉంటాడు. అతని పాత్రను ఒక వ్యవస్థగా పరిగణించవచ్చు. కాని పెద్దమనిషి అధికారం మరీ నామమాత్రం. పెళ్లిళ్లప్పుడు, అంతా సజావుగా ఉన్నప్పుడు ప్రేక్షక సాక్షిగా వ్యవహరించడం తప్ప వివాదాలప్పుడు అతను చేయబోయే నిర్ణయాలూ ఉండవు. చేసిన నిర్ణయాలకు తెగ విధిగా కట్టుబడి ఉండే అలవాటూ లేదు. బహుశా రెండు గూడాల మధ్య గొడవలు వచ్చినప్పుడు ప్రాతినిధ్యపాత్ర ఒక మేరకు చెల్లుబాటు అవుతుంది.

పెద్ద మనిషి ఒక వ్యవస్థకు ప్రతీక. ఇది ప్రారంభ దశలో కాకపోయినా, మధ్యలో ఏర్పడి వుండవచ్చు. సాధారణంగా తెగ జీవితంలో మిగతా వారికన్నా ప్రకృతి గురించి ఎక్కువ జ్ఞానం ఉన్నవారిని పెద్ద మనిషిగా గుర్తిస్తారు. లేదా తెగ సంపాదించుకున్న జ్ఞానానికి సంకేతాత్మకంగా, అధికారసహితంగా రూపొందుతుంది. చెంచుల నిజ జీవితంలో పెద్ద మనిషికి అలాంటి అధికారం దొరకలేదు. తెగ సామాజిక, వ్యక్తిగత జీవితంలో 'క్రమబద్ధం' కావలసిన నియమాలు ఏర్పడకపోవడం వల్ల, అలాంటి సామాజిక సంబంధాల నిర్మితిలోకి తెగ రాకపోవడంవల్ల పెద్దమనిషి స్థానం లాంఛనంగా మిగిలిపోయిందా? అనే ప్రశ్న ఎదురవుతుంది.

### 8. కుటుంబం

దీనికి భిన్నమైన, విస్తృతమైన పరిశీలనలకు చెంచుల కుటుంబ వ్యవస్థ అస్కారం యిస్తుంది. చెంచు తెగలో ఏకైక బలమైన నిర్మాణం కుటుంబమే. రెండు, మూడు శాతం ఉమ్మడి కుటుంబాలుంటే, మిగతా అన్నీ ప్రాథమిక కుటుంబాలే. భార్యాభర్త-పిల్లలు మాత్రమే కుటుంబం. పిల్లలకు పదహారు పదిహేడు ఏళ్లు రాగానే పెండ్లి చేస్తారు. అమ్మాయి అత్తవారింటికి కాపురానికి వస్తుంది.

కొడుక్కు పెండ్లి తలపెట్టగానే, లేదా పెండ్లికాగానే చేసే మొట్టమొదటి పని కొత్త జంట కోసం వేరే గుడిసె తయారుచేయడం. పెండ్లి కావడంతో తల్లిదండ్రులకు ఇక ఏ బాధ్యత ఉండదు. అసలు సంబంధం ఉండదా? అనేంతగా కొత్త జంట వేరే కుటుంబం అయిపోతుంది. ఎక్కువ పెండ్లిళ్లు మేనరికాలే. సగోత్రీకుల మధ్య పెండ్లిళ్లు జరగవు. పెళ్లి విషయంలో అబ్బాయి అమ్మాయిల అభీష్టాలపట్ల పెద్దలకు సాధారణంగా అభ్యంతరం ఉండదు. అయితే ఒకే ఇంటి పేరు గల అబ్బాయి అమ్మాయి యిష్టపడ్డట్టు తెలిసినా అగ్రహిస్తారు. తల్లిదండ్రులు ముసలివాళ్లయ్యాక వాళ్ల పోషణభారం పిల్లలు తీసుకోవాలనే అనవాయితీ లేదు. జంట ఉన్నంతవరకు వృద్ధాప్యంలో కూడా విడిగానే ఉంటారు.

కుటుంబంలో ఒకరికి పెళ్ళయ్యాక వేరుబడటంగురించి ఆరాతీస్తే చెంచులు విచిత్రమైన సమాధానం చెప్తారు. ఒకే గుడిసెలో వదిన మరుదులు తిరుగుతూ ఉంటే అన్నదమ్ముల మధ్య గొడవలు వస్తాయి అని. ఈ అనుమానం ఎక్కడిదాకా పోతుందంటే విడివిడిగా గుడిసెలు వేసుకోనేటప్పుడు కూడా అన్నదమ్ములు పక్కపక్కనే ఉండాలనుకోరు. అక్కడక్కడ విసిరేసినట్లుండే గుడిసెల్లో ఎక్కువగా బావబావమరుదుల కుటుంబాలే ఉంటాయి. స్త్రీల లైంగికత దృష్ట్యా చెంచులు అన్నదమ్ముల

సంబంధాలను సందేహాస్పదంగానూ, అభద్రతగానూ భావిస్తారు. బావబావమరుదుల సంబంధాలను మాత్రమే విశ్వాసంలోకి తీసుకుంటారు. దీనివల్ల చెంచులు సాధారణంగా బైటివాళ్లతో తమ సంబంధాలు బావబావమరుదుల సంబంధాలుగా ఉండాలనుకుంటారు కాబోలు, చెంచు మగవాళ్లు ఇతరులను 'బావా' అని పిలవడం పట్లనే మక్కువ చూపిస్తారు.

చెంచుల మధ్య జరిగే గొడవలకు ఎక్కువగా స్త్రీ-పురుష సంబంధాలు, వాటికి సంబంధించిన అపోహలే కారణం అవుతూ ఉంటాయి. వీటి గురించి చెంచులే కాదు, చుట్టుపక్కల గ్రామాల వాళ్లు కూడా అనేక కథనాలు, వాస్తవ ఘటనలు చెప్తుంటారు. చెంచులకు ఎంత 'సిగ్గరితనం' ఉంటుందో అంతగా కోపం ఉంటుంది. కోపం వల్ల ఎవరికైనా తార్కికత, విజ్ఞత కోల్పోవడం సహజమే. అయితే చెంచుల కోపదారితనంలో ఆదిమ లక్షణం కనిపిస్తుంది. ముఖ్యంగా స్త్రీ-పురుష సంబంధాలపట్ల కలిగే చిన్న అనుమానమైనా, ఉల్లంఘన అయినా క్షణాల్లో తీవ్ర ఘర్షణలకు దారితీస్తుంది. ఒక్కోసారి హత్యలకూ కారణం అవుతుంది. ఆ క్షణంలో తామేం చేస్తున్నదీ దాని పరిణామాలు ఎలా ఉండేదీ పట్టించుకోరు. తమ చర్యపట్ల ప్రభుత్వ యంత్రాగాలు ఎట్లా స్పందిస్తాయనే గమనం కూడా ఉండదు. రాజ్యం దృష్టిలో నేరంగా కనిపించబోయే విషయాలపట్ల కనీస స్పృహగాని అప్రమత్తతగాని కనిపించని తక్షణ తీవ్ర ప్రతిస్పందన వారి మేథోవికసనస్థాయిని సూచిస్తుంది. అట్లాగే 'సిగ్గరితనం' కూడా. పైకి చూడ్డానికి చెంచుల్లో సిగ్గరితనంగా కనిపించేదాన్ని కొత్త అనుభవం వల్ల కలిగే వ్యక్తీకరణ అనుకుంటే బాగుంటుంది. కొత్త మనుషులను, వస్తువులను చూసినపుడు కలిగే స్పందన అది. కొత్తవాటితో తమ సంబంధాన్ని వ్యక్తీకరించుకొనే పద్ధతి అది. అంటే కొత్త అనుభవంలోకి వెళ్లినపుడు కలిగే ఈ తరహా ప్రతిస్పందనను బట్టి చెంచుల్లో తమది కాని దాన్ని స్వీకరించడంలో ఉండే క్లిష్టమైన ప్రక్రియను అర్థం చేసుకోవచ్చు. బైటి స్థితిగతులపట్ల, ప్రభావాల పట్ల ఉండే ఈ ధోరణి చెంచుతెగలో అంతర్గత చలనాన్ని పరిశీలించడానికి ఒక ఆధారంగా గుర్తించవచ్చు.

చెంచుల్లోని దంపతీ కుటుంబ రూపం గురించి ఆలోచించాల్సి ఉంది. సమాజ పరిణామంలో కుటుంబం అటవిక దశలోని గుంపుపెళ్ళి, రక్తసంబంధీకుల మధ్య పెళ్ళి, గణవ్యవస్థ, ఆ తర్వాత పితృస్వామ్య కుటుంబంగా మారుతూ వచ్చింది. ఈ చరిత్రక్రమం ఆస్తిభావనతో ఎదుగుతూ వచ్చింది. గుంపు మనస్తత్వం నుండి వ్యక్తి స్వీయవికాసానికి ఈ పరిణామం దోహదం చేసిందనే అభిప్రాయం ఉన్నది. దంపతీ కుటుంబంలో సంపద మీద, పిల్లల మీద ఉమ్మడి యాజమాన్యం పోయి స్పష్టంగా వ్యక్తిగత హక్కు గుర్తింపులోకి వచ్చింది. ఆ వ్యక్తి పురుషుడు. ఆహారసేకరణ నుండి, వేటనుండి మానవజాతి సుదీర్ఘకాలంపాటు చేసిన ప్రయాణ ఫలితం, అనుభవసారం దంపతీ కుటుంబంలో కనిపిస్తాయి. 'నాగరిక' యుగానికి నాందిగా దంపతీ కుటుంబాన్ని భావిస్తారు.

ఈ దృష్ట్యా చెంచుల కుటుంబం నాగరిక రూపానికి చెందినది. ఆదివాసీ తెగల్లో చాలావరకు దంపతీకుటుంబమే ఉన్నది. కొన్ని తెగల్లో బహుభార్యత్వం కూడా ఉన్నది. కానీ చెంచుల్లో బహుభార్యత్వం లేదు. ఎక్కడయినా మినహాయింపుగా ఉండవచ్చు. అంతే, పితృస్వామ్యలక్షణాలు బలంగా కనిపిస్తాయి. చెంచు పురుషుల్లో పరస్త్రీ ఆలోచన దాదాపుగా ఉండదు. ఆమె భర్త చంపేస్తాడనే భయం ఉంటుంది. స్త్రీలకూ వివాహేతర సంబంధాల గురించి ఆలోచన ఉండదు. ఇంకోవైపు చూస్తే స్త్రీ – పురుష సంబంధాల్లో విధి నిషేధాలు ఉన్నాయంటే ఉల్లంఘనలూ ఉన్నట్లే. ఈ రెంటిని కలిపి చర్చించ వలసి ఉంటుంది. చెంచుల్లో భర్త చనిపోతే పిల్లలు ఉన్నా భార్యలేని పురుషుని వివాహమాడే సంప్రదాయం ఉన్నది. అన్న చనిపోతే అతని భార్యను వివాహం కాని తమ్ముడు పెళ్లాడే పద్ధతి ఉన్నది. దీనివల్ల కూడా అన్న తమ్ముడు సంబంధాలు అనుమానాస్పదం అయ్యాయి. పగటిపూట వేటకు వెళ్ళినప్పుడేగాక, ఎక్కడికి వెళ్లినాసరే భార్య వెనుక అనుసరించాల్సిందే. చంటి పిల్లలు ఉంటే భార్య చంకనేసుకొనే వెళ్తూ ఉంటుంది. నల్లమల పరిసరగ్రామాల్లో ఒకనానుడి వినిపిస్తుంటుంది. అస్తమానం పెళ్ళాన్ని వెంటేసుకొని తిరిగే మగవాణ్ణి 'చెంచోని మాదిరి పెళ్ళాన్ని ఎనకేసుకొని తిరుగుతాడు' అంటారు.

స్త్రీని భోగవస్తువుగా చూసే దృక్పథం చెంచుల్లో లేదుగాని ఆస్తిగా భావిస్తారని నమ్మవచ్చు. నాగరికత క్రమంలో సొంత ఆస్తిభావం, రూపం ఎలా ఎదుగుతూ వచ్చాయో మానవ, సామాజిక శాస్త్రవేత్తలు చాలా వివరించారు. గణ వ్యవస్థ ఏర్పడటంతో వారసత్వానికి సంబంధించిన అంశం చరిత్రరంగం మీదికి వచ్చింది. సామాజిక వ్యవస్థ ఎదుగుదలను, స్థితిని బట్టి ఆస్తిహక్కు- దానికి సంబంధించిన భావనల నియమాలు మారుతూ వచ్చాయి. ఆహారసేకరణ, వేట దశలో ఉన్న తెగ బతుకు తెరువు అన్వేషణలో ప్రకృతి నుండి సేకరించుకున్న ఆహారం, పరికరాలు, కొత్తగా రూపొందించుకున్న వస్తువులు జీవితంలో భాగమై ఉంటాయి. అవి తనవిగా, తన వారసత్వానికి సంక్రమించవలసినవిగా కాంక్షించడంలో సొంత ఆస్తి భావన తలెత్తి ఉంటుంది. అక్కడి నుండి చెంచుల ఆస్తి స్పృహ ఎలా మారుతూ వచ్చిందో, దానితోపాటు దంపతీ కుటుంబం ఎలా రూపొందిందో చెప్పడం కష్టం. ఈ క్రమంలో స్త్రీ లైంగికత గురించి వాళ్ల విశ్వాసాల్లోకి, ఆచారాల్లోకి ఎలాంటి భావాలు పోగుపడ్డాయో చెప్పలేకపోయినా స్త్రీ లైంగికత గురించిన పట్టింపు మాత్రం బలంగా ఏర్పడిందని చెప్పవచ్చు. నిజానికి పితృస్వామ్య కుటుంబ సంస్కృతిలో స్త్రీ భోగ వస్తువనే భావన ఏ దశలోనైనా ఎంతో కొంత ఉంటుందని నమ్మవచ్చు. ఆ స్పృహ లేకపోవడం వల్ల చెంచుల్లో వివాహేతర సంబంధాల ఆలోచన కూడా తలెత్తకపోయి ఉండవచ్చు. అయితే పురుషుడికి స్త్రీ లైంగికత మీద ఒకరకమైన ఆదిమ అప్రమత్తత నేటికీ కొనసాగుతూ ఉన్నది. పరపురుషుడు భార్యతో కలిసి ఉన్నట్టు కలగని, తెల్లారాక భార్యనూ, అ మగవాణ్ణీ నరికేసినట్టు, అంబుతో చంపేసినట్టు కొన్ని ఉదంతాలు ప్రకాశం జిల్లాలో చెప్పుకుంటారు. ఇలాంటివి ఒకటిరెండే జరిగి ఉండవచ్చుగాని, ఆ ధోరణి నిజజీవితంలో ఏదోఒక రూపంలో ఉన్నందువల్లనే అలాంటి వాటికి అస్కారం ఏర్పడింది.

ఇందులోనే యింకో బలమైన కోణం ఏమంటే, చెంచుల్లో లైంగిక కార్యకలాపాలు రాత్రిళ్లు నిషిద్ధం. కాలానుగుణంగా ఇటీవల మార్పులు జరిగి ఉండవచ్చునేమోగాని, స్త్రీ-పురుష సంబంధాల్లో ఈ నియమం అనాదిగా ఉన్నదని చెప్తారు. ఆదివాసీ తెగల్లో యిలాంటివాటికి హేతుపూర్వక ఆధారాలేవీ దొరకవు. కేవలం 'మిత్' గానే చెప్పుకోవచ్చు. కాకపోతే దీని గురించి ఆలోచించడం వల్ల జీవితాన్ని, ప్రకృతిని అర్థం

చేసుకోవడంలో వాళ్లకు స్ఫురించిన ఊహలు, భయాందోళనలు, వాటిని అధిగమించడానికి కల్పించుకున్న మార్గాలు అన్వేషించవచ్చు. ఈ నియమం చెంచులకు ఆదిమకాలంలోనే అబ్బి ఉండకపోవచ్చు. అ తర్వాతి కాలంలోనే ఈ మిత్ ఒక నియమంగా ప్రవేశించి ఉంటుంది. ఈ వైపు నుండి చెంచుల సామాజిక సంబంధాలను, ఉత్పత్తి కార్యకలాపాలను చూడటం వల్ల ఇవ్వాల్టికీ వాళ్లలో బలంగా నిలిచి ఉన్న ఆదిమ మూలాల గురించి కొన్ని ఆలోచనలు చేయవచ్చు.

చెంచుల పెళ్లి తంతు చాలా క్లుప్తం. గ్రామాలతో సాన్నిత్యం ఉండి, కొద్దిగా వ్యవసాయం అలవాటయిన గూడాల్లో ఈ మధ్య వరకట్నం ప్రవేశించిందిగాని, పాతరోజుల్లో ఓలి ఉండేదని కూడా చెప్తారు. అమ్మాయిలు కుటుంబానికి మేకలు, లేదా వస్తువులు యిచ్చే పద్ధతి ఉండేది. కొన్నిసార్లు అదీ అప్రధానమే. ఓలిగాని, వరకట్నంగాని ఏమి లేకుండా అమ్మాయికి చీర, రవిక యిచ్చి పెళ్లి చేసుకుంటారు. ముహూర్తాలంటూ ప్రత్యేకంగా లేవు. కాకపోతే విప్పపూలు పూసే రుతువులో పెళ్ళిళ్ల గురించి ఆలోచించేవారట. ఈ మధ్య అదీ తప్పిపోయింది. చెంచుల్లో యిప్పుడు వారాలు ఆధారంగా కాలాన్ని గణించే అలవాటు వచ్చింది. ఫలానా వారం పెళ్ళి అనుకుంటారు. పూజారి అనే వ్యవస్థ లేదు. అమ్మాయి యింట్లో పెండ్లి చేస్తారు. ఎక్కువగా గూడెంలోనే పెండ్లి సంబంధాలు కుదురుతాయి. ఒక గూడానికి – మరో గూడానికి మధ్య పూర్వకాలంలో రాకపోకలు, బలమైన సంబంధాలు ఉండేవి కాదనిపిస్తుంది. ఈ మధ్య వేరే గూడెంలోని అబ్బాయికిచ్చి పెళ్ళి చేసే అలవాటు మొదలైనా, పెళ్ళి తర్వాత అమ్మాయికి పుట్టింటితో సంబంధాలు తక్కువే. తల్లిదండ్రులు కూడా పట్టించుకోరు. పెళ్ళికి ముందు లైంగిక సంబంధాలు నిషేధం. పిల్లలు వడిలో ఉన్నప్పుడు శ్రద్ధ చూపిస్తారుగాని, కాళ్ళు వచ్చాక తిండితిప్పలు చూడ్డం మినహా అపేక్షగా వాళ్ళ భవిష్యత్తు గురించి చింత చేయరు.

పెళ్ళయ్యాక పగటిపూట వేటకు, అటవీ ఫలసాయం సేకరణకు భార్యాభర్తలు మాత్రమే కలిసి వెళ్తారు. రాత్రిళ్ళు శృంగారం అభ్యంతరం కావడంతో పగటిపూట వేటకు వెళ్ళినప్పుడే అవకాశం ఉంటుంది. ఈ అవసరం రీత్యా కూడా విధిగా ఆలుమగలు కలిసి వెళ్తారు. అంత మాత్రమే కాదు, ఇది స్త్రీ లైంగికత మీద భర్త పహారా కూడానా అనిపిస్తుంది. ఆదివాసీ తెగల్లో ఇలాంటివి బలమైన ఉద్దేశ్యాలతో, సంకల్పాలతో జరగకపోవచ్చు. యధాలాపమైన అలవాట్లుగా, దినచర్యలుగా సాగుతుంటాయి. చెంచుల సొంత ఆస్తి స్పృహతో పోల్చుకుంటే స్త్రీ లైంగికతమీద అప్రమత్తత ఎక్కువ. గుడిసె, విల్లంబులు, సేకరించుకున్న ఫలసాయం వగైరాలు 'నావి' అనుకోవడంలో సొంత ఆస్తి భావన చూడగలం. వాటితో పోల్చుకుంటే భార్యతో ఉండే సంబంధం బలీయమైనది. గుడిసె మీద ఉండే శ్రద్ధకన్నా, నాది అనే బలీయమైన భావనకన్నా స్త్రీ మీద ఎక్కువగా ఉంటుంది. అయితే అందులో అధికారం ఉండకపోవచ్చు.

పగలంతా భార్యాభర్తలు మాత్రమే కలిసి తిరిగే వేట, ఆహారసేకరణ, దాంపత్య జీవనం వగైరాల వల్ల చెంచుల్లో అంతర్గతంగా పటిష్టమైన సామాజిక సంబంధాలు ఏర్పడలేదని, ఆహారసేకరణ దశ నుండి ఉత్పత్తిదాయకమైన ఆచరణలోకి పరివర్తన చెందడానికి అవసరమైన సమిష్టి స్పృహ ఏర్పడలేదని అనుకోవచ్చు. పగలు భార్యాభర్త కలిసివెళ్తే, అప్పుడప్పుడు, గూడెంలోని మగవాళ్లు రాత్రిపూట శికారీకి పోతారు. జింకలు, దుప్పులు, కడితులు వేటాడుతారు. నీళ్లు ఉండే చోట మనిషి గాలి తగలకుండా చెట్లమీద మాటు వేసి బాణాలు వేసి చంపేస్తారు. అడవిపందులను పట్టడంలో కుక్కలు గొప్పగా సాయం చేస్తాయని చెప్తారు. జంతువుల మీద రెండుమూడు కుక్కలు ఎగబడుతాయి. అవసరమైతే వీళ్ళు చెట్లమీది నుండి బాణం వేస్తారు.

చెంచుల సమిష్టితత్వం ఆహారసేకరణ, వేట స్థాయిని మించి ఉన్నతరూపంలోకి ఎదగలేదు. దీనికి పైన చెప్పిన కారణం అవరోధంగా ఉండిందా? అని ఆలోచించాలి. అభివృద్ధి క్రమంలో ఒక దశదాకా ఎదిగిఆగిపోయిన తెగలు తిరిగి మళ్లీ ఏదో ఒక బలమైన చోదకశక్తి ప్రేరేపించడంవల్ల ముందుకుసాగాయని, లేదా ఆతెగ నిత్యజీవిత న్వేషణలో, ప్రకృతి సంఘర్షణలో ఏదైనా కొత్త ఆవిష్కరణ జరగడం వల్లనో–యింకో సమూహం తన గమనంలో భాగంగా ముందుకు సాగుతూ ఆగిపోయిన తెగను తనతోపాటు ముందుకు నడిపించడం వల్లనో దానిలో చలనం ప్రాప్తించి ఉంటుందని ఊహించవచ్చు. చెంచు సముదాయం వేట, ఆహారసేకరణ మూలాలతో తెగతెంపులు చేసుకొని పురోగమించడానికి అలాంటి చోదకప్రేరణలు లభించకపోవడం ఒక కారణం కావచ్చు. ఈ ఊహను నిర్దిష్టంగా చెంచుల సామాజిక సంబంధాల సామాజిక కార్యకలాపాల దృష్ట్యా పరిశీలించడమే ఉన్నంతలో మంచి పద్ధతి.

ఒక సమూహాన్ని చారిత్రకంగా అధ్యయనం చేసేటప్పుడు సామాజిక సంబంధాల పరిణామాన్ని, రాజ్యం పాత్రను ప్రధానంగా పరిగణనలోకి తీసుకుంటారు. కానీ చెంచు తెగలో స్త్రీ–పురుష సంబంధాలే మౌలిక ప్రాతిపదికగా నిలుస్తాయి. చెంచుల సమస్త కార్యకలాపాలను, వాటికి వాళ్ళ జీవితంలో దొరికిన ప్రాధాన్యతలను తరచిచూస్తే భార్యాభర్తల సంబంధాలను కాపాడుకోవడమే ప్రధానమైందిగా కనిపిస్తుంది. దాని చుట్టూ సాంస్కృతిక , నైతిక అంశాలు పోగవడమేగాక, ఆ మేరకు జీవనోపాధి మార్గాలూ నిర్దేశితమవుతాయి. పునరుత్పత్తిని, వారసత్వాన్ని పరిరక్షించుకొనే దృష్టితో భార్యాభర్తల సంబంధాలను చూడటంవల్ల ఆ మేరకు స్త్రీని ఆస్తిభావనలో భాగంగా చూడటం అలవాటయి ఉంటుంది.

## 9. వ్యవసాయం

చెంచుల ఆహారసేకరణలో, వేటలో గుంపుతత్వం పలుచగా ఉండటం ఒక పార్శ్వమైతే, ప్రకృతితో వారి సంఘర్షణ రెండో పార్శ్వం. ప్రకృతి తానుగా విడుదల చేసినవాటి సేకరణే చెంచులకు ప్రధానం. ఏఏ కాలాలలో అడవిలో ఏమేం దొరుకుతాయో తెలియ వచ్చుగాని, ఆ కాలాలు, ఉత్పత్తులు, మొత్తంగా అడవి, ప్రకృతి వెనుక ఏముందో తెలియదు. ప్రకృతి ఫలాల అన్వేషణ ఉన్నంతగా ప్రకృతి శక్తుల అన్వేషణ ఉండదు. చెంచులు ఆహారసేకరణ నుండి వ్యవసాయంలోకి పరివర్తన చెందవలసిన దశ ఎక్కువ చర్చనీయాంశం. యిప్పటిదాక సాగిన ఆలోచనలు, వారి జీవిత వాస్తవికత ఆధారంగా చేసిన అన్వేషణలు అన్నీ ఈ బిందువు దగ్గరికి సహజంగానే చేరుకుంటాయి. వ్యవసాయం చేసి ఆహారాన్ని ఉత్పత్తి చేసుకోవడం మానవజాతి మహావిజయం.

వ్యవసాయం, గృహనిర్మాణం, ఇనుము వాడకం మొదలయిన పెద్ద పెద్ద అంగలతో నాగరికత చేసిన ప్రయాణం చరిత్రను తీర్చిదిద్దింది.

హైమన్‌డార్ఫ్ 1940లలో నల్లమల పర్యటన చేసినప్పుడు అక్కడక్కడ చెంచులు వ్యవసాయం చేయడం గమనించాడు. తను మళ్లీ 70లలో రెండోసారి వచ్చేటప్పటికి అవే గూడాల్లో వ్యవసాయం కనిపించలేదని రాశాడు. దీన్ని బట్టి కనీసం నూరేళ్ళ కిందటి నుండి అతితక్కువగానైనా చెంచులు వ్యవసాయం ప్రారంభించారు. అయితే అది మొత్తం తెగకు సంబంధించిన విషయంగా ఏమాత్రం చెప్పలేము. అట్లాగే వ్యవసాయం అలవాటయిన కుటుంబాలకైనా అది జీవన విధానంగా, జీవన దశగా అందివచ్చిందనీ చెప్పలేం. ఆ తర్వాత 1979 లో ఐటిడిఏ ఏర్పడ్డాక వ్యవసాయం మీద కేంద్రీకరణ పెరిగిందికాని నక్సలైట్ ఉద్యమం చేసిన ప్రయత్నాలే చెప్పుకోదగ్గవి. నల్లమల చెంచుల కోసం బ్రిటిష్ ప్రభుత్వ సంస్కరణ కార్యక్రమాల్లో కూడా వ్యవసాయం ప్రస్తావన , ఉద్దేశ్యం ఉన్నాయి. అవి రకరకాల రూపాల్లోఇప్పటికీ కొనసాగుతున్నాయి. చెంచుల వ్యవసాయం గురించి ఎన్ని మేలైన ఉదాహరణలు చూపినా అవన్నీ మినహాయింపులే అనదగిన వాస్తవికత బలంగా ఉన్నది. చెంచులను వ్యవసాయంలోకి తేవాలనే నక్సలైట్ ఉద్యమ ప్రయత్నాలు కూడా ఫలించలేదంటే ఒక తెగగా ఆహారాన్ని సేకరించుకొనే దశ నుండి ఉత్పత్తి చేసుకొనే దశకు ఎదగగల అంతర్గత సానుకూలత లేదనుకోవాలేమో!

ఆహారసేకరణలో కంటే ఉన్నతస్థాయిలో ప్రకృతి అవగాహన ఉన్నప్పుడే వ్యవసాయం చేయడానికి ఆస్కారం ఉంటుంది. చెంచులు తమంతతాముగా వ్యవసాయంలోకి రాలేకపోయారని, ఆ వైపుగా వాళ్ళ జీవితాన్వేషణ సాగలేదని మొట్టమొదట గుర్తించాలి. ఎక్కడైనా అలాంటి ప్రయత్నం చేసినట్లు చరిత్రలో ఆధారాలు దొరికినా అది తెగ మొత్తానికి సంబంధించిన విషయంగా విస్తరించలేకపోవడం, ఆ ప్రాంతంలోనైనా నిలదొక్కుకోలేకపోవడం, రైతులుగా -రైతు మనస్తత్వంతో భూమితో, వ్యవసాయంతో సంబంధంలోకి వెళ్ళజాలకపోవడం గమనించాలి. బైటినుండి జరిగిన ప్రయత్నాల్లో స్వల్పమైన ఫలితాలు ఉన్నాయి, చాలా ఎక్కువ విఫల అనుభవాలూ మిగిలాయి. ఇలాంటి తెగను బైటిశక్తులు (రాజ్యమైనా, ఉద్యమాలైనా) ఉత్పత్తిలోకి మరల్చాలనుకున్నప్పుడు ఎదురయ్యే సవాళ్లు ఎలా ఉండేదీ చెంచుల వ్యవసాయం ద్వారా తెలుస్తాయి. ఆదిమదశ నుండి మనిషి ఎదిగిన అభివృద్ధి మార్గాల గురించి, వాటి వివరణల గురించి మళ్లీ తలపోసుకోవాల్సిన అవసరం ఏర్పడుతుంది. చాలా నిర్దిష్టంగా చెంచుల నేపథ్యంలో వాటిని అన్వయించుకోవలసిన అవసరమూ తలెత్తుతుంది. ఈ దృష్ట్యా చెంచులు ప్రకృతిని ఎలా అర్థం చేసుకుంటారు? అనే ప్రశ్న వేసుకొని కొన్ని ఊహలుచేసి, వారి జీవన వాస్తవికతతో అన్వయించుకోవలసి వస్తుంది.

బహుశా, చెంచులు దృశ్యమానమయ్యే ప్రకృతి మార్పులనే పసిగట్టగలరు. వాటి వెనుక ఉండే నియమాల గురించిన తార్కికతను అర్థంచేసుకోలేరు. ఆదిమదశలోని ప్రకృతి అవగాహనకు ఉండే పరిమితి యిది. ప్రకృతితో సంఘర్షణాత్మక సంబంధంలో లేకపోవడం వల్ల ఏర్పడిన పరిమితి వ్యవసాయంలోకి వెళ్ళకుండా నిలువరించడమేగాక, మైదాన ప్రాంత అధిపత్యశక్తులు, రాజ్యం దూరక్రమించినంతమేరా సంఘర్షణారహితంగా అందులోకి జారిపోవడానికీ కారణమై ఉండవచ్చు. రెండోదాన్ని వివరించడానికి చరిత్ర సంబంధమైన ఆధారాలు చాలా అవసరం. అయితే తెగలన్నిటికీ ఉన్న అనుభవాలరీత్యా బైటి శక్తుల చొరబాటును, తద్వారా కలిగిన కల్లోలాన్ని చెంచుల విషయంలో కూడా ఊహించవచ్చు. కనీసం విజయనగర సామ్రాజ్య కాలం నుండి మైదాన ప్రాంత చొరబాటు ఎలా ఉండేదో నిర్దిష్టంగా అన్వేషించడం అవసరం. ఈ వివరాలు ఎలా ఉన్నా - ఈ కోణంలో చెంచులకు ప్రకృతితో సంఘర్షణాత్మక సంబంధం ఏర్పడకపోవడానికి, ప్రకృతి నియమాల గురించి తెలియకపోవడానికి, లేదా పరిమితంగానే తెలియడానికి కారణాలు ఏమిటో ఆలోచించవచ్చు.

ప్రకృతిని పదేపదే గమనించడం వల్ల, నిత్యం పరిశీలించడం వల్ల పరిణామ స్వరూపం, స్వభావం అర్థం అవుతుంది. నిత్యం పరిశీలించడం అంటేనే సంబంధంలో ఉండటం. అదీ చలనంలో ఉన్న దానితో వ్యవహరించడం అంటే సంఘర్షణాపూరితంగా వ్యవహరించడం. మనుషులకు ప్రకృతి ఇట్లాగే అర్థం అవుతుంది. చెంచులకు యిట్లా అర్థం చేసుకునే అవకాశం కలగకపోవడానికి కారణంఏమిటి? ప్రకృతిలోని పరిణామాలను స్థిమితంగా, సామూహికంగా గమనించ డానికి వీలుకాని అస్థిరత వాళ్లను వెంటాడి ఉంటుందా? చరిత్రలో ఏ దశలోనైనా బైటి ప్రాంతాల అధిపత్యశక్తుల చొరబాటువల్లనో, అడవి లోపలికి తరమడం వల్లనో అస్థిరత ఏర్పడ్డానికి అవకాశం ఉన్నది. ప్రకృతి తెలియకపోవడం, సంఘర్షణ లేకపోవడం వల్ల చొరబాటు శక్తుల పట్ల కూడా సంఘర్షణతో సిద్ధం కావడం కష్టమే. ప్రకృతితో, అధిపత్యశక్తులతో సంఘర్షణారహితంగాఉండటం వల్ల ఆదిమ మూలాలతో తెగతెంపులు జరగలేదు. అంతర్గత చలనంలో మరోదశలోకి పరివర్తన చెందలేదు. మామూలుగానైతే చొరబాటుకు గురయిన సముదాయాల్లో ఆదిమ పద్ధతిలోనైనా తిరగబడ్డం ఉంటుంది. చెంచుల్లో అలాంటి లక్షణం ఉన్నదా? అనుమానం. ఏ కాలంలోనైనా ఏకొంచెమైనా ఉండి ఉంటే తప్పక దాని వ్యక్తీకరణ యివాళ కనిపించేదే. దాన్నుండి ఉత్పత్తి అయ్యే జ్ఞానం తిరిగి ప్రకృతిని అర్థం చేసుకోవడానికి ఉపయోగపడేది, గుంపుతత్వాన్ని పెంచి ఉండేది. ఉత్పత్తి కార్యకలాపాలవైపు నడిపించి ఉండేది. మొత్తంగా చెంచు సమాజాన్ని నడిపే చోదకశక్తిగా నిలబడగలిగేది.

సాధారణంగా మానవుల ఆలోచన సరళిని సమాజంలో నిర్మాణాలు, వ్యవస్థలు ప్రేరేపిస్తుంటాయి. వాటికి భిన్నమైన ఆలోచనలు చేసినప్పుడు వ్యవస్థలు తమ అదృశ్య బాహువులతో వ్యక్తులను అదుపుచేస్తుంటాయి. తన భావజాలం పరిధిలోకి తెచ్చుకొని భయపెట్టడం ద్వారానో, సేదతీర్చడం ద్వారానో ఆలోచనారీతులను పదేపదే నిర్దేశిస్తుంటాయి. ఈ ప్రక్రియ ఏమంత సుఖవంతంగా సాగదు. వ్యక్తికి -వ్యవస్థకు మధ్య సంఘర్షణ అనివార్యమే. ఆదివాసీ సముదాయాల్లో సైతం యిది ఉండేదే. చాలా సరళంగా కనిపించవచ్చుగాని ఆయా తెగల సాంస్కృతిక, నైతిక స్థాయిలను బట్టి తమదైన వ్యక్త అవ్యక్తరూపాల్లో ఘర్షణ నడుస్తూ ఉంటుంది. యిట్లా వ్యవస్థల ప్రేరితమైన ఆలోచనా రీతులు, వాటివల్ల సమూహంలో, వ్యక్తిలో తలెత్తే సంఘర్షణలు క్రమపట్ల ఒక దృక్పథాన్ని కల్పిస్తాయి. ఆదిమ తెగలు చాలావరకు అలాంటి

శ్రమదృక్పథాన్ని అందుకోగల సామాజికదశకు చేరుకున్నాయి. శ్రమ దృక్పథం వల్ల, అది అందించిన సామాజిక, వ్యక్తిగత జీవన వాస్తవికత వల్ల సముదాయాలు అంతర్గత చలనాన్ని సాధించగలిగాయి. అందువల్లనే వాళ్లకు అంత సంఘర్షణాత్మక చరిత్ర ఉన్నది. శ్రమకు భిన్నమైన శక్తులపట్ల, వ్యవస్థలపట్ల , విలువలపట్ల ఆదివాసులు అప్రమత్తంగా ఉండి నిత్యం వాటిని నిలువరిస్తూ ఉంటారు.

మానవ వికాస చరిత్రలో అవశేషాలనదగిన ఆహారసేకరణ, వేట మార్గాలు జీవన మూలాలుగా నిలిచి ఉన్న చెంచులు అలాంటి చలనంలో భాగంకాలేకపోయారు. ముఖ్యంగా వేట మినహా ఇతర ఉత్పత్తిదాయకమైన శ్రమలో భాగం కాలేకపోయారు. దీనివల్ల మైదాన ప్రాంత గ్రామాలవాళ్లు చెంచులు బద్ధకస్తులని, పనిచేయరని అంటారు. ఈ మాట నిజం కాదు. అసలు సమస్య ఏమంటే – వాళ్లకు 'పనినైపుణ్యం' లేకపోవడమే. తరతరాలుగా అలవాటయిన ఆహారసేకరణ, వేటరూపాల్లో అత్యంతనైపుణ్యం కనబరిచే చెంచులకు యితర పనుల్లో ప్రవేశం కుదరలేదు. వారి సృజనాత్మకతకు ఉన్న పరిమితి యిది. ఒక రకంగా ఇది పరిమితి కూడా కాదు, వాళ్ల జీవన వాస్తవం. అనేక పర్యావరణ కారణాలవల్ల , ప్రభుత్వవిధానాల వల్ల, మైదానప్రాంత శక్తుల చొరబాటు వల్ల చెంచుల జీవనాధారమైన అటవీ సంపద తగ్గిపోయింది. దీనికి తోడు కరువు. అడవిలో కరువు అనే అనుభవం ఏమిటో, చెంచులు కరువుబారిన ఎట్లా పడతారో ప్రత్యేకంగా అధ్యయనం చేయాల్సిందే.

అట్లాంటి విపత్కర స్థితిలో కూడా చెంచులు యింకో పని చేసుకొని బతికే అస్కారం లేదు. గ్రామాలతో సన్నిహితంగా ఉన్న వాళ్ళను – పని చేయగలరని నమ్మకం ఉన్న వాళ్ళను మాత్రమే ఊళ్ళలో పనుల్లోకి తీసుకుంటారు. అడవితో సంబంధంలేని పనుల్లో నైపుణ్యం, అలవాటు ఉన్న చెంచుల సంఖ్య చాలా తక్కువ. మిగతా వాళ్ళంతా కరువుకాలంలో సైతం సారాయి కాచుకొనితాగుతూ, ఆకలి అనే వ్యాధి బారినపడి, దాన్నుండి పుట్టే యితర శారీరకరోగాలను భరిస్తూ చెట్లకింద చావు–బతుకుల పొలిమేరలో సంచారం చేస్తూ ఉంటారు.

ఆహారసేకరణ రూపాన్ని అధిగమించి యితర శ్రమరూపాల్లో ఉత్పత్తిలో భాగంకావడం అంటే ప్రకృతితో సహచరించడం. అది ఐక్యత, ఘర్షణల రూపంలో ఉంటుంది. ఈ రెండింటి వల్ల కలిగే జ్ఞానం అనుభవజ్ఞానంగా, సామాజిక జ్ఞానంగా, శాస్త్రజ్ఞానంగా ఉన్నత రూపాలను చేరుకుంటుంది. అయితే సామూహికమైన శ్రమ రూపం దీనికి ఒక షరతుగా ఉంటుంది. ప్రకృతి అవగాహన కూడా సమిష్టి అనుభవసారంగానే నిగ్గుదేలుతుంది.

చెంచుల్లో ఈ ప్రక్రియ జరగకపోవడం వల్ల ఆహారసేకరణకు, వేటకు మధ్య పరివర్తన దశలో నిలిచిపోవడం వల్ల వ్యవసాయంలోకి రాలేకపోయారు. ఒకరకంగా ఆదిమ సమాజంలోని గణవ్యవస్థను పోలిన సముదాయమే గాని తెగగా కూడా రూపొందలేదు. మన సౌకర్యం కోసం తెగ అని వ్యవహరించాల్సిందే. అయితే అలాంటి యితర తెగలను కూడా అధ్యయనం చేసి తులనాత్మక పరిశీలన చెయ్యటం వల్ల కూడా చెంచుల్లోని గణవ్యవస్థకు భిన్నమైన లక్షణాలనూ అర్థం చేసుకోవచ్చు. ఎందుకంటే గణవ్యవస్థ తర్వాత చరిత్రలో వచ్చిన మార్పులు కొన్ని చెంచుల్లో కనిపిస్తాయి. యిలాంటివి ప్రతిబింబించడాన్ని కేవలం మైదాన ప్రాంత శక్తులు అపాదించడంగా, రుద్దడంగా మాత్రమే చూచి సరిపెట్టుకోవడం కుదరదు. అవీ ఉండవచ్చు. వాటితోపాటు భిన్నమైన పరిణామాలు జరిగి ఉండే అవకాశం ఉంది. ఈ ప్రత్యేకత వల్లనే పైకి సరళంగా కనిపించినా భిన్న చారిత్రకదశల లక్షణాలు ఒక విపరిణామంలో వాళ్ల జీవితంలో కలగలసిపోయాయి. దంపతీ వ్యవస్థ, స్త్రీ లైంగికత మీద పురుషుల అధికారం, వివాహాలకు సంబంధించి గోత్రాల మధ్య ఉన్న విధి నిషేధాలు చాలా లోతుగా పరిశీలిస్తేగాని గణదశలో ఆగిపోయిన చెంచు సముదాయానికి ఎట్లా సంక్రమించిందీ అర్థంకాదు.

## 10. గుంపునిర్మాణం

చెంచుల్లో బలమైన ఆదిమ మూలాలు, ఆ తర్వాతి దశల లక్షణాలు కలగలసి ఉన్నందువల్లనే వారిదొక విభిన్నమైన చారిత్రక ప్రయాణం అని మొదటే చెప్పవలసి వచ్చింది. మామూలుగా మనిషి మరో మనిషి మీద ఆధారపడటం, అనుసరించడం, బైట జరిగిన మార్పులను స్వీకరించడం లేదా వాటి ప్రభావానికి లోనుకావడం – తద్వారా తనచుట్టూ ఉండే సముదాయానికి ఉన్న పరిమితులను అధిగమించడం అనే క్రమంలో చరిత్ర వికాసం జరుగుతుంది. కానీ యిలాంటి వికాసమార్గంలో భాగంకాని మానవ సముదాయాలు కూడా ఉండవచ్చునని చెంచులను చూస్తే అనిపిస్తుంది. అసలు చెంచులది తమదైన ప్రత్యేక క్రమం అనుకోవచ్చు. ఈ దృష్ట్యా వేట, ఆహార సేకరణ దగ్గర ఆగిపోయారని చెప్పడం కంటే తమదైన విభిన్న క్రమంలో భాగమయ్యారనడం బాగుంటుంది. ఆ మేరకు వేట, ఆహారసేకరణ పునాది మీదికి వచ్చి చేరిన యితర చారిత్రక దశల లక్షణాలు వాళ్ల జీవితంలో చోటు సంపాదించుకున్నాయి. అయితే ఈ విభిన్నమైన అంతర్గత చలనం గుణాత్మక దశకు చేరుకోలేకపోయింది. బాహ్యప్రేరణల వల్ల కదలిక ఉన్నట్టనిపించినా, అది ప్రారంభమైన బిందువు నుండి మరోచోటికి ప్రయాణించలేకపోయింది. దానికి అవసరమైన వ్యవస్థానిర్మాణం తెగలో లేదు. అందువల్ల ప్రతిచోట బైటిశక్తుల జోక్యం అవసరం అవుతున్నది. అది కూడా ఒకసారి కలిగిన ప్రేరణ ఆ దిశగా చలనానికి భరోసా అవుతుందని నమ్మలేం.

దీనికి చెంచుల నిజజీవితంలోనే అనేక ఉదాహరణలు చూడవచ్చు. వ్యవసాయం, ఆరోగ్యం... చివరికి అందుబాటులో ఉండే పదార్థాలతో మేలైన పద్ధతిలో వండుకోవడం లాంటి విషయాల్లో కూడా ఉద్యమకారులైనా, ప్రభుత్వ యంత్రాంగమైనా చేసే ప్రయత్నాలు తాత్కాలికంగానే మిగిలిపోయాయి తప్ప స్థిరమైన, చలనశీలమైన పురోగామి అంశగా నిలదొక్కుకోలేకపోయాయి. యిక, ఒక చోట జరిగిన ప్రయత్నం వేరే గూడాలకు విస్తరించడం అనే ప్రశ్నే ఉండదు.

సరైన ఆహారం లేకపోడం చెంచులకు అతిపెద్ద సమస్య. అర్థాంతర, అసహజ మరణాలన్నిటికీ అదేకారణం. అందుకని ఉద్యమకారులు కూరగాయల పెంపకం మీద మనసుపెట్టారు. చెట్లపెంపకం, వండే పద్ధతి చెంచులకు అలవాటు చేయడం చాలా కష్టమైంది. వ్యవసాయం కోసం, సంక్షేమం కోసం బైటి నుండి జరుగుతున్న ప్రయత్నాలు ఏ కారణం వల్లయినా వెనక్కిపోతే కొంతకాలంగా 'అలవాట'యినదాన్ని అలవాటుగానైనా తమంతతాము

కొనసాగించగలరని నమ్మలేం. బైటి నుండి నిరంతరం ప్రేరేపించి, చేయి పట్టుకొని నడిపించి, అన్నీ తామే అయి సన్నాహాలు, సమన్వయం చేయకపోతే చెంచులు మరుక్షణమే వెనక్కి వచ్చేస్తారు. లేదా ఎక్కడ వదిలేశారో అక్కడే నిలబడిపోతారు.

చెంచులతో వ్యవసాయం చేయించాలనే నక్సలైట్ల ప్రయత్నాలన్నీ యిలాగే మిగిలిపోయాయి. వేలకోట్ల రూపాయలతో ప్రభుత్వం చేపట్టిన అభివృద్ధి వల్ల కలిగిన మార్పులు కూడా చెంచు అంతర్గత జీవితాన్ని ప్రభావితం చేయలేకపోయాయి. కొన్ని కొత్త అలవాట్లు, వస్తువులు బాహ్యజీవితంలో భాగం కాగలిగాయి కాని అంతర్గత చలనం ఆదిమ జీవన దశ నుండి ముందుకు ప్రయాణించలేకపోయింది.

ఇవన్నీ చెంచుల గుంపు నిర్మాణం వైపు నుండి ఆలోచించాల్సిన అవసరాన్ని సూచిస్తాయి. మళ్లీ వ్యవసాయం దగ్గరికే పోతే– గుంపుతత్వం, నిర్మాణం లేకుండా వ్యవసాయం గురించిన ఎరుక సాధించడం కష్టం. భాష, సాంస్కృతిక రూపాల్లో సమూహం ప్రమేయం చాలా కీలకమైంది. భాష ఏర్పడ్డానికి పూర్వం ఒక సంకేతం అందరికీ ఒకే అర్థాన్ని స్ఫురింపజేస్తోంది. అట్లాగే అందరికీ ఒకే భావాన్ని అందించే పదం ఏర్పడుతుంది. సంకేతం స్థానంలో పదం రావడం అభివృద్ధి. భాష ఉత్పత్తి గురించి, పౌరాణికాలు రూపొందిన క్రమం గురించీ చాలా నిర్ధారణలు జరిగాయి. చుట్టూ ఉన్న ప్రకృతివల్ల వ్యక్తుల్లో కలిగిన అనుభవాలను, ఊహలను సామూహికరించుకోవడమే వీటన్నిటికీ కారణం. చెంచుల్లో యిలాంటి ప్రక్రియ జరగలేదు. అనుభూతులకు, ఊహలకు ప్రేరణ అయిన బాహ్యపరిస్థితుల పాత్ర దీనికి దోహదపడాలి. అది ఉన్నా చెంచుల్లో సామూహికత ఏర్పడలేదేమో! ఆలోచించాలి.

చెంచులకు పౌరాణికాలు లేకపోవడానికి యిదే కారణం కావచ్చు. సామూహికత నుండే వాఙ్మయం పుట్టి సామూహిక ప్రాధాన్యతను వక్కాణిస్తూ ఉంటాయి. చెంచుల్లో సామూహిక మనస్తత్వం తక్కువ. అందువల్ల దేవతల చుట్టూ, ప్రాంతం చుట్టూ కళారూపాలు కనిపించవు. నిజానికి దేవతలకు ఆపాదించే స్వభావం సమూహంతో నిమిత్తం లేనిదికాదు. సామూహిక వ్యక్తీకరణ ఆలంబన కాకుండా దేవతలు మనలేరు. చెంచులకు సామూహిక మనస్తత్వం లేకపోవడం వల్ల చెంచు దేవతలకూ మూర్తిమత్వం లేకుండా పోయింది. చివరికి చెంచుల జీవితంలో, ప్రకృతి సంబంధంలో బలమైన పాత్ర కూడా లేకుండాపోయింది. లేదా ఏ మేరకు సామూహికత ఉన్నదో అంతవరకు ఇవన్నీ ఉన్నాయని చెప్పవచ్చు. కళారూపాల విషయంలో కూడా యింతే. సామూహికత బలంగా ఉన్న తెగల్లో సమూహం నిమగ్నమయ్యే క్రమంలో కళకు ఒక రూపం వస్తుంది. అలాంటి కళారూపాలకు, చెంచుల కళారూపానికి మధ్య తేడాను సరళత, సహజత్వం వైపు నుండి చూడ్డం బాగుంటుంది. ఉదాహరణకు ఒక గోండీ నృత్యాన్ని వివరించినట్టు చెంచుల డాన్స్‌ను వివరించడం కష్టం కావచ్చు. చెంచుల కళలోని తమదైన పద్ధతి దీనికి కారణం.

ఈ ప్రత్యేకతలు చెంచుతెగలోని గుంపు నిర్మాణానికి సంబంధించిన ప్రశ్నలను ముందుకు తెస్తాయి. ఆటవిక దశలోనే మనిషి గుంపుగా ఉనికిలోకి వచ్చాడు. గుంపులో ఉన్న సంబంధాల్లోనే మనిషి అస్తిత్వం నిలబడింది. సమూహం నుండి సంక్రమించిన వ్యక్తిత్వం కొన్ని నైపుణ్యాలను సంపాదించుకొనే క్రమంలో విడివడి 'వ్యక్తి'గా, 'నేను'గా మారిపోతుంది. ఇలాంటి సమూహం – వ్యక్తి సంబంధాల పరిణామ చరిత్రకు భిన్నమైన మార్గం చెంచుల్లో కొనసాగి ఉండవచ్చు. మామూలుగా గుంపు నిర్మాణం తెగలో అంతర్గత వ్యవస్థలకు దారితీస్తుంది. చెంచుల్లో కుటుంబమే చెప్పుకోదగ్గ నిర్మాణం. అది కూడా ఆహార సేకరణ మీద ప్రధానంగా ఆధారపడిన తెగలోకి దంపతీ కుటుంబ వ్యవస్థ వచ్చింది. యిదిగాక వేటలో ఉన్న కొద్దిపాటి సామూహికత. సాధారణంగా పరిణామ చరిత్రలో గుంపునిర్మాణానికి ఉన్న ప్రాధాన్యత రీత్యా చూస్తే చెంచుల్లో దానితో సంబంధంలేని క్రమం కనిపిస్తుంది. గుంపునిర్మాణం లేనప్పుడు వ్యక్తులకు కొత్తపరిస్థితులతో, శక్తులతో, ప్రభావాలతో వ్యవహరించడంలో పరిమితి ఉంటుంది. యిదే చెంచుల్లో అంతర్గత చలనానికి ప్రతిబంధకం అయి ఉంటుంది.

ఇక్కడే బాహ్య ప్రేరణల ప్రభావం గురించీ చెప్పుకోవాలి. ఆదిమ దశ నుండి నేటిదాకా సాగిన చెంచుల ప్రయాణంలో చప్పున కనిపించే మార్పులకు లోపలి, బైటి ప్రమేయాలు ఎంతవరకు దోహదపడ్డాయో వివరించాలి. చెంచుల్లో గుంపునిర్మాణం లేకపోయినా, (లేదా అత్యంత బలహీనంగా ఉన్నా) అంతర్గత చలనం లేకపోయినా చోటు చేసుకున్న మార్పుల్లో బైటి ప్రభావాలు ఎంతవరకు? పురాతన కాలం నుండి చెంచుల చుట్టూ ఉన్న సమాజం మొదలు బ్రిటిష్ సంస్కరణలు, ఐటిడిఎ, విప్లవోద్యమాలదాకా బాహ్య ప్రేరకాలు చెంచుల్లో తెచ్చిన మార్పులు ఎలాంటివి? ఆపాదించినవి ఎలాంటివి? అనే ప్రశ్నలు మార్పుకు కారణమైన అంతర్, బహిర్ ప్రేరకాల గురించిన కొత్త ఆలోచనలకు దారి తీయవచ్చు.

ఇవన్నీ గతాన్ని అర్థంచేసుకోవడానికి పనికి వస్తాయి. వాస్తవానికి ఇవాళ చెంచులు అంతరించిపోతున్న తెగ. పురుటికందుల, చిన్నపిల్లల మరణాలు, మొత్తంగా అసహజ మరణాలు ఎక్కువ. సగటు అయుర్దాయం తక్కువ. ముప్పై ఏళ్లకే ముసలివాళ్ళయిపోతారు. వయసు పైబడ్డవాళ్ల కోసం గూడాల్లో వెతుక్కోవలసిందే. మలేరియా, టి.బి. లాంటి చిన్న జబ్బులకే రాలిపోతుంటారు. అసలు గత యాభై ఏళ్లలో చెంచు జనాభా పెరుగుదల రేటు ఆందోళకరంగా ఉంది.

పునరావాసం చెంచులకు మరోపెద్ద విపత్తు. బ్రిటిష్ కాలం నుండి నడిచిన పునరావాస ప్రక్రియ చెంచుల పాలిట ఎంత విషమంగా మారిందో ఆధారాలున్నాయి. యివాళ ప్రభుత్వం మళ్లీ పునరావాస సముద్ధరణకు దిగింది. చెంచులు సారాయి తాగడం వల్ల చనిపోతున్నారనీ, వ్యవసాయంలోకి రాకపోవడంవల్ల ఎదగడం లేదనీ ప్రభుత్వ వాదన. ఆధునిక సమాజం పక్కనే లోతట్టుచెంచు గూడాలు, పెంటలు ఆదిమ జీవితాన్ని కొనసాగిస్తున్నాయంటే, వారి అభివృద్ధి గురించి ఆలోచించే ముందు వారి సామాజిక మూలాల గురించి తెలుసుకోవాలి. వాళ్ళు స్వీకరించజాలని ప్రణాళికలు ఎన్ని తయారు చేసుకున్నా ప్రయోజనం ఉండదు. మొదట వాళ్లను మనతోపాటు జీవిస్తున్న ఆదిమ శిశువులుగా గుర్తించగలిగితే చెంచు తెగ విచ్ఛిన్నాన్ని కొంచెమైనా అడ్డుకోవచ్చు. ◆

**మహిళా సంఘాల అధ్యయనం చేయకుండా మహిళా ఉద్యమ చరిత్రను సరిగ్గా నిర్మించలేమనీ, దాని స్వభావాన్ని అంచనా వేయలేమనీ అంటున్నారు ఎస్. మహబూబ్ బాషా**

# వలసాంధ్రలో స్త్రీల సంఘాలు : వివాదాస్పద 'శ్రీ విద్యార్థిని సమాజ' కథ

*(.. గత సంచిక తరువాయి)*

**2**

**కాకినాడ విద్యార్థినీ సమాజం : ప్రారంభం**

'శ్రీ విద్యార్థినీ సమాజము' అని కూడా వ్యవహరింపబడిన ఈ సమాజం 1903 జనవరి 30 తేదీన కాకినాడలో స్థాపించబడింది. వ్యవస్థాపక కార్యదర్శిని అయిన పులుగుర్త లక్ష్మీనరసమ్మ ఈ సమాజం ఏ విధంగా ఉనికిలోకొచ్చిందో వివరంగా తెలిపారు.[6] ఆమె ప్రకారం భండారు అచ్చమాంబ కాకినాడకు వచ్చిన సందర్భంగా 'నా సతీమణియొక్క సదాగమనము సదా మన హృదయములయందు జ్ఞప్తియుంచు' కొనదానికి ఒక సభ జరిపించారు. ఆరోజే, అంటే జనవరి 30, ఈ సమాజపు పుట్టినరోజు. అచ్చమాంబగారి రాకవలన కల్గిన 'కుతూహలము' వల్ల జనవరి 31, ఫిబ్రవరి 1 తేదీల్లో రెండుసభలు జరిగాయి. దుగ్గిరాల రమణమ్మ ఇంట్లో జరిగిన మొదటి సభలో అచ్చమాంబ 'మృదుమధురమగురీతిని స్త్రీ నీతి దాయకముగ బదినిమిషములు' ఒక ఉపన్యాసమిచ్చింది. స్థానిక 'గరల్సు స్కూలు' లో జరిగిన రెండవ సభలో అచ్చమాంబ "బాలికా పాఠశాలలలోని లోపములు దాని నివారణోపాయములు" అను అంశంమీద 'గొప్ప ఉపన్యాసము' ఇచ్చారు. అదే సభలో అయ్యగారి ఘంటలమ్మ అనే ఆవిడ "స్త్రీలు జ్ఞానాభివృద్ధినొందవలసిన విధము" అనే 'మంచి ఉపన్యాసమును' చదివింది. 'అటుపిమ్మట బ్రతి శుక్రవారము గ్రమముగా' జరిగిన సభలకు ముప్పైకి పైగా స్త్రీలు హాజరయ్యేవారు. ఆ విధంగా 1903 సంవత్సరాంతానికి 60 సమావేశాలు జరిగాయి. నర్సమాంబ ఇంట జరిగే సమావేశాలే కాకుండా మరో మూడు సమావేశ ప్రదేశాలు నిర్ణయమయ్యాయి. దుగ్గిరాల రమణమ్మ ఇంట్లో మంగళవారాల్లోనూ, బాలాంత్రపు శేషమ్మ ఇంట్లో కూడా మంగళవారాల్లోనూ, కాశీభొట్ల సూరమ్మ ఇంట్లో ఆదివారాల్లోనూ సమావేశాలు జరిగేవి.

ఈ సమావేశాల్లో పాతివ్రత్యము, స్నేహము, ఓర్పు, ధైర్య స్థైర్యములు, ఈశ్వర సృష్టి, పత్రికా ప్రశంస మొదలైన విషయాలమీద నరసమాంబ, బాలాంత్రపు శేషమ్మ, దేవ గుప్తాపు మహాలక్ష్మమ్మ మొదలైన స్త్రీలు ఉపన్యసించేవారు. కొన్ని సభలు 'కేవలం సద్గ్రంథ కాలక్షేపముల తోడను మంగళగీతముల తోడను ముగింపబడెను' సమావేశములకు హాజరు కమ్మని పిలవడానికి 'నోటీసులు' వేయించి (ప్రతి శుక్రవారము) సామాజికురాండ్రకు పంపేవారు.

1904 (?) ఫిబ్రవరిలో సమాజం ప్రథమ వార్షికోత్సవం జరుపుకుంది; బాలాంత్రపుశేషమ్మ 'సంవత్సరోత్సవ సభ కగ్రాస నాధిపత్యము' (అధ్యక్షత) వహించింది. 'నీ యుత్సవమునకు' రండని రాజమండ్రి, విశాఖపట్నం, ఏలూరు, చోడవరం, ఎలమంచిలి మొదలైన ప్రాంతాలలోని 'సఖులకు' ఆహ్వాన లేఖలంపబడ్డాయి. సమాజం క్రమక్రమంగా అభివృద్ధి చెందుతున్నదని సంతోషాన్ని వ్యక్తం చేస్తూ లక్ష్మీ నరసమ్మ 'నానాటికి సామాజికురాండ్రకు విద్యాభిలాషయు సత్కార్యాభిలాషయు గలుగుచుండుటయు దమ కోడండ్రును మనుమరాండ్రును, గూతుండ్రును సభలకు వెళ్ళుట తప్పోయని భావించి వారిని నివారించు పెద్దలగు సతులు సైతమీసభలకు గ్రమక్రమముగా విచ్చేసి ఇందలి మంచిని గ్రహించి యానందించుచుండుటయు జూడగా.... సమాజము.... దినదినాభివృద్ధి నొందగలదని" ఆశాభావాన్ని వ్యక్తం చేసింది.

కొంతకాలము పనిచేసిన తర్వాత సమాజం స్తబ్దమైపోయింది. పిమ్మట 1910 ఏప్రిల్ 8న అంటే 'సౌమ్యనామసంవత్సర ఫాల్గుణ బహుళ త్రయోదశీ శుక్రవారము' పునరుద్ధరింపబడింది. పునరుద్ధరణ తరువాత లక్ష్మీనరసమ్మ (ఈమెపేరు 'నరసమాంబ' అని తరచూ సమకాలీన పత్రికల్లో ప్రచురింపబడ్డది) అధ్యక్షురాలు కాగా దామెర్ల సీతమ్మ, బాలాంత్రపు శేషమ్మలు కార్యదర్శినులయ్యారు. దామెర్ల సీతమ్మ కోశాధ్యక్షురాలుగా కూడా బాధ్యతలు నిర్వహించింది. సమాజం స్పష్టమైన లక్ష్యాలనూ, 'కార్యపద్ధతి' నీ ప్రకటించింది. 'ప్రస్తుతము మనదేశమునందు మిక్కిలి కొరవడియున్నట్టియు దేశోద్ధారణకు ముఖ్యముగా గావలసి యున్నట్టియు విద్యాధనంబును దెలుగుదేశపు స్త్రీలెల్లరకు గొల్లలుగా లభింపజేయుచు వారిని నీతి, విద్యాసంపన్నులగను, సత్కార్యాచరణ పరాయణలుగను, దేశోపకారధురీణలుగను, జేయుట ఈ సమాజం

యొక్క ప్రధానోద్దేశమైయున్నది' అని స్పష్టంగా లక్ష్యాన్ని నిర్వచించింది. 'హిందూకుల స్త్రీల నెల్లర, సభ్యురాండ్రుగ' చేర్చుకొనుట, సమాజ నిర్వహణకు కావాల్సిన ధనాన్ని చందాల రూపంలో వసూలు చేయుట, ఒక పుస్తక భాండాగారమునేర్పరచుట, ఒక 'స్త్రీ విద్యాలయము' నేర్పరచి అందులో 'విద్యార్థినులగు వితంతుసోదరీమణులను, గన్యామణులను, జానానా స్త్రీలను' చేర్చుకొనుట, 'ఇతర గ్రామములందక్కడక్కడ స్త్రీ పాఠశాలలను, స్త్రీ సమాజములను స్థాపించుట, స్థాపింపప్రోత్సాహ పరుచుట' అనే కార్యపద్ధతిని నిర్ణయించింది. సమాజానికి అన్ని విధాలుగా సహాయ సహకారాలందించిండని ప్రార్థించింది[7].

## 3

## వివాదానికి బీజం

పునరుద్ధరణ తర్వాత సమాజం కొంతకాలం బాగానే నడిచింది. మధ్యలో 1910 జూన్‌లో గుంటూరులోని 'స్త్రీ సనాతన ధర్మమండలి' ఆధ్వర్యంలో జరిగిన మొదటి 'ఆంధ్రమహిళాసభ' సమావేశంలో విద్యార్థినీ సమాజం క్రియాశీలక పాత్రపోషించింది. రెండవ 'ఆంధ్రమహిళాసభ' సమావేశాలు విద్యార్థినీ సమాజ ఆధ్వర్యంలో కాకినాడలో 1911 ఏప్రిల్‌లో నిర్వహించాలన్న నిర్ణయమైంది. ఆమేరకు 'సావిత్రి' పత్రిక (మార్చి 1911) లో పులుగుర్త లక్ష్మీనరసమాంబ ('ఆంధ్రమహిళా మహాసభా కార్యదర్శిని') పేరు మీద ఎనిమిది పేజీల సుదీర్ఘ ప్రకటన వెలువడింది.[8] అందులో '1910 జూను రెండవ తేదీని..... కొంతవరకు ఆంధ్రదేశ స్త్రీలను సమావేశము గావించి ఇట్టి సభను జరిపితిమి..... ఇంతకంటె గొంత పెద్ద ఏర్పాటుమీద నీ సభ ఈ సంవత్సరము కాకినాడలో జరపబడుటకు నిర్ణయింపబడినది..... ఈ సభకు ఆంధ్రదేశపు చాతుర్వర్ణ్యములలోని కులాంగనలగు ప్రియసోదరీమణు లెల్లరు ఆదరణపూర్వకముగానాహ్వానము చేయబడుచున్నారు..... చాతుర్వర్ణ్యములలోని యంతశాఖలవారు సోదరీమణులు తాము తమరాకను దెలియజేయునపుడు తమతమ వర్ణవివక్షతనుగూడ దెలియజేసినచో వారికనుకూలములగు సదుపాయము అచ్చట జరగ గలవు' అని ప్రకటించారు. సభలో చర్చించబడు విషయములను 'ఉపన్యాస వివరము' అనే శీర్షికన 'విద్యావిషయము', 'సంఘవిషయము', 'గృహవిషయము' అనే ఉపశీర్షికల కింద విభజించి 22 విషయాలనిచ్చారు.

అనుకున్నట్లుగానే 1911 ఏప్రిల్ 28, 29 తేదీల్లో మహాసభ జయప్రదంగా జరిగింది; 30వ తేదీన విద్యార్థినీ సమాజ వార్షికోత్సవం జరిగింది. ఆంధ్రమహిళాసభకు కళ్ళేపల్లె వేంకటరమణమ్మ, వార్షికోత్సవ సమావేశానికి బుర్రె బుచ్చి బంగారమ్మ అధ్యక్షత వహించారు. ఈ సముమేశాల్లోనే విద్యార్థినీ సమాజ అధ్యక్షురాలికీ, కార్యదర్శినులైన దామెర్ల సీతమ్మ, బాలాంత్రపు శేషమ్మ లకూ మధ్య వివాదం చెలరేగి తర్వాత నర్సమాంబ కర్యాదర్శినులను బహిష్కరించడం, వెలివేయడం, ఇరువర్గాలకూ చెందిన వారు విద్యార్థినీ సమాజం తమదంటే తమదని వాదించుకోవడం, ఇరుపక్షాల వారికీ సపోర్ట్ గా యింకొందరు చేరడం యిలా సమకాలీన పత్రికల్లో ఒక భీకరమైన అక్షరయుద్ధం జరిగింది.

వివాదానికి మూలకారణం మహాసభ సమావేశాల్లో కొందరు పునర్వివాహితలుండడమే. సభలకు పునర్వివాహితలను ఎవరు పిల్చారన్న విషయం దగ్గర మొదలైన వివాదం, సదరు సమావేశాలకు పునర్వివాహిత లు రావచ్చా, రాకూడదా, అని కొనసాగి అసలు పునర్వివాహితలు 'కులాంగనలా, కాదా' అనే చర్చలో తారాస్థాయికి చేరింది. పులుగుర్త లక్ష్మీ నరసాంబ వర్గం పునర్వివాహితలు 'కులాంగనలు' కాదంటే, సీతమ్మ, శేషమ్మల వర్గం ఔనంది. ఫలితం కార్యదర్శినులైన సీతమ్మ, శేషమ్మల వెలివేత. దీంతో వివాదం ఇంకా ముదిరిపోయింది. ప్రతివర్గం తనవాదం సరి అంటే తనవాదం సరియనడంతో సుదీర్ఘ చర్చ జరిగింది. ముందుగా లక్ష్మీనరసమాంబ వాదనను చూద్దాం.

## వివాద ప్రస్థానం

నరసమాంబ వర్గం[9] ప్రకారం (1911 జూలై, సావిత్రి, పు. 3-5) ' ఈ సమాజము యొక్క కార్యదర్శినులు సమాజ నిబంధనలకు వ్యతిరేక భావములనుమాచరించుచువచ్చి చివరకు మొన్నటి ఆంధ్రమహిళా మహాసభతో గలిపి 1911 సంవత్సరము ఏప్రిల్ 30వ తేదీని చేయబడిన ఈ సమాజ సంవత్సరోత్సవ సభయందు బునర్వివాహితలను జేర్చుట మున్నగు సభానిబంధనలకు వ్యతిరేకములగు కార్యములను సాహసముతోనాచరించి సామాజికురాండ్ర యొక్కయు పురస్త్రీల యొక్కయు నిరుత్సాహమునకు గారకురాండ్రైరి.' వారు అంతటితో ఆగకుండా 'పిమ్మట గూడ' సమాజ వారసభలకు 'బట్టుదలతోడను సాహసముతోడను' పునర్వివాహితలను తీసుకువస్తుండడం వల్ల 'సామాజికురాండ్రనేకులు వారసభలకు బొత్తుగా రాకుండుట మున్నగునవి జరగుచు సమాజమునకు ఒక్కపెట్టున క్షీణదశ' కలగడమారంభమైంది. 'గార్యదర్శినుల ఐకమత్యాభావకారకములగు' కృత్యములను 'సహింపజాలక' వారిని సమాజంనుండి తొలగించడం, కోసం 1911 జూలై రెండవ తేదీన నరసమాంబ ఇంట్లో 'నొక పెద్ద సభగావించి' సదరు నిర్ణయం తీసుకోవడమైంది. సీతమ్మ, శేషమ్మలు ఇకపై కార్యదర్శినులు కారని ప్రకటన కూడా వెలువడింది. కొత్త కార్యనిర్వాహక సభ్యురాండ్రను ఎన్నుకోవడం జరిగింది. సమాజ కార్యస్థానాన్ని కూడా మార్చడమైంది[10].

దీనిపై సీతమ్మ, శేషమ్మలు తీవ్రంగా స్పందించారు. నరసమాంబ వర్గం 1911 జూలై ఏడు నాటి 'కృష్ణా పత్రిక'లో (పు.9) సమాజ విషయమై రాసిన రాత 'యత్యద్భుతము గాను విచారము గల్గించునదిగాను' ఉందన్నారు. నరసమాంబ ఆరోపించినట్లు తామేమీ సమాజ నిబంధనలకు వ్యతిరేక చర్యలు చేయలేదనీ, ఒకవేళ చేసి ఉంటే సభ్యురాండ్రే తమను తొలగించి ఉండేవారనీ, సమాజం నుండి విడిపోయిన నర్సమాంబగారే నిబంధనలకు వ్యతిరేకంగా నడుస్తున్నారనీ వాదించారు. అంతేకాక ఆంధ్రమహిళామహాసభ అయిన తర్వాత విద్యార్థినీ సమాజ కార్యదర్శినులు, కొందరు సభ్యురాండ్రు ఎంతగా కోరినా నరసమాంబ సమావేశాలకు రాలేదనీ, దాన్ని బట్టి సమాజాభివృద్ధిలో ఈమెకెంత శ్రద్ధ ఉందో తెలుస్తోందనీ, సభ్యురాండ్ర అనుమతి లేకుండా కార్యనిర్వాహకులను మార్చే అధికారము

ఆమెకెవరిచ్చారో తమకు తెలియకున్నదనీ, అలాంటి ఏకపక్ష నిర్ణయాలు తీసుకోవడం 'నరసమాంబగారి యతిసాహస'మనీ తేల్చి చెప్పారు. విషయాన్ని యింకా విశదపరుస్తూ జులై రెండవతేదీన జరుగులాగున నిశ్చయించబడిన 'కార్యాలోచనసభ'కు రావాల్సిందిగా 13 మంది సంతకాలతో ఉత్తరాన్ని నరసమాంబగారి ఇంటికి తామే పంపినామనీ, కానీ ఆమె 'జవాబు వ్రాయక తామునూ రాక, రాని కారణమును' కూడా తెలియబరచకుండా ఉండిపోయిందన్నారు. పైపెచ్చు ఆమె సంతకముతో కూడిన 'ఆహ్వానపత్రికలు' జూలై రెండున ఒంటిగంటకు తామందరికీ చేరాయనీ, వాటిలో సమాజ కార్యస్థానం మార్పును గూర్చీ, 'పునర్వివాహితలిందు జేర్చుకోబడరు' అని ఉండడం చూచీ ఇక 'యామె రాదని' నిశ్చయించుకొని నరసమాంబ స్థానంలో దుగ్గిరాల రమణమ్మను యేర్పరచి తాము సభ గావించామనీ, అందులో ఇకపై సమాజాధ్యక్షురాలిగా కళ్ళేపళ్ళె వెంకటరమణమ్మను ఎన్నుకున్నామనీ, నరసమాంబను తీసీవేయడమైందనీ చెప్పారు. అంతేకాక నరసమాంబ ఆరోపించినట్లుగా సమాజం క్షీణించడంలేదనీ, 'మిగుల అభివృద్ధి' చెందుచున్నదనీ, సమాజ వార సభలు ఎప్పటిలాగే అత్తోట లక్ష్మీ నరసింహము గారింటనే జరుగుతాయనీ, 'స్త్రీలు వచ్చుట లేదని నర్సమాంబగారు వ్రాసిన వ్రాత తప్పు' అనీ, ప్రతివారము 25 మందికి పైగా వస్తున్నారనీ, అందుకే సమాజం కోసం పత్రికలు, పుస్తకాలు, డబ్బులు పంపేవారు బాలాంత్రపు శేషమ్మ, సీతమ్మల పేర్లమీదనే పంపవలెననీ విన్నవించుకున్నారు[11].

ఈ విధంగా సమాజం తమదంటే తమదనీ, నిబంధనలను మీరుల్లంఘించారంటే, మీరుల్లంఘించారనీ యిరువర్గాలు వాదులాడుకున్నాయి. తుదకు సమాజం శేషమ్మ, సీతమ్మ, వెంకట రమణమ్మల పేరుతోనే కొనసాగింది. ఇది వివాదంలోని ఒక భాగం మాత్రమే. అంతకంటే భీకరమైన అక్షరయుద్ధం 'పునర్వివాహితలు కులాంగనలా కాదా' అనే విషయం మీద జరిగింది. పునర్వివాహితలు కులాంగనలు కాదన్న నరసమాంబపై పలువురు విరుచుకు పడ్డారు. ఆమె కూడా సివంగిలా గర్జిస్తూ ఎదురుదాడికి దిగింది. ఈ దాడి ప్రతి దాడులతో సమకాలిక పత్రికలు యుద్ధభూములయ్యాయి.

'ఆంధ్రమహిళా మహాసభ' అనే పేరును అధిక్షేపిస్తూ 'ఆంధ్రపత్రిక' ఆ పేరును బట్టి స్త్రీలందరూ అక్కడకు వెళ్ళవచ్చని మనం ఊహిస్తామనీ, కానీ పునర్వివాహితస్త్రీలు, ఆంధ్రక్రైస్తవులు మొదలైన వారి రాక పట్ల అభ్యంతరం చెప్పే నరసమాంబ ఈ పేరును 'బెట్టియే యుండగూడదనీ, దానికి బదులుగా "పునర్వివాహిత స్త్రీ నిషేధ, ఆంధ్ర బ్రాహ్మణ స్త్రీ సభ" అని పెట్టి ఉంటే బాగుండేదనీ వెక్కిరించింది[12]. దీనికి స్పందించిన నరసమాంబ పలువురు వైశ్య, శూద్ర స్త్రీలు పాల్గొన్న సభను 'బ్రాహ్మణ స్త్రీ సభ' అని ఎలా పిలవగలమనీ, ఈ అధిక్షేపణ 'పండిత ప్రకాండులగు మా సోదరుల' 'మనస్సునందెంత ఈసు' ఉన్నదో స్పష్టం చేస్తోందనీ, 'ఆంధ్రులన నాంధ్రదేశమునందలి హిందువులగుదురు కాని క్రైస్తవాదులు (ముస్లింలు) కానేరర'నీ వాదించింది. తన వితండ వాదాన్ని సమర్థించుకోవడానికి కొన్ని హాస్యాస్పదమైన ఉదాహరణలిచ్చింది. ఆంధ్ర పత్రికాధిపతిపై ప్రతిదాడికి దిగుతూ 'ఆంధ్రపత్రిక' అనే పేరు దానికెలా తగిన పేరౌతుందని ప్రశ్నల వర్షం కురిపించింది. ఆమె ప్రకారం, 'దేశ చరిత్రములంబట్టి చూడ బ్రాహ్మణులాంధ్రులు కారు. ఆంధ్రులు శూద్రులు..... బ్రాహ్మణులుత్తర దేశమునుండి ఈ దేశమునకు వచ్చిన పరదేశులు'. కాబట్టి శూద్రులను ధ్వనింపజేసే పేరు 'ఆంధ్రపత్రిక' కెలా పొసగుతుందనీ, బ్రాహ్మణుడైన పత్రికాధిపతి అపేరెలా పెట్టగలిగాడనీ ఇంకా ఇలా అనేకంగా ప్రశ్నిస్తూ దాన్ని "ఆంధ్రపత్రిక" అనకుండా "నాంగ్లేయభాషాసంస్కార సంకలిత సంఘసంస్కార ప్రియామృతాంజన పత్రిక" అంటే బాగుంటుదేమో అని వెక్కిరింతతోనే సమాధానం చెప్పింది[13]. 'అమృతాంజనం' అధిపతిని 'స్ట్రాంగ్' గా ఢీకొట్టింది.

పునర్వివాహితలు 'కులాంగనలు' కానేరరనేది లక్ష్మీ నరసమాంబ గారి ప్రగాఢ విశ్వాసం. మహిళాసభ తాలూకు ప్రకటన పత్రికలో "జాతుర్వర్ణ్యములలోని కులాంగనలెల్లర" సభకు రావచ్చునని ఉందన్న విషయం ముందుగానే చూశాం. 'మీరు కులాంగనలనే పిల్చెదమనుచున్నారు. 'పునర్వివాహితులను పిలువరా?' అని కొందరు తనకు ఉత్తరాలు రాసినారని అంటే తన వ్యాఖ్యానం అక్కర్లేకుండానే పునర్వివాహితలు కులాంగనలు కారన్న విషయం 'లోకులకెల్లర' అర్థంమైందనీ, కానీ సంఘసంస్కార ప్రియులు లొల్లి చేస్తుండడాన తను సమాధానమిస్తున్నానీ చెప్పింది; తన వాదన నిరూపణార్థం తనురాసిన సుదీర్ఘ వ్యాసాల్లో స్మృతుల నుండీ, శాస్త్రాలనుండీ అడుగడుగునా ఉల్లేఖించి అద్భుతమైన పాండిత్యాన్ని ప్రదర్శించింది.

వితంతు పునర్వివాహ సమర్థకులు దమయంతీ ద్వితీయ స్వయంవరాన్ని ఉదాహరణగా చూపుతున్నారనీ, కానీ 'యాగ్రంథముం బట్టియే పునర్వివాహము కులస్త్రీ ధర్మముకాదని తేలుచున్నదంటూ నలుడు దమయంతితో చెప్పిన '....యన్యాపేక్షంబున స్వయంవరంబు రచియించుట ఇది కులస్త్రీ ధర్మంబుగాదు' అనే శ్లోకాన్ని ఉటంకించింది. పునర్వివాహవాదులు మనుస్మృతిని కోట్ చేస్తున్నారనీ, కానీ 'ఆ మనుస్మృతియే' "నద్వితీయశ్చ సాధ్వీనాం క్వచిద్భర్తోపదిశ్యతే" అని ఘోషించుచున్నదనీ, 'సాధ్వులకు మాత్రము పునర్వివాహములేదని దీనియర్థము' అనీ 'కులాంగనకు బ్రతికియుండినను మృతినొందినను గూడ నొక్కడే పతియని పతిమృతినొందిన మాత్రముచే నాతని పతిత్వము పోదని శాస్త్రములు మొరలిడుచున్నవ' నీ వాదించింది. పునర్వివాహ సమర్థకులు తనపై కత్తిగట్టి 'వెనుకముందులాలోచింపకుండా 'వట్టి సాహసపు వ్రాతలు' రాస్తున్నారనీ, వితంతు సోదరీమణులకు 'బ్రహ్మచర్యముత్కృష్టధర్మమని' ఒకానొక సభలో తను ప్రసంగించినందుకు 'కోపించి చిందులు తొక్కుతున్నార'నీ, కొంతమంది సోదరులు 'వితంతు స్త్రీల స్థితిని గూర్చి సుమంగళలగు వారేమి చెప్పగలరని' ఆక్షేపిస్తున్నారనీ చెబుతూ 'స్త్రీల స్థితిని గూర్చి స్త్రీలే చెప్పుటకవకాశము లేనప్పుడు' పురుషులేవిధముగా చెప్పగలరని ప్రశ్నించింది. 'నిరుపమాన పాతివ్రత్యమున కునికిపట్టైన హిందూదేశము యొక్క నిర్మల కీర్తికి గళంకముదెచ్చు పునర్వివాహము భూష్యముగాదని' తను అన్నప్పుడు "ఈమెకు బునర్వివాహితల పొడగిట్టదు" అని కోలాహలములతో ఘోషించిన సోదరులు తనలాంటి భావాల్నే వెలిబుచ్చిన బుర్రె బుచ్చి బంగారమ్మను

ఎందుకు దూషించడం లేదని నిలదీస్తూ బంగారమ్మ ప్రసంగ పాఠాన్ని ఉటంకించింది. కానీ బంగారమ్మ ప్రసంగం నరసమ్మ చెప్పినట్టు లేదు!

తను ' ఈసభలకు గులాంగనలను మాత్రమే' ఆహ్వానించానని ఒప్పుకున్న నరసమాంబ తనాపని చేసింది వితంతువుల పొడ గిట్టక కాదనీ, 'వారి పొడమాకు గిట్టదనుట కల్లబొల్లిపలుకు' లనీ, తానలా చేయడానికి వేరే కారణం ఉందనీ, పునర్వివాహిత స్త్రీలపట్ల సమాజములో నున్న తూస్కార భావంవల్లనే తానలా చేయాల్సి వచ్చిందనీ చెప్పింది. ఆమె మాటల్లోనే "....పేరంటములకు సైతము పదిమంది స్త్రీలు కూడిన యొకచోటకు నేకారణము చేతనైనను నొక పునర్వివాహిత రాదటస్థించినపుడు పేరంటాండ్రందరు నొకరిమోమొకరు చూచుకొనుట విధవపెండ్లి వాండ్లను మనవాండ్లను గలుపుచున్నారని పదిమందిలో గల వెలలుపుట్టుట గొందరు వెంటనే యచట నుండి వెడలిపోవుట మరికొందరు వీరింటికెరుగక పోయివచ్చితిమిక నెప్పుడు రాగూడదని పలుకుట మున్నగు గొడవలు పునర్వివాహితలు వసించునిట్టి గ్రామములలో జరుగుచుండుట యెల్లదెరుంగురు. స్త్రీ విద్య నూతనముగా దలయెత్తుచున్న ఈ సమయములో సంస్కారులమని పేరుపెట్టుకొన్న కొందరు సోదరులు చేయ విధవావివాహపుటల్లరుల నందున ననేక స్త్రీల విద్యాభివృద్ధికిని నిరోధములు గల్గుచున్నవి..."

అంతేకాకుండా అప్పట్లో "ఈ స్త్రీ సభలు విధవపెండ్లిండ్లు చేయుటకును వాళ్ళను మనలను గలుపుకునే గాబోలు ననుపలుకు స్త్రీ సంఘమునందేమూల జూచినను వినబడుచుం'డినదనీ," సాంఘిక నిబంధనలకు మీరి సంఘముకొరకు బాటుపడుటవలన బ్రయోజనము లేదని నమ్మిన" దగుటచే మాత్రమే పునర్వివాహితల పిలువలేదనీ, వారిపొడగిట్టకపోవడంవల్ల కాదనీ, కులాంగనలను మాత్రమే పిల్చినానని తాను ఒకవైపు "త్రికరణశుద్ధిగా" ఒప్పుకుంటున్నా "కొందరు సోదరులు" మాత్రం తామే పునర్వివాహితలు కొందరికి "దొంగపిలుపులు పంపి" వారిని నేనే పిల్చినాననీ, పిల్చికూడా పిలవలేదని నేనంటున్నానీ అభండాలు వేస్తున్నారని వాపోయింది; "ఇంత మాత్రముచేతనేమగును? వేడినీళ్ళకిళ్ళుగాలునా?" అని విసుగుతో ప్రశ్నించింది.

ఆమె ప్రకారం సమావేశాలకు రావల్సిందిగా పునర్వివాహితలకు సంస్కారులు కొందరు "గల్లజాబులంపి.... విశ్వప్రయత్నము మీద" ఒక పునర్వివాహితను పొరుగూరునుండి రప్పించారు. తీరా ఆమె వచ్చాక పట్టించుకోకుండా అంతర్ధానమయ్యారు. అప్పుడు తనే అమెకు 'యుచిత సదుపాయములు గావించి' సాగనంపింది. దీనినిబట్టి ఎవరికి పునర్వివాహితల పొడ గిట్టుతుందో, ఎవరికి గిట్టదో స్పష్టమౌతుందని చెప్పింది. 'పునర్వివాహితలపై మాకప్రియముగాని ప్రియముగాని లేదు' అని స్పష్టపరుస్తూ 'దేశక్షేమము కొరకును సంఘోద్ధారణకొరకును' పని చేయాలను కొన్నప్పుడు 'దేశీయధర్మములను, సాంఘిక నిబంధనలను సదాచారమును మీరకూ'డదని 'మా సోదరసోదరీ రత్నములకు' విన్నవించుకుంది.

నరసమాంబ రాత తీవ్ర ప్రకంపనలను సృష్టించింది. దీనికి స్పందిస్తూ బుర్రె బుచ్చి బంగారమ్మ 1911 ఆగష్టు 25 తేదీనాటి 'కృష్ణాపత్రిక'లో (పు. 4) "వైవాహిక ధర్మమునను సరించి యెన్నిమారులు వివాహము జేసికొనినను కులట అనిపించుకొనరు" అని రాయగా అది చూచిన నరసమాంబకు తిక్కరేగినట్లైంది. "ఆహా, కాలమా! ఏమినీ మహిమ!! కటా పుణ్యభూమియైన యార్యావర్తమా! నీ పూజ్యత పుజ్యతయగుట కిట్టివే గదామార్గములు... స్వజాతియైన స్త్రీల పాతి వ్రత్యధర్మమును సమూలముగా బెల్లగింపజాలిన విపరీతధర్మములను స్త్రీలే ముచ్చటించు చుండుట యెంతటి శోచనీయము...." అని వాపోయింది. ఎన్నిసార్లు కావాలంటే అన్ని సార్లు పెళ్ళి చేసుకున్న స్త్రీ 'కులాంగన' అయ్యేటట్లయితే "వేశ్యాదులు తామును గులాంగనలమే యందురు గదా!" అంది[14]. 'దేశమాత' పత్రికాధిపతి మొదలైనవారు తనమీద చేసిన దాడికి విసిగిపోయి ఆగ్రహోదగ్రురాలైన నరసమాంబ 'ఓ పునర్వివాహభి లాషులగు సోదరీ సోదరులారా! మీ విపరీతధర్మ స్థాపనార్థము లోకమును మోసము చేయజూడకుడు! మీ సిద్ధాంతములతో నేకీభవింపజాలని వారిని మీ యపవాదపరంపరలలో ముంచుచు వారియెడల మీ దూషణ పాండిత్యమునుపయోగపరచుచు సంస్కరణ శబ్దమున కపశయమును దేబోకుడు!" అని హితవు పలికింది[15].

నరసమాంబ సత్తిరాజు శ్యామలాంబ, మాడభూషి చూడమ్మ, బుర్రె బుచ్చి బంగారమ్మ లాంటి వారనేకులు విమర్శించినప్పటికీ అతి ఘాటైన విమర్శమాత్రం కొటికలపూడి సీతమ్మనుండి వచ్చింది; తన వ్యాసంలో కొటికలపూడి సీతమ్మ నరసమాంబను చీల్చి చెండాడింది[16]. ఆంధ్రమహిళా సభలో జరిగిన సంగతులను 'ప్రత్యక్షముగా జూచివచ్చిన' వారినుండీ, పత్రికల ద్వారానూ తెలుసుకున్న సీతమ్మకు నరసమాంబ గారికి 'హితోపదేశము' చేయాలన్పించింది. నరసమాంబ భాషాజ్ఞానమునందు అరితేరినదైనప్పటికీ 'యంధపరంపరగా నాచరింపబడు పూర్వదురాచారములదెట్లయిన నిలవబెట్టవలెనని పెనుగులాడుచు విద్యాధికులగు పత్రికాధిపతులతో బ్రతిఘటించి స్వలోపములను గప్పిపుచ్చుటకు' వ్యర్థప్రయత్నములు చేయుచున్నదనీ, ఆమె వలన 'పాండిత్యమునకును ప్రపంచ జ్ఞానమునకును సంబంధము లేదన్న సంగతి' తనకు స్పష్టపడుతోందనీ అంది. స్త్రీ జనోద్ధరణకై తను జరుపతలపెట్టిన సభవల్లనే ఆమెకు యింతటి 'జనదూషణ కలుగుట' కడు శోచనీయమనీ, నర్సమాంబ పరిస్థితి "అయ్యవార్లను జేయబోయిన కోతియయ్యేనన్నట్టు"న్న దనీ వ్యాఖ్యానించింది. నరసమాంబ తన స్వలోపములను కనుక్కోకుండా వివిధ పత్రికాధిపతులతో 'యసహ్యకరములైన యుదాహరణములతోడను, పరుషవాక్యముల తోడను' వాదులాడడం 'స్త్రీ జనమునకంతకు నపఖ్యాతి కరమని' సిగ్గుచెందాల్సి వస్తోందన్నది.

నరసమాంబ చేసిన పనుల్లో సభను గూర్చి ప్రకటన పత్రికలురాయడం దగ్గర్నించీ 'అన్నియులోపములే' జరిగాయంది. సభకు వచ్చినవారు తమ-తమ అభిప్రాయములను సేచ్ఛగా ప్రకటించడానికి అవకాశమియ్యక ఏమోమో నిబంధనలనేర్పరచి 'అందరి అభిప్రాయ ములు మీయభిప్రాయములకు లోబడియుండవలెనన్న నిర్బంధ' మేర్పరచడం నరసమాంబ చేసిన మొదటితప్పంది. నరసమాంబ

చెప్పినట్టుగా పునర్వివాహితలు కులాంగనలు కానేరరని తమంతట తాముగా జనావాహించలేదనీ, ఆమె కార్యాచరణను బట్టియే అలాంటి అనుమానం కల్గిందనీ చెబుతూ 'స్త్రీలకు బునర్వివాహము మంచిదికాదనీ' నరసమాంబ 'నిన్నగాకమొన్న' బందరులో ఇచ్చిన ఉపన్యాసాన్ని గుర్తుచేసింది. పునర్వివాహితలకు తన పేరుతో ఆహ్వాన పత్రికలను పంపీ, ఈ విషయాలు, మొదట వాళ్ళముందు ఒప్పుకొనీ, చివరికి సభలోనూ, పత్రికల్లోనూ తను పంపలేదనీ, యితరులెవరో తనపేరిట పంపారనీ వాదిస్తున్న ఆమె 'కళంకవర్తనము' చూస్తే విచారము కల్గుచున్నదనీ అంది. ఈ విధంగా తనలో 'తప్పుల కుప్పలను' ఉంచుకున్న నరసమాంబ తనను విమర్శించినవారికి సమాధానమిస్తూ 'మరికొన్ని యసత్యవచనములను జేర్చి పాపపుంజములను బలపరచుకొనుట' ఆమెలోని విద్యకు 'నపఖ్యాతికరమైయున్నద'నీ, అయినా ఆమెలాంటి 'యసత్యవాదినులు లోకములో లేకపోర'నీ నిందించింది. స్త్రీ పునర్వివాహములకు వ్యతిరేకంగా ఆమె చూపిన ఉదాహరణలు 'మిక్కలి పరిహాసాస్పదము' లుగా ఉండి ఆమెను అల్పజ్ఞ'గా నిరూపిస్తున్నాయని దెబ్బవేసింది. 'నాలుగు కావ్యములను జదివితినన్న గర్వముతో" నరసమాంబగారు 'స్త్రీపునర్వివాహమును దూషించినందువల్ల ఆమె 'యల్పజ్ఞానము' వెల్లడౌతుందేగాని పునర్వివాహములు క్షీణింపబోవని' నొక్కి చెప్పింది. వితంతు పునర్వివాహములవలన 'మునుపున్న శిశుహత్యలు మొదలగు దుష్టచేష్టలిప్పుడు తగ్గినవని' తెల్పుతూ 'ఈ విషయమున ఇతర జాతియగు పురుష హృదయమే కరిగి పదునుపదుచుండగా స్వభావకోమలమగు స్త్రీ హృదయము గట్టిపడి రాయియై స్త్రీలకు బునర్వివాహము కూడదనుట అద్భుతకరమును అపఖ్యాతికరమునునై గానబడుచున్నందున సతులందరు తలలు వంచుకొనవలసి వచ్చుచున్నది' అన్నది. "గుడిపడ గొట్టకున్న గుగ్గిలము వేసినంత ఫలము" అను సామెత ప్రకారం అనుభవము లేని విషయములో ప్రసంగింపకుండా ఉండడమే మేలని నరసమాంబకు హితవు చెబుతూ 'కాబట్టి యోసోదరీ రత్నమా! వ్యర్థములైన సమాధానములిచ్చుటకిక ప్రయత్నింపక' వివేకముతో వ్యవహరించు అని కోరింది, హెచ్చరించింది.

ఈ విధంగా కొటికలపూడి సీతమ్మ నరసమాంబకు చెంపపెట్టు పెట్టింది. నరసమాంబను తమ అక్షరాస్త్రాలతో క్షతగాత్రురాల్ని చేసినవారు పలుమంది ఉన్నప్పటికీ స్థలా భావము కారణంగా మనం చర్చించడం లేదు. వివాదం ఇలా కొనసాగుతూ పోవడం మంచిది కాదని యెంచిన 'హిందూసుందరి' పత్రికాధిపతియైన సత్తిరాజు సీతారామయ్య జోక్యం చేసుకొని 'ఇప్పుడిప్పుడే తలయెత్తుచున్న స్త్రీ విద్యయందభిమానముగల నాసోదరీమణులందరూ ఈ చర్చనింతటితో ముగించి విద్యాభివృద్ధికై యెవరికి తోచినటులవారు పాటుబడగోరుచున్నాము' అంటూ హిందూ సుందరిలో చర్చను ముగించారు[17].

సుదీర్ఘమైన ఈ వివాదం వలసాంధ్రలో వితంతుసమస్యకు సంబంధించిన పలుకోణాలను వెలుగులోకి తెస్తుంది. వీరేశలింగం లాంటి పురుష సంస్కర్తలు ప్రారంభించిన వితంతు పునర్వివాహోద్యమ భావాలు లోతుగా పాతుకోలేకపోయాయన్నది దీన్ని బట్టి అర్థమౌతుంది. ఏ స్త్రీ సమాజ ఉద్ధరణకై సంస్కర్తలు పాటుపడ్డారో ఆ స్త్రీ సమాజంలోనే వితంతు సమస్యపై పాతుకుపోయిన స్పష్టమైన విభజన ఉన్నదనీ, విద్యావంతు లైనంత మాత్రం చేత స్త్రీలు అన్ని రకాల సంస్కరణలకు సిద్ధపడరనీ స్పష్టమౌతుంది. పునర్వివాహంతో ఒక సమస్యనధిగమించిన విధవలకు సామాజిక ఆమోదం లేకపోవడం, గౌరవప్రదమైన స్థానం లభించకపోవడం, సామాజిక వెలివేత లాంటి సమస్యలు చుట్టుముట్టడం గమనించవచ్చు. ఘనమైన హిందూ పతివ్రతా ధర్మానికి మచ్చగా వారు చూడబడెదరు. ఏది ఏమైనప్పటికీ పులుగుర్త ఈ వివాదంలో ఓడిపోవడమన్నది కన్సర్వేటీసమ్ యొక్క ఓటమి; గాలి సంస్కరణ వైపే వీచుచున్నదనడానికి ప్రబల నిదర్శనం.

*(మిగతా వచ్చే సంచికలో...)*

**అంత్యసూచికలు**

6. విద్యార్థినీ సమాజ సంక్షిప్త చరిత్ర హిందూసుందరిలో తరచూ ప్రచురించబడేది. కొన్ని సంచికల్లో 1904ను సమాజ స్థాపనా సంవత్సరంగా ఇచ్చారు. ఉదాహరణకు ఆగస్ట్ 1913 (పు.10), జూన్ 1916 (పు. 5). కానీ పులుగుర్త లక్ష్మీనరసమ్మ సమాజం ఉనికిలోకొచ్చిన విధానాన్ని తెల్పుతూ 1903 జనవరి అని ఇచ్చారు; ఇదే సరైన సంవత్సరంగా భావించాలి. చూడండి : పులుగుర్త లక్ష్మీ నరసమాంబ, 'శ్రీ కాకినాడ విద్యార్థినీ సంఘము యొక్క ప్రప్రథమ వత్సర విషయజ్ఞాపకము', సావిత్రి, మార్చి 1904. వివాద సందర్భంలో విద్యార్థినీ సమాజ చరిత్రను తడుముతూ మాడభూషి చూడమ్మ నరసమాంబ ఇచ్చిన తేదీని నిర్ధారించింది.

7. 'శ్రీ విద్యార్థినీ సమాజమ, కాకినాడ', సావిత్రి, మార్చి 1911, పు. 17-21

8. 'ఆంధ్రమహిళా మహాసభ', సావిత్రి, మార్తి 1911, పు. 1-8

9. భావరాజు మహాలక్ష్మమ్మ, కాశీభట్ల సూరమ్మ, ఉప్పుదారి సుందరమ్మ, చింతలపూడి సీతాదేవమ్మ మన్యం వెంకట సుబ్బమ్మ మొదలగువారు నరసమాంబ వర్గంలో ఉండేవారు. చూడండి :'శ్రీ విద్యార్థినీ సమాజము', సావిత్రి, జూలై 1911, పు. 365

10. పైదే

11. 'శ్రీ విద్యార్థినీ సమాజము, కాకినాడ' (హిందూసుందరి, జూలై 1911, పు. 4-8

12. పులుగుర్తలక్ష్మీనరసమాంబ, 'ఆంధ్రమహిళా సభ', సావిత్రి, జూన్ 1911, పు. 3-4 నుంచి ఉటంకింపు.

13. పైదే. పు. 3-5

14. పులుగుర్త లక్ష్మీ నరసమాంబ, 'కులాంగనలు', సావిత్రి, అక్టోబర్ 1911, పు. 1-1

15. పై దే. పు. 9

16. కొటికలపూడి సీతమ్మ, 'ఆంధ్రమహిళా మహాసభ కార్యదర్శినిగారగు, శ్రీమతి పులుగుర్త లక్ష్మీ నరసమాంబ గారికొక విన్నపము', 'హిందూసుందరి, ఆగస్ట్ 1911, పు. 1-6.

17. హిందూ సుందరి, అక్టోబర్ - నవంబర్ 1911, పు. 38

◆

# అసహజ మరణాల సూచి

సంకలనం : **రాంకి, వై. రామచంద్రం**

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. ఆ సహజ మరణపు వయోపరిమితి దేశ కాల పరిస్థితులను బట్టి, జీవన ప్రమాణాలను బట్టి అరవైల నుంచి తొంబైల దాకా ఉండవచ్చు. కాని మన సమాజంలో సాధారణ ఆయు ప్రమాణం 63 సంవత్సరాలు అయినప్పటికీ ఎంతోమంది పుట్టుకలోనే మరణిస్తున్నారు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ మరణం అనేక రూపాలలో సంభవిస్తోంది. ఆకలి, అనారోగ్యం, మానసిక ఆందోళనలు, సామాజిక అసమానతలు, వరకట్న మరణాలు, నిర్లక్ష్యం, అంటరాని తనం, వ్యవసాయం, చేనేత వంటి రంగాల్లోని సంక్షోభాలు, పారిశ్రామిక అశాంతి, జీవనోపాధి లేమి అసహజ మరణాలకు లెక్కలేనన్ని కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైనపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే, ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

| తేది | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు తెలియని | ఆకలి | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| 21.12.07 నుండి 27.12.07 | 7 | – | 16 | – | – | – | 8 | 8 | – | – | 23 | 11 | 6 | 1 | 3 | – | 2 | – |
| 28.12.07 నుండి 03.1.08 | 2 | – | 18 | – | – | – | 10 | – | – | – | 37 | 10 | 12 | – | – | – | 2 | – |
| 04.1.08 నుండి 10.1.08 | 2 | – | 19 | – | – | – | 8 | 6 | – | – | 13 | 15 | 3 | – | – | – | – | – |
| 11.1.08 నుండి 20.1.08 | 6 | – | 16 | – | – | – | 8 | 3 | – | – | 29 | 8 | 3 | 2 | – | – | 4 | – |
| ఆదిలాబాద్ | 18 | – | 34 | – | – | – | 10 | – | – | 2 | 26 | 41 | 12 | – | – | – | – | – |
| గుంటూరు | 3 | – | 2 | – | – | – | 13 | 9 | – | 11 | 34 | 14 | – | – | – | – | – | – |
| శ్రీకాకుళం | 1 | – | 8 | – | – | – | 11 | – | – | – | 16 | 14 | 9 | – | – | – | – | – |
| చిత్తూరు | 2 | – | 22 | – | – | – | 9 | 4 | – | 8 | 40 | 17 | 16 | – | – | – | – | – |
| మహబూబ్‌నగర్ | 7 | – | 29 | 4 | – | – | 13 | 8 | 2 | 5 | 36 | 19 | 11 | – | – | – | 4 | – |
| మొత్తం | **48** | **–** | **164** | **4** | **–** | **–** | **80** | **38** | **2** | **28** | **254** | **149** | **72** | **3** | **3** | **–** | **12** | **–** |

ఈ శీర్షికకు సహకారం అందిస్తున్న వారు : హైదరాబాద్ – డి. విజయభాస్కర్; ఆదిలాబాద్ – శ్రీమన్నారాయణ మూర్తి;
గుంటూరు – బి. అంజమ్మ; శ్రీకాకుళం – జి. సుధీర్; మహబూబ్‌నగర్ – ఏసురత్నం; చిత్తూరు – పలమనేరు బాలాజి

*గమనిక : మీ అందరి సహకారంతో అన్ని జిల్లాల పూర్తి సమాచారంతో భవిష్యత్తులో ఈ శీర్షికను మరింత సమగ్రంగా అందించే ప్రయత్నం చేస్తాం.*

# తెలుగు సమాజానికి
# వెలుగు దివ్వె

**విధానాల విశ్లేషణలు**

ప్రభుత్వ విధానాలు - వాటి
పర్యవసానాలపై లోతైన విశ్లేషణలు

**క్షేత్ర నివేదికలు**

వివిధ పథకాల అమలుపై,
ప్రజల జీవన స్థితిగతులపై
సమగ్ర క్షేత్ర నివేదికలు




**వార్తా విశేషాల కదంబం**

ప్రధాన స్రవంతి పత్రికల్లో
అరుదుగా కనిపించే జాతీయ,
అంతర్జాతీయ కథనాలు

**అభివృద్ధి చర్చలు**

పోలవరం నుండి యురేనియం
ప్రాజెక్టు వరకూ 'అభివృద్ధి'పై
సవివరమైన చర్చలు

**ఆలోచింపజేసే గణాంకాలు**

మిమ్మల్ని కదిలించి, రగిలించే
అరుదైన గణాంకాలు

**పదునైన వ్యాసాలు**

వివిధ రంగాలలో లబ్ధప్రతిష్ఠులైన
వారి వ్యాసాలు, వ్యాఖ్యానాలు

**అధ్యాపకులు, అధికారులు, ఉద్యమకారులు, నేతలు, విద్యార్థులు, సామాన్య పాఠకులు**
**అందరికీ ఉపయోగపడే సమాచారాన్నిచ్చే సమగ్ర ఆర్థిక, సామాజిక మాసపత్రిక**

విడి ప్రతి: రు. 10/-　　　సంవత్సర చందా: రు. 120/-

ఎం.ఓ. / డి.డి. పంపవలసిన చిరునామా

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక పత్రిక

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029. ఫోన్ / ఫాక్స్: 040-66843495

RNI Regn.No.APTEL/2003/11482 Published 27/11/2007 PRINTED BOOK





# వినూత్నం... విజయవంతం!

## ప్రతి పథకం ప్రజలకే సొంతం

**విజయవంతమవుతున్న పథకాలు**

| | |
|---|---|
| జలయజ్ఞం | : 1.30 కోట్ల రూపాయలతో 1 కోటి ఎకరాల సాగు |
| ఇందిరమ్మ | : ఈ ఏడాది 20 లక్షల గృహాల నిర్మాణం. వచ్చే మూడేళ్లలో 80 లక్షల గృహాల నిర్మాణం లక్ష్యం. |
| ఇందిరాక్రాంతి పథం | : పావలా వడ్డీకే రుణాలు. 6500 కోట్ల రూపాయలు పంపిణీ. |
| రాజీవ్ గృహకల్ప | : పట్టణ పేదలకు సొంతఇల్లు |
| ఉపాధి హామీ పథకం | : 19 జిల్లాల్లో పేదలకు ఉపాధి. 36.50 లక్షల కుటుంబాలకు ప్రయోజనం. |
| ఇందిరప్రభ | : 500 కోట్లతో అసైన్డ్ భూముల అభివృద్ధి |
| ఆరోగ్యశ్రీ | : నిరుపేదలకు ఉచితంగా వైద్యం, శస్త్ర చికిత్సలు |













ఇవి... రాష్ట్ర ప్రభుత్వం అమలు చేస్తున్న వినూత్న పథకాల్లో ప్రముఖమైనవి. ప్రజల భాగస్వామ్యంతో అమలవుతున్న ఈ పథకాలు రాష్ట్రాన్ని హరితాంధ్ర ప్రదేశ్ వైపు నడిపించే దిశగా విజయవంతంగా అమలు జరుగుతున్నాయి.

## ఇందిరమ్మ రాజ్యం - ఇంటింటా సౌభాగ్యం

R.O.No.552/Sou/Advt.I/2007-08

జారీచేయువారు: సమాచార, పౌరసంబంధాలశాఖ

Printed, Published and Owned by V. Hanumantha Rao and Printed at Charita Impressions for Nutan Art Printers, 11-5-417-420, Red Hills, Lakdi-ka-pool, Hyderabad-500 004 and published at 8-3-898/22, Nagarjuna Nagar, Hyderabad-500 073. Editor : V. Hanumantha Rao